# ఈ జీవనజ్యోతి శాంతాకు స్ఫూర్తి





## చిన్న జ్యోతి సైతం మరొక జ్యోతిని వెలిగిస్తుంది
## చిన్న ప్రాణి సైతం మరొక ప్రాణికి ఊతమిస్తుంది

నిర్జీవ రసాయనాల జోలికి పోకుండా జెనటిక్ ఇంజనీరింగ్ ద్వారా సూక్ష్మజీవుల కణాలలో తగిన మార్పు చేసి అద్భుత ఫలితాలను సాధించే అత్యాధునిక జీవనవేదం - జీవ సాంకేతిక శాస్త్రం. అదే బయో టెక్నాలజీ. మన శరీర నిర్మాణానికి సన్నిహితంగా ఉండే జీవ ప్రక్రియ ద్వారా తయారయిన ఈ తరహా ఉత్పాదనలు మానవాళికి అనువైనవి; ఆరోగ్యరీత్యా సురక్షితమైనవి. బయోఫార్మా రంగంలో ప్రపంచపటంలో భారతదేశానికి స్థానం కల్పించిన ఔషధ సంస్థ శాంతా బయోటెక్నిక్స్.

బయోటెక్నాలజీకే జీవం పోసిన శాంతా బయోటెక్నిక్స్ స్వదేశీ టెక్నాలజీతో, అందుబాటు ధరలో ప్రాణ రక్షక ఔషధాల తయారీకే పరిమితం కాలేదు. స్వంత ఉత్పాదనల పరిశోధన, తయారీ, మార్కెటింగ్‌లతో బాటు దేశ విదేశ ఫార్మాస్యూటికల్ సంస్థల తరఫున పరిశోధనలు నిర్వహించడం, ఔషధాలు తయారుచేసి పెట్టడం, ఇతర శాస్త్రీయ సేవలందించడం, మానవాళికి ఉపయోగపడే టీకాలు, ఔషధాల తయారీలో వారికి సహకరించడం వంటి అనేక కార్యకలాపాల ద్వారా సామాన్య ప్రజలకు బహుముఖాలుగా సేవ చేస్తున్నది.

హెపటైటిస్-బి రోగాన్ని నిరోధించే టీకా Shanvac™-B, క్యాన్సర్ చికిత్సలో ఉపయోగపడే ఇంటర్‌ఫెరాన్ అల్ఫా-2బి Shanferon తయారీల ద్వారా అశేష ఖ్యాతిని, అసంఖ్యాక అవార్డులను పొందిన శాంతా బయోటెక్నిక్స్ తన అనుబంధ సంస్థయైన శాంతా మెరైన్ ద్వారా మెరైన్ బయోటెక్నాలజీ, న్యూట్రాస్యూటికల్స్ రంగానికి సేవలందిస్తోంది. మరొక అనుబంధ సంస్థ శాంతా వెస్ట్ ద్వారా క్యాన్సర్ చికిత్సకు అవసరమైన పరిశోధనలు కొనసాగిస్తోంది.

**మనిషి ప్రాణానికి అత్యంత విలువనిచ్చే శాంతా, జీవ చైతన్యానికి ప్రతీకయైన జ్యోతినుండి స్ఫూర్తి పొందుతోంది.**

---

- Pioneers in r-DNA Based Human Healthcare Products in India
- Customised Monoclonal & Polyclonal Antibodies
- Recombinant Protein Development, Manufacturing & Formulation
- Vaccines, Therapeutic Products & Diagnostics
- cGMP Compliant Facility for Manufacturing Biopharmaceuticals
- Nutraceuticals

W.H.O.(Geneva) Pre-qualified U.N.Supplier of Hepatitis-B Vaccine

SHANTHA BIOTECHNICS PVT. LTD.
www.shanthabiotech.com
3rd Floor, Serene Chambers, Road No.7, Banjara Hills, Hyderabad - 500 034. A.P., INDIA.
Ph: +91-40-23548507, 23543010, 23608843
Fax: +91-40-23548476
Email: info@shanthabiotech.com

# హాసం

హాస్య-సంగీత పత్రిక

# ఇదీ సంగతులు

61

**Also available on net:**
**www.haasam.com**

**ముఖచిత్రం**

'అందరూ దొంగలే' చిత్రంలో అంకిత



## హాస్యం















## సంగీతం



**'సెంటర్ స్ప్రెడ్' లో**




సినిమా పాటల ప్రత్యేకం

**పాటల ప్రత్యేకం**

71
72
73
74
పేజీల్లో






**హా**స్య సంగీతాల మేళవింపుతో వస్తున్న 'హాసం' పత్రిక నిజంగా అద్భుతమైన సాహసమైన ప్రయోగం. ఇందులో ప్రచురితమౌతున్న లలిత సంగీతం - సంగీత ప్రియులకు చక్కటి సమాచారాన్ని అందిస్తోంది. ఎం. చిత్తరంజన్ గారికి ప్రత్యేక అభినందనలు.

- కె. వైకుంఠం, విజయనగరం

ప్రతి పక్షం క్రమం తప్పకుండా పాత పాటల పుస్తకాలు (అందునా పాత లోగోలతో) అందిస్తున్నందుకు హాసానికి శుభాభినందనలు. ఈ నాటి యువ గాయనీ, గాయకులకు వీటి అవసరం ఎంతయినా ఉంది. ఫలానా సినిమాలో ఫలానా పాట ఎవరు పాడారో, ఎవరు సంగీతం సమకూర్చారో, ఎవరు రాసారో ఈ తరం వాళ్ళకు రిఫరెన్సుగా ఈ పాత పాటల పుస్తకాలు ఎంతగానో తోడ్పడతాయి.

-వి. వెంకటరావు, విజయనగరం

'హాసం' పత్రిక చాలా బాగుంది. శైలజగారు, సుశీలగారి గురించి వ్రాయటం.. its nice, it tells how she liked her. మీరు కొత్త కొత్త పాప్ సింగర్స్ గురించి వ్రాయడం బాగుంది. I like your book (Music, Jokes) very much.

-కె.శ్రీరామచంద్ర మూర్తి, దిల్‌సుక్ నగర్

ప్రియమైన 'హాసం'కు మీ చిన్ని నేస్తం వ్రాయునది ఏమనగా నేనెప్పుడూ ఎవ్వరికీ ఉత్తరం రాసి ఎరుగను - ఏదో పరీక్షలలో లెటర్ రైటింగ్‌కని స్కూల్లో టీచర్లు చెప్పిందే చదివి రాయడం తప్ప! నీలో వచ్చే సింగీతం శ్రీనివాసరావుగారి 'క' రాజు కథలు నాకు బాగా నచ్చాయి. రాజులు, మంత్రులు అని రాస్తున్నా ఆ కథలు ఇప్పటి కాలానికి చెందినవే కదా ! ఈ మధ్య ఎందువల్లనో 'ఆడియో రివ్యూ' రావడం లేదు. నీకు ఇదేమన్నా భావ్యంగా ఉందా? ఒక సంవత్సరం పైగా వయసున్న మన స్నేహంలో నేను నిన్ను ఇంతవరకూ ఏమీ కోరలేదు. ఇప్పుడు కోరుకుంటున్నాను. నాకు మురారి, కె. విశ్వనాథ్ గారి సినిమాలోని పాటలు కావాలి.

మరి ఇన్నాళ్ళూ నిన్ను పలకరించలేదని అలగకుండా నేను కోరిన ఈ చిన్ని కోరిక తీరుస్తావు కదూ!

-కె. కిరణ్మయి,
ఇంటర్మీడియట్ (2వ సంవత్సరం),
మదనపల్లె

**'హా**సం' పత్రిక ప్రారంభం నుండి చదువుతున్న రీడర్‌గా ప్రతి సంచికలోనూ ఏదో కొత్తదనాన్ని ఫీల్ అవుతూ వస్తున్నాను. అయితే చిరంజీవి ముఖచిత్రంతో ఉన్న సంచికలో 'సరిగపదమని' పూర్తిచేద్దామని కూర్చున్నప్పుడు ఒకటవ అడ్డం, మూడవ అడ్డం పూర్తిచేసే సరికి 'హాసం' పత్రిక చెప్పకనే చెప్పినట్టు 'ఉగాది శుభాకాంక్షల'ను అందజేసినట్లు అయింది. ప్రతి పేజీలోనూ కేర్ తీసుకుంటున్న 'హాసం' సంపాదకులు రాజాగారు సరిగపదమని పజిల్ విషయంలో కూడా కనబరుస్తున్న శ్రద్ధకు అభినందనలు తెలియజేయకుండా ఉండలేకపోతున్నాను.

**-భాస్కరభట్ల రవికుమార్, సినీగీత రచయిత, హైదరాబాద్**

**(మన మనసులో అనుకున్నది ఎవరైనా గమనించి అభినందించినప్పుడు ఎవరికైనా ఆనందంగానే ఉంటుంది. అదే ఆనందాన్ని మీ ఉత్తరం ద్వారా మాకు కలగజేసినందుకు కృతజ్ఞతలు. నిజానికి ఆ ఐడియా ఆ పజిల్‌ని తయారు చేసిన మా స్టాఫ్‌లోని టి.నవీన్‌ది. ఇటువంటి తమాషాయే ఈ సంచికలోని 'సరిగపదమని'లో కూడా ఉంది. దీన్ని కూడా గమనించగలరని ఆశిస్తూ... -ఎడిటర్)**

మీ "హాసం"నవరస భరితం. సప్త వర్ణాత్మకం. తెల్లని వెలుగు ఏడురంగుల జిలుగేకదా! 50,60,70, దశకాల చిత్రాలనూ, పాటలనూ మా ముందుంచుతూ విస్తృతమైన రసాత్మక జగత్తుని కనిపింపజేస్తున్నారు. పరభాషా చిత్రాల అనువాద సహితపరిచయాలు 'టైమ్ మెషీన్'లో 'పాత'లో కెడుతూన్న అనుభూతి. ఆపాత మధురం నినదించే మేఘాల వర్షపాతం. ఆ రాగ మాధురిలో మునిగి, ఆ రాగ విలక్షణతలో తడిసిముద్దయి పోతున్నారు రసజ్ఞులు మనోజ్ఞంగా. 'హాసం'లో కథలూ, కవమీషలూ 'హాస్యానికే ' పట్టం కడుతున్నాయి. తప్పదుమరి. బాపు,రమణల సృష్టి. "బాపురే రమణీయం" కాకమానుతుందా! పి.బి.శ్రీనివాస్, లతామంగేష్కర్ పరిచయం రథసప్తమి నాడు సూర్యుడి కిచ్చిన హారతి. ఇన్నిటిని మీ పత్రికలో పొహళిస్తూ వున్న మిమ్మల్ని బిగ్గర 'హాసంతో' అభినందిస్తూ.

-కె. అరుణా వ్యాస్, హైదరాబాద్

సంచిక 60 పూర్తిగా ప్రయోజనకారి. మీరు ప్రచురించిన శీను వాసంతి లక్ష్మి పాటల పుస్తకంలో ఆర్పీ సంగీతం, కులశేఖర్ రచన చూసి సినిమా త్వరగా చూడాలని అన్పించింది. లవకుశ చిత్రం ద్వారా సదాశివబ్రహ్మం, సముద్రాల, దువ్వూరి రామిరెడ్డిగారి పద్యం, కంకంటి పాపరాజుగారి పద్యం, గాయకుల, నటుల మొదలగువారి పాటలు శ్లాఘనీయం. శ్రీరామనవమి పండుగకు చరితార్థం కల్గించారు. ప్రచురించి మరిన్ని విషయాలను 'హాసం' ద్వారా తెలియజేసారు. మీకు ఋణపడి వుంటాం. 'హాసం' క్లబ్బులు ఎట్లా పనిచేసినవి. వాటి వివరాలు 1.4.04 పత్రికలో ప్రచురించి చదువు కొనే అవకాశం కల్పించండి. తెలుగు, హిందీ పాటల ఆస్వాదన బాగుంటోంది. జగ్గయ్యగారి జీవిత విశేషాలతో, సినిమా రంగం అనుభవాలతో, వారి మంచి పాటలతో తెలియజేయగలరు. హ్యూమర్ బాక్స్ జోకులు చాలా బాగుంటున్నవి. పెళ్ళిపుస్తకం తర్వాత "పెళ్ళి చేసి చూడు" ప్రచురించరూ?

**-ఉప్పాల మోహనబాబు, అవనిగడ్డ**

'హాసం' హాస్య సంగీత పత్రిక క్రమం తప్పకుండా నేను చదువుతున్నాను. పెళ్ళిపుస్తకం గురించి చాలా బాగా వ్రాసారు. మిస్టర్ సో&సో, తాతాధిత్తై తధిగణితోం నాకు బాగా నచ్చాయి. కొన్ని గీతాలు గురించి చాలా బాగా ప్రచురించారు. నాలాంటి వ్యక్తే ఇంతగా మురిసిపోతుంటే, మాములు వారు ఇంకెంత మురిసిపోతుంటారో నేనూహించగలను. ప్రతి శీర్షిక చాలా బాగుంది.

-యస్.కె.ముక్తియార్, 2ఎ. బ్లాక్ ,
రాజమండ్రి సెంట్రల్ జైలు.

సరిగమపదమని-6 క్విజ్‌లో ప్రధమ బహుమతి గెలుపొందిన సందర్భంగా లేఖ వ్రాస్తూ మా 'హాసాన్ని మరింత ఆకర్షణీయంగా తీర్చిదిద్దాలన్న నా కోరికను ఇంత త్వరగా తీరుస్తారని ఊహించలేదు. మార్చి 16-31 సంచికలో మీరు ఉగాది సందర్భంగా ప్రవేశపెట్టిన కొత్త శీర్షికలు - సినీ నేపథ్యగాయనీమణుల గురించి ఇంద్రగంటి జానకీబాలగారు, జమునగారు నిర్వహిస్తున్న 'నేను నా పాటలు' ఫోటోలతో సహా ప్రచురించడం నాకెంతో సంతోషం కలిగించింది. ముఖ్యంగా శ్రీరామనవమి సందర్భంగా లవకుశ పాటలు అందించడం ఎంతైన ముదావహం.

**-సి.హెచ్. సూర్యారావు, చీపురుపల్లి**

మార్చి 16-31 హాసం సంచిక చాలా బాగుంది. ముఖ్యంగా 'కొమ్మా కొమ్మా కోకిలమ్మా' శీర్షిక ద్వారా గాయనీ మణుల వివరాలను సచిత్రంగా ప్రచురిస్తున్నందుకు నా ఆనందానికి అవదులు లేవు. దయచేసి పై శీర్షిక ద్వారా కనుమరుగైన మరెందరో సినిమా గాయనీ మణులను సచిత్ర రూపంగా తెలియచేయగలరని ఆశిస్తున్నాను. 'నేనూ - నా పాటలు' శ్రీమతి జమున గారి శీర్షిక 'న భూతో న భవిష్యతి'. ఆపాతమధురంగా పెళ్లినందడి పాటల విశ్లేషణ హైలెట్. 'హ్యూమరథం' రావి కొండలరావుగారి వ్యాసం హృదయాన్ని ఆకట్టుకున్నది. అర్థం చేసుకుందాం-ఆస్వాదిద్దాం శీర్షికన ప్రఖ్యాత హిందీ సినీ రచయిత ఆనంద్ బక్షి 'మిలన్' పాటల సాహిత్య సౌరభం అపూర్వం.

**-యన్. సారంగపాణి, అనంతపురం**

నేను రాసిన రెండు పేరడీ పాటలను ప్రచురించి ప్రోత్సహించినందుకు కృతజ్ఞతలు. బహుమతిగా మీరు పంపిన సి.డి.లు అందుకున్నాను. పత్రిక దినాదినాభివృద్ధి చెందాలని ఆకాంక్షిస్తూ

**-పులిపాక తాజుద్దీన్, జయపూర్, ఒరిస్సా**

సంపుటి: 3 సంచిక: 13

1-15 ఏప్రిల్ 2004

పేజీలు: 76

విడి ప్రతి : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $ 50

జీవిత చందా : రూ. 2000

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $ 400

మేనేజింగ్ ఎడిటర్

ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్

రాజా

రిఫరెన్స్ కర్టసీ

డా॥ కె.వి.రావు

జె.మధుసూదన శర్మ


The one and only Magazine devoted to Humour & Music



# హాసం

## హాస్య - సంగీత పత్రిక

61

**తా**రణ ఉగాది 'హాసం'కు ఒక ప్రత్యేకమైన ఉగాది. ఆనాడు మూడు పట్టణాలలో 'హాసం' ఆధ్వర్యంలో 'హాసం క్లబ్స్' ప్రారంభమయ్యాయి. ఉదయం రాజమండ్రిలో, సాయంత్రం విశాఖపట్టణం, ఏలూరు లలో రూపుదాల్చిన ఈ క్లబ్బులకు మంచి భవిష్యత్తు ఉందనిపించింది- ఆ రోజు సభాసదుల ఉత్సాహాన్ని ఓ సూచికగా తీసుకుంటే!

పండగ పూట ఇల్లు కదలడానికి ఎవరికైనా మనస్కరించదు. పైగా భారత్-పాకిస్తాన్‌ల మధ్య అత్యంత కీలకమైన క్రికెట్ మ్యాచ్! ఆ మ్యాచ్‌లో ఓడిపోతే ఫైనల్ ఆడకుండానే భారత్ జట్టు ఇంటిమొగం పట్టవలసిన తరుణం! ఆనాటి ఆట చూడకపోతే దేశభక్తి లేదనే నిందపడుతుందని భయపడే సందర్భం. అయినా అవన్నీ పక్కకు బెట్టి ఈ కార్యక్రమాలకు పెద్ద సంఖ్యలో హాజరయ్యారంటే అది విశేషంగానే చెప్పుకోవాలి.

పండగ కాదు, క్రికెట్ మ్యాచ్ కాదు, ఇల్లు కదలడానికి అసలైన అవరోధం మనందర్నీ పడక్కుర్చీరాయుళ్లుగా మార్చి పారేసిన టి.వి. అని చెప్పుకోవాలి. దాంతో ఇటీవల సాహితీ సమావేశాలకు, సంగీతసభలకు శ్రోతలూ, వారితోబాటు వక్తలూ తగ్గిపోయారు. ఉన్న వక్తలే రోజూ మాట్లాడుతూండడంతో వారు చెప్పే విషయాలలో కొత్తదనం లేకుండా పోయి ఉన్న కొద్దిమంది శ్రోతలూ జారుకోవడం మొదలుపెడుతున్నారు. ఈ విషవలయాల ప్రభావం వల్ల సమావేశాలు శ్రోతలకోసం ఎదురుతెన్నులు చూస్తూ వెలవెలా పోతున్నాయి.

ఈ క్లబ్స్ - వేదికపైన ఉన్నవారికి, నిర్వాహకులకు పరిమితం చేయకపోవడంతో చిన్నపిల్లలతో సహా అందరూ వచ్చి పాల్గొన్నారు. ముందుకు వచ్చి జోక్స్ చెప్పినప్పుడు, పాటలు పాడినప్పుడు సభా పిరికితనం పోయి, చక్కటి కమ్యూనికేషన్ స్కిల్స్ వారి కలవడుతున్నాయని గ్రహించడం జరిగింది.

టి.వి. చేసిన మరొక చెరుపు కమ్యూనికేషన్ గ్యాప్‌ను వృద్ధి చేయడం. ఇంట్లో వారైనా, ఇంటికొచ్చినవారైనా టీవీకి కళ్లప్పగించడమే తప్ప మాటామంతీ లేవు. మాటలే లేనప్పుడు వాక్చాతుర్యం ఎక్కడనుండి వస్తుంది? ఇదివరకటి పేరంటాలలో వినబడే ఛలోక్తులు ఎక్కడనుండి పుడతాయి?

ఇటువంటి పరిస్థితుల్లో ఉద్భవించిన 'హాసం క్లబ్స్'లో కుటుంబసభ్యులందరూ కలిసి పాల్గొంటారు కాబట్టి ఇవి చక్కగా ఆకట్టుకున్నాయి. ఈ క్లబ్స్‌లో హాస్యంతో బాటు, సంగీతం కూడా చోటు చేసుకోవడం అదనపు ఆకర్షణ. 'హాసం'లో అక్షరరూపంలో కనబడే విశ్లేషణలు అక్కడ పాడి వినిపించడం పులకింతలు కలిగించింది. 'ఫలానాపాటలో రెండో చరణం పాడుకుంటూ వెళితే ఇంకోపాటలో మూడవ చరణానికి వెళ్లిపోతారు చూశారా' అని చదవడం వేరు, అలా పాడి వినిపించాక కలిగే అనుభూతి వేరు. ప్యారడీ పాటలు సైతం వింటూంటే మరింత నవ్వు వచ్చిందని ఒప్పుకోక తప్పదు.

ఈ కార్యక్రమాలలో మరొక విశేషం - పద్యపఠనం. ఆచార్య తిరుమల సేకరించిన హాస్యపద్యాలు కావచ్చు, భాగవత పద్యాలు కావచ్చు రాగయుక్తంగా పాడి వినిపించి అర్థం వివరిస్తూంటే 'ఆహా' అనిపించింది. రెండుగంటలపాటు కార్యక్రమాలు సాగినా ఇంకా కాస్సేపు ఉంటే బాగుండుననే రీతిలో జరగడం సంతోషం కలిగించింది.

'హాసం' పత్రిక ఇటీవలే ఉద్భవించవచ్చు. కానీ ఏనాటినుండో ఉన్న హాస్యాన్ని, సంగీతాన్ని ఒక చోటకు చేర్చి, పాఠకులుసైతం కార్యకర్తలుగా, నిర్వాహకులుగా (హాసం కన్వీనర్లెవరూ హాసం ఉద్యోగులు కారు, కేవలం అభిమానులే) రూపొందే విధంగా స్ఫూర్తి నివ్వగలిగిందన్న ఆలోచన కించిత్తు గర్వాన్ని కలిగించడంతోబాటు బాధ్యతను కూడా గుర్తు చేస్తోంది.




HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
*email:* haasammag@hotmail.com

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
On behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD - 500 018

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eenadu Compound
Somajiguda, Hyderabad-82

# ఇక చెప్పేదేముంది?.. మనకి 'తప్పే' దేముంది



ప్రముఖ సినీ గీత రచయిత
**శ్రీ భువనచంద్ర**
'హాసం' పాఠకుల కోసం
ప్రత్యేకంగా రాస్తున్న

**మా ఆవిడ ఇంతే మరి మీ ఆవిడ?-6**

'ఆహా..! చెప్పుకోక చెప్పుకోక మీజ్ఞాపక శక్తి గురించే చెప్పుకోవాలి" వెటకారంగా అంది మా ఆవిడ.

"ఏం? నా జ్ఞాపకశక్తికేం? బ్రహ్మాండంగా వుంది! నువ్వే మాటిమాటికీ వెక్కిరిస్తున్నావు, అయినా 'పడ్డ' వాడెప్పుడు 'చెడ్డ' వాడుకాదు! గుర్తుంచుకో!"రిటార్టిచ్చాను.

" కరక్టే... అదేమన్నా మామూలు మాటా మర్చిపోవడానికి..! సుభాషిత మాయే!" వెటకారానికి వెక్కిరింతకూడా జోడించింది.

"నన్నేం అనక్ఖర్లా...! నువ్వూ చెబుతావుగా సు...భా..షి..తా..లు!" దీర్ఘంతీశా!

"మచ్చుకి ఒకటి చెప్పు....! వింటా..!" ఛాలెంజ్ చేసింది.

"ఒకటేం? లక్షచెప్పగల్ను...అవతల నాకుటైమౌతోంది గానీ.. లేక పోతేనా?" బుర్రగోక్కున్నా.(ఏమిటో...! యీవిడ రోజుకి అయిదారు సుభాషితాలన్నా వినిపిస్తుంది....అవసరం వచ్చినప్పుడు మాత్రం ఒఖ్ఖటీ గుర్తుకురాదు)

"అదోసాకు..! అసలింతకీ దేన్ని వెతుకుతున్నావో 'గ్యాపకం'వుందా?" అడిగింది.(కూచిపూడి వాళ్ళందరూ గ్యాపకం అంటారు. మా చింతలపూడి వాళ్ళం'జ్ఞాపకం' అనే అంటాం!)

"నా కళ్ళజోడు ' సీరియస్‌గా అన్నా.

"ఎక్కడ పెట్టారు?"

"ఇప్పటికి వందసార్లు చెప్పా....డైనింగ్ టేబుల్ మీద పెట్టానని!" విసుగ్గా అన్నాను. అవతలేమో టైమై పోతోంది. ఈవిడ నా కళ్ళజోడు వెతక్కుండా పొద్దునే గొడవ పెట్టుకుంటోంది. దీన్నే అంటారు "కుక్కకి చెలగాటం పిల్లికి ఎలుక సంకటం" అని లోపల్లోపల అనుకోబోయి పైకి అనేశా.

"భేష్....!సామెత నడుము పూర్తిగా విరిగింది.! ఓరి బుద్ధావతారమా... నీ కళ్ళజోడు నీ మొహానికే వుంది.! పోయి అద్దం చూసుకో..!" చికాకూ, నవ్వూ మేళవించి అంది నా పెళ్ళాం.

హాల్లోకి పోయి అద్దం చూసుకుందును గదా..కళ్ళజోడు నిజంగా నా మొహానికే వుంది!

"అయ్యో.! అదేంటి మామయ్య గారు...! కళ్ళజోడు వుందో లేదో చూడమంటే అద్దం చూడాలా! చేత్తో తడిమితే తెలీదూ?.." బుగ్గలు నొక్కుకుంది కోడలు.

"అదీ ..! అదేం లేదమ్మా.! తల దువ్వు కుందామనీ...." ఏదో ఒకటి నసిగి బయటకు చెక్కేశా.




వెళ్ళటం వెళ్ళటం డైరెక్టుగా దేవీ అకాడెమీకి పోయా. అక్కడ వారం రోజుల్నించీ 'హౌ టు ఇంప్రూవ్ యువర్ మెమొరీ" మీద లెక్చర్లిస్తున్నారు. నేను ఓ మూడొందలు ఫీజుకట్టి (మా ఆవిడకి తెలీకుండా) జాయిన్ అయ్యా.

మా ఆవిడకి తెలీకుండా అని ఎందుకన్నానంటే ఆవిడది "టెలిగ్రాఫిక్ మెమొరీ", నేనా విషయంలో వెరీపూర్.(మా పెద్దన్నయ్య కూడా అంతే. కాఫీ తాగేసి తాగలేదనీ- కాఫీ తాగకుండానే తాగాననీ మా వదినతో డైలీ వాదిస్తుంటాడు). సో, ఎలాగైనా నా మెమొరీని అర్జంటుగా ఇంప్రూవ్ చేసుకుని మా ఆవిడని 'దడదడ' లాడించాలని నిర్ణయించుకున్నా. వెంటనే

నటరాజన్ ప్రోత్సాహంతో ఫీజు కట్టేసా. మార్నింగ్‌వాక్ మానేసి వారంనించీ రెగ్యులర్‌గా అటెండవుతున్నా.

నేను వెళ్ళేసరికి లెక్చరు సగం అయినట్టుంది. లెక్చరిచ్చే ఆయన పేరు 'షణ్ముగ సుందరమో శివదాసనో...అట్లాంటి పేరే ఏదో వుండాలి. "మీరు ఏ విషయం గుర్తుపెట్టుకోవాలన్నా మొదట మీ మనసుని ట్యూన్ చెయ్యాలి" అన్నాడు.

"ఎలా?" ఒకావిడ అడిగింది.

"ఫరెగ్జాంపుల్ -? రేపు బెండకాయ కూర వండాలనుకుంటే-పడుకోబోయే ముందు కనీసం ఫదిసార్లు 'రేపు నేను బెండకాయ వండాలీ' అని పదే పదే మనసులో అనుకోవాలి" విశదీకరించాడు లెక్చరర్.

"సపోజ్..మరసటిరోజున ఆ విషయం జ్ఞాపకం రాకపోతే?" రెట్టించింది మరో ఆవిడ.

"దెన్..బీ ప్రాక్టికల్...! ఓ బెండకాయని మీ దిండు మీద పెట్టుకుని పడుకోండి. మర్నాడు ఆ బెండకాయని చూడంగానే, కూరవండాలనే విషయం ఆటోమేటిగ్గా జ్ఞాపకం వస్తుంది! " ఎనలైజ్ చేసాడు ష.సుం.

నాకు చాలా ఆనందమైంది. ఎందుకంటే-ఇంత సింపుల్ 'టెక్నిక్' నేనెన్నడూ విన్లేదు. లెక్చర్ అయిపోగానే హుషారుగా యింటికి బయల్దేరా. ఆ వుత్సాహంతో నాయర్ హోటల్లో నటరాజన్‌తో కలిసి ఓ స్ట్రాంగ్ 'టీ' కూడా తాగా. (ఇంట్లో'టీ' తాగటం నిషిద్ధం...అది 'పైత్యం' చేస్తుందని మా ఆవిడకి వాళ్ళమ్మ చెప్పిందని ఓసారి నాతో మా ఆవిడంది) అట్నించటు యిద్దరం కబుర్లు చెప్పుకుంటూ మార్కెట్లో 'కూగాయాన్' తీసుకుని యింటికి చేరేసరికి పదిన్నరైంది.



ఇంటికి చేరగానే"బలాదూర్ తిరగటం అయిపోయిందా?" మా ఆవిడ కోపంగా నన్ను చూస్తూ అడిగింది.

"వాకింగ్ వెళ్తే 'బలాదూర్' అంటారా...? భలే..! మొదటిసారి వింటున్నాను..! అయినా...'నేను మొగాణ్ణి' అందునా నీకు మొగుడ్ని! మరీ నువ్వు 'టీచర్లాగానూ' నేను 'ఎల్‌కేజీ' వాడి లాగానూ వుండాలంటే నేనొప్పుకోను...ఆ..!" వార్నింగిచ్చి బాత్‌రూంలో దూరా.

స్నానం చేసి పూజ పూర్తిచేసేసరికి పదకొండుంపావు. ఆకలి దంచేస్తోంది. టేబుల్ ముందు కూర్చోగానే ఇడ్లీలూ, శనగపచ్చడీ, అల్లప్పచ్చడీ, కారప్పొడీ తీసుకొచ్చి నా పేట్లో వడ్డించింది మా ఆవిడ. సాంబారు ఓ పెద్ద కటోరీలో పోసింది. వేడివేడి ఇడ్లీలమీద నెయ్యిని దిట్టంగా పోస్తూ "మరి నువ్వు" అనడిగా.

"నేనా...! ఇప్పటికి మూడుసార్లు మింగా..!" వెటకారంగా అంది. (ఆ మాట మాత్రం నేను చచ్చినా నమ్మను. ఎందుకంటే మొగుడు తినకుండా పెళ్ళాం ఏదీ తినకూడదని వాళ్ళమ్మ తనకి చెప్పినట్టు మా ఆవిడ ఓసారి నాతో చెప్పింది. ఎవరిమాటనైనా పట్టించుకోదు కానీ వాళ్ళమ్మ మాటంటే మాత్రం మహాగురి. ఇలా చాలా చాలా విషయాలు మా ఆవిడకి వాళ్ళమ్మ చెప్పిందన్న సంగతి నాకు క్లియర్‌గా గుర్తుంది. మరి నాకు మతిమరుపంటారేంటి!?)

"ఓహో..! మీ అమ్మగారి మాటల్ని తు॥చ॥ తప్పకుండా పాటిస్తున్నావన్న మాట... గ్రేట్..! మాతృభక్తి అంటే అలావుండాలి!" ఇడ్లీముక్కని శనగపచ్చడిలో ముంచి నోట్లోవేసుకుని అన్నాను. (ఏ మాటకి ఆ మాటే చెప్పుకోవాలి. ఇడ్లీకి కరెక్టయిన కాంబినేషన్ కొబ్బరిపచ్చడి కాదు.. శనగపచ్చడే!)

"మధ్యలో మా అమ్మసంగతి ఎత్తొద్దు!" ఖరాఖండిగా అంది.

"ఓకె.ఓకె....! మరి పొద్దున్నే నువు కరకరలాడుతున్నావు దేనికి? కొంచెం చెప్పు వింటాను!." మరో ముక్కతుంచి అల్లప్పచ్చడితో నంజుకుంటూ అన్నాను. (ఎంతయినా అల్లప్పచ్చడి టేస్టు అల్లప్పచ్చడిదే! పెసరట్టుప్మాతో అయితే ఆ రుచే వేరు? పెసరట్టు తలుచుకోగానే భలే నోరూరింది.)

"ఏం చెప్పాలి? ఏమిటీ వినేది? అసలెవరి మాటన్నా 'వినే' సుగుణం పుట్టకతో రావాలి గానీ చెట్టంతయ్యాక కాదు!" బరబరా సాంబారు గిన్నెని యివతలకి లాగి నా కప్పులో మళ్ళీ వేడివేడి సాంబారు పోస్తూ అన్నది మా ఆవిడ.

"పోనీ ఆ 'సుగుణం' యిప్పుడొచ్చిందనుకొని చెప్పు..." ప్రసన్నం చేసుకునే పద్ధతిలో పళ్ళికిలించా.

"అసలే 'మన'మొహం భారతదేశంలా వెలిగిపోతోంది...! దానికి తోడు ఆ ఇకిలించటం ఒకటి!" ఓ పక్క కోపం వస్తున్నా నవ్వాపుకోలేక పైట చెంగు అడ్డం పెట్టుకుంది.

"ఏంటత్తయ్యగారు..!మరీ అట్లానా...!" నాకు సపోర్టొచ్చింది కోడలు.

"నువ్వుండవే కొరివీ....! అసలు యివ్వాళ ఎక్కడికెళ్ళాలని చెప్పానో ఆయన్ని అడుగు గుర్తుంటే నా చెవికోసుకుంటా...!" ఛాలెంజ్ చేసింది మా ఆవిడ.

"అదీ...!" బుర్రగోక్కుంటూ ఆలోచించా.

"ఆలోచన తరువాత ..ముందు టిఫెన్ మింగు" ఇంకొంచెం కారప్పొడి వేసింది. (ఎవరేమనుకున్నాసరే.. నల్లచింతపండు లో వేయించిన ధనియాలూ, మిరియాలూ ఎండు మిరపకాయలూ, రకరకాల పప్పులూ వేసి రోట్లోదంచి, ఘుమఘుమలాడే కరివేపాకుని కూడా కలిపి మళ్ళీ దంచిదంచి కొడితే వచ్చే కారప్పొడి"రుచి" సృష్టిలో దేనికీ వుండదు. అందులోనూ అది మా రాజమండ్రి అక్కయ్య తయారీ! తిరుగులేదు మరి!)

"నాలుగో ఇడ్లీ సాంబార్‌లో నాని రెడీ టూ

ఈట్' గా వుంది. ఇంకొంచెం వేడి సాంబార్ పైనపోసి తింటుంటే నా సామిరంగా!

సుష్టుగా టిఫెన్ తినేసి వక్కపొడి వేసుకుని పంచె కట్టుకోబోతుంటే (టవల్ కట్టుకునే టిఫెన్ తినటం మగాళ్ళ జన్మహక్కు)

"అది కాదు....ఇవీ!" అంటూ పేంటూ,షర్టూ నా మీద పడేసింది మా ఆవిడ.

"ఇవాళ రికార్డింగు లేదుగా? అవెందుకూ?" అడిగా.

"అదేంటి మామయ్యగారూ ... స్టేషన్‌కి వెళ్ళాలని అత్తయ్య నిన్న మాతో చెప్పారుగా" గుర్తుచేసింది కోడలు.

"యస్..యస్...ఇంకేం..! పేంట్ వేసుకుంటా.! గబగబా బట్టలు తొడిగేశా

"ఏ ట్రైనో తెలుసా?పినాకిని" అంది మా ఆవిడ.

"డోంట్‌వర్రీ... నాకింకా! 'అంత' మతిమరుపురాలా..!"

గుర్తుగా కళ్ళజోడు జేబులో పెట్టుకొని , కుచలాంబా ట్రావెల్స్‌కి బయల్దేరా.

ఆ ట్రావెల్సుండేది మా వీధిలోనే!




ట్రావెల్సు కారు ఎక్కి మావీధి మలుపు తిరగ్గానే తోతాద్రి అయ్యంగారూ, ఆయన భార్య నడుస్తూ కనిపించారు. ఎండమండి పోతోంది. కారు ఆపించి"ఎంగె పోరింగె సార్"అనడిగా.

"టి.నగర్ సారూ....రొంబ ఎండగా వుండాది." రుమాల్తో మొహం తుడుచుకుంటూ అన్నాడు తోత్రాది.

తోత్రాదికి కొంచెం తెలుగువచ్చు.

"అయితే రండి! కోడంబాకం బ్రిడ్జి దగ్గర డ్రాప్ చేస్తా" ఆహ్వానించా.

"రొంబ నండ్రి సార్" భార్యతోపాటు వెనక సీట్లో ఎక్కేశాడు.

"నీంగె?" అడిగాడు.

"ఇప్ప నాన్ సెంట్రల్ పోరేన్" వచ్చీరాని తమిళంలో అన్నా.

"మీరు తెలుంగులోనే మాట్లాడండా, మా తాంత(తాత) తెలుంగువాండే. మావూరు గుండూరు. (గుంటూరుకి తమిళం)" మాటలు కలిపాడు.

టాక్సీ 'కేశవర్ధినీ' దాటుతుండగా 'బస్‌స్టాండ్' లో నటరాజన్ కనిపించాడు. రష్షు ఫుల్లుగా వుంది. బస్సొచ్చినా కూచోటానికి చోటు దొరకదు. మళ్ళీ బండి ఆపించి "నటరాజన్ సార్" అని పిలిచా. గబగబా నావైపు వచ్చాడు. "ఎంగె పోరింగ? " అడిగా

"నుంగంబాకం సారూ!" చెప్పాడు.

"అయితే వాంగ....సెంట్రల్‌కి 'ఆన్ ద వే' నే కదా...! డ్రాప్ చేస్తా.." అన్నా.

"రొంబ థాంక్స్ సార్" అని ఆయన తోత్రాది వక్కన వెనకసీట్లో సెటిలవంగానే బండి బయలుదేరింది.

"తోతాద్రీ..నమ్మ బి.సీ. సారు రొంబ నల్లవర్!. ఏమయినా సొవ్వె తెలుగువాంఢ్లు దా గ్రేటు. ఇదే మన అరవ్వాడు 'లిఫ్టు' ఇస్తాడా...!" మెచ్చుకున్నాడు నటరాజన్.

"ఆమా నటరాజన్ ...సారువాడు పిల్సి మరీ మాంకు లిఫ్టిచ్చినాడు" ఏకీభవించాడు తోతాద్రి.

"తమిళవారికి లిఫ్ట్ యిచ్చి 'తెలుగుజాతి'పేరు నిలబెట్టినందుకు నేను మహా ఆనందపడ్డా. ఆ ఆనందంలో తోతాద్రిని కోడంబాకం బ్రిడ్జి దగ్గర కాక టి.నగర్‌లో దింపి -ఆ తరువాత నటరాజన్ని నుంగంబాకంలో దింపి సెంట్రల్ చేరేసరికి టైమ్ ఒకటిన్నర అయింది.

ఖంగారుగా టాక్సీలోనించి బయటపడి 'హిగ్గిన్ బాదమ్స్' వైపు పరిగెత్తా. దూరంనుంచే జి.యల్.యన్. రాజు కనిపించాడు భార్యా, పిల్లల్తో.

"హలో..ఇటు..ఇక్కడ రాజుగారూ...!" ఆనందంగా అరిచా

"గాడ్ ..!మీరొస్తారని ఊహించలా...!" ఆశ్చర్యంగా అన్నాడు రాజు.

"చూశారా...! మీరింకా నాకు మతిమరుపు వుందనుకుంటున్నారు గదూ! నో...! ..నేను చాలా ఇంప్రూవ్ అయ్యా..! ఇంకో వారం తరువాత ఐ కెన్ ఛాలెంజ్ ఎనీ బడీ!" గర్వంగా అని సామాన్లు అందుకున్నా.




"అదికాదు రాజుగారూ..!" ఏదో చెప్పబోయాడు జి.యల్.యన్.( ఏయిర్ ఫోర్స్‌లో నన్ను అందరూ రాజు అనే పిలిచేవారు.)

"నథింగ్ డూయింగ్....నేనే మాటా వినను! రండమ్మా...!" అందర్నీ ఆహ్వానించి గబగబా ఓ సూట్‌కేసుని డిక్కీలో పడేశా.

"అదికాదు అన్నయ్యగారూ...!"...జి.యల్.యన్. భార్య ఏదో చెప్పబోయింది.

"చూడమ్మా...!నువ్వు నాకు సిస్టర్‌వి. నీకంటే పెద్దాడ్ని! నేను చెప్పినట్టు వినాల్సిందే. నో హోటల్..మనింట్లోనే వుండాలి....ఒకే.." అని ఆమెతో చెప్పి 'పోనీవోయ్'! అన్నా డ్రైవర్‌తో.

బాగా తెలిసినవాళ్ళుకానీ, ప్రియ మిత్రులుగానీ కనబడితే "గడగడా" వాగడం నా "వీక్‌నెస్". వచ్చింది సాక్షాత్తూ జి.యల్.యన్. అందునా మాది పాతికేళ్ళ ఫ్రెండ్‌షిప్.

"అసలు మీరు పాటలు ఎలా రాస్తారు అంకుల్?"

మానస అడిగింది. మానసని చిన్నప్పుడు ఎత్తుకున్నాను కూడా.

"అదామ్మా...మరీ...మ్యూజిక్ డైరెక్టర్ గారు ట్యూనిస్తారు. ఆ తరువాత.." ఎక్స్‌ప్లెయిన్ చేస్తూ..చేస్తూ... చేస్తూ వుండగానే బాలుగారి "కోదండపాణి" రికార్డింగ్ థియేటర్ వచ్చింది.

"వన్‌మినిట్ ..ఇప్పుడే ప్రాక్టికల్‌గా పాటనెలా రికార్డు చేస్తారో చూపిస్తా?" బండాపి నేనుదిగి, వాళ్ళనీ దింపి, థియేటర్లోకి దూసుకెళ్ళా. కీరవాణి గారి రికార్డింగ్. అందరూ మనవాళ్ళే. కీరవాణిగార్ని మా వాళ్ళకి పరిచయం చేసి థియేటర్లో కూచోబెట్టా. మా వాళ్ళంతా యమా "థ్రిల్" ఫీలయితే నా ఛాతీ గర్వంతో వుప్పొంగింది. టేక్ అనగానే బయటికొచ్చాం. చంద్రబోస్ వాకిట్లోనే వున్నారు. పరిచయాలు ముగించి టాటా చెప్పి మళ్ళీ మా బండెక్కాం. దారిలో మా వాళ్ళు భలేసంతోషం వ్యక్తం చేశారు. ఇంటికి చేరేసరికి అయిదయింది. కరకరా ఆకలేస్తోంది.

బండిదిగి..."సామ్రాజ్యమా...చూడు ఎవరొచ్చారో!" అరిచా. మా ఆవిడా వాళ్ళ చెల్లెలూ, పిల్లలూ, మాకోడలూ బయటికొచ్చారు.




మా ఆవిడ సంతోషంగా"రండి రండి....చాలాకాలం అయింది చూసి..." ఆహ్వానించింది.

అందరం లోపలికి వెళ్ళంగానే"భోజనం వడ్డించనా!" అడిగింది మా ఆవిడ. ('మన' ఆకలిసంగతి తెలిసిందేగా!).

"స్టేషన్‌లో కానిచ్చేశామమ్మా... ఇప్పుడేం వద్దు. వెంటనే బయల్దేరాలి...!" జి.యల్.యన్. అన్నాడు.

"అదేంటి?" ఆశ్చర్యంగా అడిగింది మా ఆవిడ.

"ఏం లేదు..! బెంగుళూరు నించివస్తూ, తిరుపతికి వెళ్దామని చెన్నైలో దిగి 'ట్రైన్'కోసం వెయిట్ చేస్తుండగా 'భయ్యా' కనిపించి మమ్మల్ని టాక్సీ ఎక్కించారు. వస్తూ వస్తూ 'రికార్డింగ్' కూడా చూశాం.'గ్రేట్ ఎక్స్‌పీరియన్స్' తిరుపతి ట్రైన్ ఎలానూ అందదు. వెంటనే బయల్దేరి 'కోయంబేడు బస్‌స్టాండు'కి వెళితే రాత్రి ఏ పన్నెండుకైనా తిరుపతి చేరొచ్చు...! రేపొద్దున కళ్యాణానికి ఆల్‌రెడీ టికెట్స్ బుక్ చేసేశాం...." వివరించారు రాజుగారు.

"మరీ...!" తెల్లమొహం వేసి రాజుగారి వంక చూశా.

"తిరిగి వెళ్ళేటప్పుడు వస్తాంగా....!" నా భుజం తట్టి అదే టాక్సీలో ఎక్కారు జి.యల్.యన్. అండ్ ఫ్యామిలీ. వాళ్ళని పంపించి లోపలికొచ్చాక గుర్తొచ్చింది.... మా మరదలూ పిల్లలూ వచ్చారనీ, వాళ్ళని నేనింకా పలకరించలేదనీ.

"ఏం ఛాయమ్మా...ఎప్పుడు రావటం...తమ్ముడుగారు ఏరి? పలకరించా పళ్ళికిలిస్తూ .

"సరేగాని బావా...స్టేషన్‌కి వస్తానని చెప్పి యిలా చెయ్యటం బాగుందా? నీ కోసం వెయిట్ చేసీ చేసీ విసుగుపుట్టి యింటికి ఫోన్ చేస్తే మా అక్కటాక్సీలో సెంట్రల్‌కి వచ్చి నన్ను తీసుకొచ్చింది గానీ లేకపోతే భాషరాక పిల్లల్తో ఏమై వుండేదాన్ని ?" కన్నీళ్ళ పర్యంతమై అడిగింది ఛాయాసుందరి.

నా కంతా అయోమయంగా అనిపించి "అంటే మీకు బదులుగా రాజుగార్ని" బుర్రగోక్కుంటూ నసిగా.

మా ఆవిడ మాత్రం చాలా కూల్‌గా సైలెంటు గా వుంది.

(మొగుడికి పదిమంది ముందూ ప్రవేటుక్లాసు చెప్పకూడదని 'వాళ్ళమ్మ' తనతో అన్నదని మా ఆవిడ నాకోసారి చెప్పింది. ఎవరిమాట విన్నా వినకపోయినా 'వాళ్ళమ్మ' మాటంటే మా ఆవిడకి ఎం...తో..గురి!)

ఇక చెప్పేదేముందీ? మనకి 'తప్పే' దేముందీ?

(మా ఆవిడ ఇటువంటి కొన్ని 'ప్రత్యేక' సందర్భాల్లో చా..లా... కూల్ గా వుంటుంది. మరి మీ ఆవిడ?)

50 సంవత్సరాల
నట జీవితాన్ని పూర్తి చేసుకున్న
స్వర్ణోత్సవ నటి జమున
'హాసం' పాఠకుల కోసం
ప్రత్యేకంగా అందిస్తున్న
జ్ఞాపకాల ధారావాహిక

2

# నేనూ నా పాటలు



- శ్రీమతి జమునా రమణారావు

'మా గోపి' అనే సినిమాలో నవరాగ మాలికలో 'దేశ దేశములా యశము గాంచుమా దివ్యమూర్తి ఓ భారత యువతి' అంటూ చాలా చక్కటి వీణ పాట ఒకటుంది. అప్పటికే నేను వీణ నేర్చుకుంటున్నాను. కాబట్టి ఫింగరింగ్ అదీ చాలా చక్కగా మ్యాచ్ అయింది. ఈ మధ్య టీవీ లో వస్తే నాకు చాలా ఆనందం వేసింది. రికార్డ్ చేసి పెట్టుకున్నాను.

ఇందులో సంఘటన ఏమిటంటే- నాకు ఆ సినిమా అయిదవదో లేక ఆరవ సినిమానో అయ్యుంటుంది. అప్పటికే పుట్టిల్లు, వద్దంటే డబ్బు అట్టర్ ఫ్లాప్ అయ్యాయి. అంతా మనవాళ్లే హిట్ అయింది. నిరుపేదలు నాగేశ్వరరావు గారితో యావరేజ్‌గా ఆడితే, 'మాగోపి' చాలా హిట్ అయింది. అంతే కాదు నాకు మొదటిసారిగా జమున చాలా అందంగా ఉందని ఈ చిత్రంతోనే పేరొచ్చింది. బి.యస్.రంగా గారి ఫోటోగ్రఫీలో నా అందం గురించి అందరికీ తెలిసింది.

అందులో ఓ ముద్దుపావ పాట. రావుబాలసరస్వతిగారు పాడారు. అది కూడా సాహిత్యపరంగా చక్కటి పాట. ఈ సినిమాలో వదినగా చేశాను. అనాథ బిడ్డగా చూస్తున్న మరిదిని చక్కగా చూసుకునే పాత్ర. ఇందులో హీరో వల్లం నరసింహారావు.

తర్వాత నేను చేసిన సినిమా విజయా వారి 'మిస్సమ్మ'. తెలుగు, తమిళం రెండూ చేశాను. అందులో తమాషా ఏమిటంటే నేను మొదటిసారి భరత నాట్యం చేశాను. 'బాలనురా మదనా' అని క్లాసికల్ డ్యాన్స్. అప్పటికి నేను అయిదు సినిమాలు చేసినప్పటికీ సరిగా డ్యాన్స్ చేయటానికి ఎక్కడా ఛాన్స్ లేదు. అదీ కాకుండా భరతనాట్యం నాకస్సలు రాదు.

ఆ సినిమాకు డ్యాన్స్ డైరక్టర్ పసుమర్తి కృష్ణమూర్తి గారు. ధిద్దితై దగ్గర్నుంచి నేను నేర్చుకోవలసి వచ్చింది. రోజూ ఆఫీస్‌కు వెళ్లటం ధిద్దితై అంటూ గంటా రెండు గంటలు నేర్చుకోవటం జరిగింది. ఆ తర్వాత పిక్చరైజేషన్ చేశారు. భంగిమలు పెట్టడంలో చక్కగా చెయ్యి బెండ్ కావాలి. బుగ్గ మీద చెయ్యి ఒకటి. ఒక చెయ్యి అందంగా పెట్టాలి ఒక బెండ్‌తో. అది నాకు రాలా. నా చెయ్యి బెండ్ అయ్యేది కాదు.

## మా గోపి




'మాగోపి' పాటల పుస్తకం కవర్‌పేజి

దేశ దేశముల యశము గాంచుమా
దివ్యమూర్తి ఓ భారత యువతీ ॥దేశ॥
ఇంటింటా సుధమధురానందాలూ
వెలిగింతువులే నీవు తల్లిగా
దేశమంత నవజీవన శోభల
వెలయింతువులే కల్పవల్లిగా ॥దేశ॥
అతి సుకుమారీ భారత నారీ
అనురాగములో అమృత మూర్తివే
అబలవు కావో భారత వనితా
ఆపదలందున నీవు శక్తివే ॥దేశ॥
త్యాగము ధర్మము దయాగుణమ్ముల
ఆర్జించితివా అమల కీర్తినే
గత చరిత్రలో ధీరత చూపీ
సాధించితివా దేశ ముక్తినే ॥దేశ॥
మంచితనానికి మారు పేరుగా
సౌందర్యములో సాటే లేరుగా
నీతి నియతికే సారముగా
జాతి ప్రగతి కాధారముగా ॥దేశ॥

## నేనూ నా పాటలు



కట్టె పుల్లలాగా నిటారుగా పెట్టేదాన్ని. అయినా చాలా బాగా చేసానని ప్రేక్షకులు మెచ్చుకున్నారు. ఇంకా విచిత్రం ఏమిటంటే నేను చేసిన భరతనాట్యం ఫోజుతో ఓ క్యాలెండర్ కూడా ఆ రోజుల్లో రిలీజ్ చేశారు. ఆ సినిమాలో నాకు పర్సనల్‌గా బాగా ఇష్టమైంది 'బృందావనమది అందరిది' పాట. చాలా సూపర్ హిట్ చిత్రం. విజయా వారి చిత్రాలన్నీ అట్లాగే ఉంటాయి. ఎక్కడా ఒక అసభ్యమైన మాట గాని, పాటగాని, డబుల్ మీనింగ్ గాని ఉండదు.

నేను హీరోయిన్‌గా చిత్ర రంగంలోకి వచ్చినా, విజయా సంస్థకుండే పేరు, వారు కళాకారులకిచ్చే గౌరవం నాకు నచ్చి 'మిస్సమ్మ'లో చిన్న వేషమైనా ఒప్పుకోవటం జరిగింది. అట్లాగే నాగేశ్వరరావుగారి విషయం తల్చుకున్నప్పుడు కూడా.... ఆయనలాంటి నెంబర్‌వన్ హీరో ఆ రోజుల్లో విజయా వారి చిత్రంలో కామెడీ క్యారెక్టర్ వేశారంటే హేట్సాఫ్ టూ హిమ్.

అంటే కళాకారులకి నాగిరెడ్డి, చక్రపాణిగార్ల మీద ఉన్న ఒక విధమైన అభిమానం- వాళ్ల ట్రీట్‌మెంట్ ఇవన్నీ చాలా ఆకర్షణీయంగా ఉండేవి. అందులో నాకు చాలా నచ్చిన సన్నివేశం అంటే -' మీకు మీరే మాకు మేమే' అని సావిత్రి, నాగేశ్వరరావుగారికి సంగీతం నేర్పే సీను. ఈ సన్నివేశంలో నిజంగా నాగేశ్వరరావు గారు ఎంత నవ్వించారంటే - అంత గ్రేట్ హీరో కామెడీ కూడా అంత బాగా పండించడం చాలా గ్రేట్. ఇప్పటికీ నాకు ఏమైనా చిరాగ్గా ఉంటే ఆ ఒక్క సీన్ వేసుకుని పకపకా నవ్వుకుంటూ ఉంటాను. అంత బాగా చేశారాయన.

మిస్సమ్మ అంటే ఇక విజయా వారి గుండమ్మ కథ కూడా గుర్తొస్తుంది. ఆ చిత్రానికి ముందు కొంత కాంట్రవర్సీ జరిగింది. నాగేశ్వరరావుగారు, రామారావు గారితో ఆ కాంట్రవర్సీ ఇండస్ట్రీలో ఓ చేదు అనుభవం. నాకు కూడా ఆత్మాభిమానం ఎక్కువ కాబట్టి నేను కూడా - నాకున్న పిక్చర్స్ నాకుంటాయి. మీకున్నవి మీకుంటాయి. నా భవిష్యత్తును ఎవరూ శాసించలేరు, పాడుచేయలేరు. నాకు టాలెంట్ ఉంది అనుకుంటూ - ఎవరికీ తలవంచలేదు. నిజంగా నేను ట్రబుల్‌నమ్ అయితే ఏవియంలో వద్నాలుగు సినిమాలు ఎలా చేశాను. ఒక్కొక్క కంపెనీలో నేను అడుగుపెడితే ఆ కంపెనీ చాలా ఉన్నత స్థాయికి వెళ్లడమే కాకుండా, హిట్ పిక్చర్స్ ఉండటమే కాకుండా మొదటి పిక్చర్స్ అన్నీ నేనే చేసేదాన్ని.

గుండమ్మ కథ స్క్రిప్ట్ సిద్ధమైపోయిన తర్వాత మా గొడవలు చూసి నాగిరెడ్డి, చక్రపాణి,కె.వి.రెడ్డి గార్ల పరిశ్రమకు ఇది మంచి పద్ధతి కాదు. సూపర్‌హిట్ జంట ఇలా చిన్న చిన్న గొడవలకు విడిపోవటం మంచిది కాదు అని రాజీకి ప్రయత్నించారు. ఆ రోజుల్లో ఏంటంటే ఓ క్యారెక్టర్‌కు ఒకళ్లని అనుకుంటే ఆ క్యారెక్టర్ ఆ ఆర్టిస్ట్ చేయటం కోసం నిర్మాతలు వెయిట్ చేసేవారు. మూగమనసులులో క్యారెక్టర్ కానీయండి, మిస్సమ్మ, గుండమ్మకథలలో క్యారెక్టర్స్ కానీయండి జమున తప్పితే వేరేవాళ్లు చేయలేరనే ఒక భావన నిర్మాతల్లో ఉండేది.

గుండమ్మ కథలో రామారావు గారు, సావిత్రి, నేనూ,

**ఈ పాటల రచన: అనిసెట్టి**
**సంగీతం:విశ్వనాథం - రామ్మూర్తి**

ఓ ముద్దు పాపా నా ముద్దుగోపీ
కనవోయి శాంతీ
సంతోష మందరా నా చెంతజేరి ॥ఓ॥
మదిలోని నీ ఆశా
మహిలోన తీరురా
ఎడబాటు రాదురా
ఏ నాడు లేదురా
మీ అమ్మ కౌగిలియేరా
నీ కున్న లోగిలి... ॥ఓ॥
ఆకాశపు పందిరిలోన
చందమామ విందుకు పిలిచే
అందాల తారల చేరీ
ఆటలాడుకోర గోపీ... ॥ఓ॥
ఆ బంగరు వెన్నెలలోనా
తెలిమబ్బుల పానుపుపైనా
అందాల గోపీ నిన్నూ
నిదురింప జేతురా... ॥ఓ॥

### గుండమ్మకథ

రచన: పింగళి నాగేంద్రరావు సంగీతం, గానం: ఘంటసాల

మౌనముగా నీ మనసుపాడిన
వేణుగానమును వింటిలే
తెలుపక తెలిపే అనురాగము- నీ
కనులనే కనుగొంటిలే -నీ
మనసు నాదనుకొంటిలే ॥మౌనముగా॥
కదిలీకదలని లేత పెదవుల
తేనెలవానలు కురిసెనులే
ఆనందంతో అమృతవాహిని
ఓలలాడి మైమరిచితిలే ॥మౌనముగా॥
ముసిముసి నవ్వుల మోముగని
నన్నేలుకొంటివని మురిసితిలే
రుసరుసలాడుచు విసిరిన వాల్జడ
వలపుపాశమని బెదిరితిలే ॥మౌనముగా॥



రచన: పింగళి నాగేంద్రరావు సంగీతం: ఘంటసాల
గానం: ఘంటసాల, సుశీల

ఎంత హాయి ఈరేయి, ఎంత మధురమీ హాయి
ఎంత హాయి ఈరేయి, ఎంత మధురమీ హాయి:
చందమామ చల్లగా, మత్తు మందు చల్లగా
ఆ చందమామ చల్లగా, పన్నీటి జల్లు చల్లగా ॥ఎంత॥
ఒకరి చూపు లొకరిపైన, విరి తూపులు విసరగా
ఒకరి చూపు లొకరిపైన, విరి తూపులు విసరగా
విరి తావుల పరవడిలో, విరహమతిశయింపగా
విరి తావుల ఘుమ ఘుమలో, మేను పరవశింపగా ॥ఎంత॥
కానరాని కోయిలలూ, మనల మేలు కొలువగా
కానరాని కోయిలలూ, మనకు జోల పాడగా
మధుర భావ లాహిరిలో, మనము తూలిపోవగా
ఆ మధుర భావ లహిరిలో, మనము తేలిపోవగా ॥ఎంత॥







**శ్రీమతి జమునకు ఇష్టమైన 'మిస్సమ్మ' చిత్రంలోని సన్నివేశం ఇదే...**

తను ప్రేమించిన సీత (జమున) సంగీతం నేర్చుకునే నెపంతో - మాష్టారుగా వచ్చిన ఎం.టి.రావు (ఎన్.టి.రామారావు) పట్ల ఆకర్షితురాలవుతోందన్న అనుమానంతో కూడిన భయం వల్ల 'మీరే సంగీతం నేర్పండ'ని మేరీ (సావిత్రి)ని సీత బావ ఏకె రాజు (అక్కినేని నాగేశ్వరరావు) బ్రతిమాలుతాడు. 'మీరే నేర్చుకొని ఆమెకు నేర్పండి' అని సలహాయిస్తుంది మేరీ. 'నేనా...నాకు రాదే' అని అంటాడు రాజు. 'రాకపోతే నేర్చుకోండి నేను నేర్పుతాను. నా దగ్గర నేర్చుకుని సీతకు చెప్పండి' అంటుంది. 'అబ్బే ఒద్దండి' అంటూ మొహమాటపడతాడు రాజు. 'ఫరవాలేదు... నేర్చుకోండి' అంటూ పియానో వద్దకు వచ్చి కూచుంటుంది మేరీ... తప్పదన్నట్టు ఆమెను అనుసరిస్తాడు రాజు... అతనికి తోకలా వెన్నంటి వుండే గోవిందు (బాలకృష్ణ) కూడా అనుసరించాడు. ఆ తర్వాత సన్నివేశం ఇలా వుంటుంది.(పాఠకులు సులువుగా ఊహించుకుని ఆనందించటం కోసం పాత్రలపేర్లతో కాక పాత్రధారుల పేర్లతో ఉదహరించటం జరిగింది.)

సావిత్రి : సా ని స రి మా  రీ ని సా సా

ఏ.ఎన్.ఆర్ : సా ని స రి మా
అన్నాడే గానీ ఎక్కడా కలుస్తున్నట్టు లేదు.

సావిత్రి : సా ని స రి మా  రీ ని సా సా
ఈసారి కూడా గొంతులు తలోదారిలో పయనించాయి.

సావిత్రి : పామ పమ పమ పమ పమ పస

ఏ.ఎన్.ఆర్ : పా మ ప మ ప... బాగాలేదు
(అతనికీ తెలిసిపోయింది. అందుకే బాగాలేదు అని సందేహం వెలిబుచ్చుతున్నట్టుగా నిర్ధారించాడు.)

రేలంగి : అవును... చాలా బావుంది... ఫస్టు...
(అటు సమర్ధిస్తున్నట్టు ఇటు ఆట పట్టిస్తున్నట్టుగా)

సావిత్రి : పామ పమ పమ పమ పమ పస (ఈ లోగా ఎన్టీఆర్ ప్రవేశించాడు)

ఏ.ఎన్.ఆర్ : పామ పమప (ఈ సారి విపరీతంగా కష్టపడ్డాడు. గుండెల్లోని స్వరాల్ని గొంతులోంచి బయటకు పంపించటానికి ఓ కాలెత్తి కూడా ప్రయత్నించి) చాలా కష్టంగా ఉందండి.

ఎన్.టి.ఆర్ : ఫర్వాలేదు. కష్టపడందే ఏదీరాదు. నేర్చుకోండి

సావిత్రి : ఇందులో మీ సలహా ఏం అక్కర్లేదు దయచేయండి.(సరేనన్నట్టు ఎన్టీఆర్ కొంచెం దూరంగా ఉన్న సోఫాలో కూర్చున్నాడు.)

సావిత్రి : (ఏ.ఎన్.ఆర్.తో)పాడండి... సాని సరిమా రీని

ఏ.ఎన్.ఆర్ : చూడండి ఆ 'సా - పా'లు తీసేసి సంగీతం చెప్పండి.

సావిత్రి : అట్లాగే... మీకు మీరే మాకు మేమే

ఏ.ఎన్.ఆర్ : మీకు మీరే మాకు మేమే

సావిత్రి : ఎందుకీ పసపస పసపస

ఏ.ఎన్.ఆర్ : ఎందుకీ పస
(ఏ.ఎన్.ఆర్. ఎన్.టి.ఆర్. వైపుచూశాడు భయంగా)

సావిత్రి : ఎందుకు భయపడతారు ఇటు తిరగండి... మీ కు మీరే మాకు మేమే

ఏ.ఎన్.ఆర్ : మీకు మీరే మాకు మేమే





నాగేశ్వరరావు గారు- ఇలా రెండు జంటల నుకుని - అది దృష్టిలో పెట్టుకుని ఆ కథ రాసుకున్నారు. మా గొడవలు మూడేళ్ల ప్రాలాంగ్ అవడం - కె.వి.రెడ్డి గారు, నాగిరెడ్డిగారు రాజీపడమని మాకు చాలా నచ్చచెప్పారు. వాళ్లు ఏదో అపాలజీ లెటర్ ఇమ్మని కోరటం, దానికి మా నాన్న గారు ఒప్పుకోకపోవటంతో మొదటి రాజీ ప్రయత్నం విఫలమైంది.

తర్వాత చక్రపాణిగారు, నాగిరెడ్డి గార్లకు మేము కొన్ని సూచనలు ఇవ్వటం, వారు నాగేశ్వరరావు గారితో ఓసారి, రామారావు గారితో ఓసారి కూర్చుని మాట్లాడటంతో సమస్య పరిష్కారమైంది. గుండమ్మకథలో నాకు చాలా మంచి పాటలున్నాయి. నాగేశ్వరరావు గారితో నాకొక డ్యూయెట్ ఉంది - ఎంత హాయి ఈ రేయి అని! చాలా చక్కటి సాహిత్యం ఉందా పాటలో. పింగళి గారు వ్రాసారు. మధురభావ













**సావిత్రి** : ఎందుకీ వస వస బుస రుస

**ఏ.ఎన్.ఆర్** : ఎందుకీ బుస బుస(ఇప్పటిదాకా ఎన్ని విచిత్రమైన పద్ధతుల్లో పాడినా కూడా ఎక్కడా గొంతు కలవకుండానే ఉంది.)

**సావిత్రి** : (ఎన్టీఆర్‌ని చూసి భయపడుతున్నాడని గ్రహించి) (ఎన్టీఆర్‌తో) మీరెందుకిటు చూస్తారు?

**ఎన్.టి.ఆర్** : చూట్టం కూడా తప్పేనా?

**సావిత్రి** : (రేలంగితో)దేవయ్యా అడ్డం నిలుచో

**రేలంగి** : ఓ (అడ్డంగా నిలుచుని ఓ ఐడియా వచ్చి లోపలికి పరిగెత్తాడు)

**సావిత్రి** : మీకు మీరే మాకు మేమే

(ఈ లోగా రేలంగి వచ్చి గొడుకు అడ్డంగా పెట్టాడు.)

**ఏ.ఎన్.ఆర్** : మీకు మీరే మాకు మేమే

**సావిత్రి** : మీకు మీరే మాకు మేమే

(ఏ.ఎన్.ఆర్. పియానోని ఊతంగా చేసుకొని గొడుగుకన్న కాస్త పైకెగిరి ఎన్.టి.ఆర్. చూట్టంలేదని నిర్ధారించుకొని కొంచెం ధైర్యంగా ఊపిరి పీల్చుకున్నాడు.)

**ఏ.ఎన్.ఆర్** : మీకు మీరే (రేలంగి చెయ్యి పీకటంతో గొడుకు కిందికి దించేసేడు. అది గమనించి మళ్ళీ గొడుగుచాటుకు వెళ్ళిపోయి కూచుని) మాకు మేమే

**సావిత్రి** : ఎందుకీ రుస రుస బుస బుస

**ఏ.ఎన్.ఆర్** : ఎందుకీ రుస

(రేలంగి గొడుకు మళ్ళీ పైకెత్తేశాడు. కూర్చుని మోకాలు మీద చెయ్యి పెట్టుకొని గడ్డం ఆన్చి పాడుతున్న ఏ.ఎన్.ఆర్.కి దడ పట్టుకుంది. గభాలున లేచాడు.) బుసబుస

**సావిత్రి** : ఎందుకలా భయపడతారు... రండి (ఏ.ఎన్.ఆర్. చెయ్యి పట్టుకొని తీసుకురాబోయింది. 'వదలండి' అన్నాడు ఏ.ఎన్.ఆర్. భయపడుతూ. 'ఫరవాలేదు' అంటూ లాక్కొచ్చి సోఫాలో కూచోబెట్టింది. ఎన్.టి.ఆర్.వైపు ఇబ్బందిగా చూసి నవ్వుతూ కూచున్నాడు ఏ.ఎన్.ఆర్.

సావిత్రి పక్కనే కూచుంది. ఏ.ఎన్.ఆర్. గుండె మళ్ళీ గుభేల్‌మంది. దిగాలుమనిలేచాడు. 'కూచోండి. ఫరవాలేదు మేం పట్నంవాళ్లం మాకా పట్టింపులేం లేవు కూచోండి' అంటూ ఏ.ఎన్.ఆర్. భుజం పట్టుకొని కూచోబెట్ట బోయాడు ఎన్.టి.ఆర్. సావిత్రి మళ్ళీ కూచుంది.

'మీకు లేదనుకోండి.... మాకు' (మాత్రం ఉన్నాయి) అంటూ మాటలు సగంలోనే మింగేసి కదిలాడు ఏ.ఎన్.ఆర్..

'ఏవండీ ఏవండీ ఇదిగోండి' అంటూ అతని కూలింగ్ గ్లాసెస్‌ని అందించింది సావిత్రి. రేపురండి కొత్తపాట నేర్పిస్తాను అంది

**ఏ.ఎన్.ఆర్.** : ఆ.. ఇక్కడా నేర్నాను

**సావిత్రి** : మీకు భయమైతే నేనే వస్తానక్కడికి

**ఏ.ఎన్.ఆర్** : అబ్బే ఎందుకులెండి (అంటూ నిష్క్రమించాడు సావిత్రి 'ఫరవాలేదు' అంటున్నా.)







లాహిరిలో మనము తూలిపోవగా, మధురభావ లహరిలో మనము తేలిపోవగా -ఎంత మధురంగా ఉంది. నాకు పాట సాహిత్య పరంగా, ట్యూన్‌పరంగా చాలా బాగా నచ్చిన పాట. అలాగే ప్రేమయాత్రలకు బృందావనము పాట కూడా. అలాగే 'మౌనముగా నే మనసు పాడిన వేణుగానమును వింటినే' కూడా నాకు చాలా ఇష్టమైన పాట. అలాగే ఆ పాట చివరలో ఒక స్తంభం దగ్గర కూర్చోబెట్టి - రుసరుసలాడుతు విసిరిన వాల్జడ వలపు పాశమని బెదరితిలే - అని తీశారు. నాకు ఆ ఒక్క లైన్ చాలా ఇష్టం. పింగళి నాగేంద్రరావు గారు ఎంత బాగా రాశారో!

విజయా చిత్రాల గురించి మాట్లాడు కుంటున్నాం కాబట్టి - వాళ్ళు తీసిన 'సి.ఐ.డి' చిత్రం గురించి చెప్పాలి. ఈ సినిమాలోని ఓ పాటతో నాకు ఒక ప్రత్యేకమైన అనుభవం ఉంది.

(వచ్చేసంచికలో మరికొన్ని పాటల గురించి....)



ప్రముఖ దర్శకుడు
**శ్రీ సింగీతం శ్రీనివాసరావు**
'హాసం' పాఠకుల కోసం
ప్రత్యేకంగా రాస్తున్న

## కరాజు కథలు 10

# ఆదితాళం

రాజుగారి ఏకాంత మందిరంలోనికి అడుగు పెట్టిన మంత్రిని చూసి "రండి మంత్రీ! సమయానికొచ్చారు. ఒకసారి ఈ కావ్యం చదవండి. దురదృష్టవంతులు కొందరు ఎదుర్కొనే కష్టాలను ఉద్రేక పూరింతంగా వివరించాడు" అన్నాడు కరాజు. అసలే కష్టాలతో సతమతమౌతున్న మంత్రి ఇప్పుడు కవిగారి కష్టాల్ని నెత్తిన పెట్టుకోడానికిష్టపడలేదు.

ఇప్పుడు మంత్రిని వెంటాడుతున్న క్లిష్ట సమస్యలు రెండు. మొదటిది పూర్తిగా స్వయంకృతాపరాధం. దీనికి మూలకారణం తమిళదేశం నుంచి వచ్చి రాజుగారి కొలువులో చేరిన ముసలి మృదంగ సామ్రాట్ పళని మణి అయ్యర్. మణిఅయ్యర్ మృదంగ నాదం విన్నప్పుడెల్లా ఆనందానికి బదులు కరాజులో ఒక నిరాశ అంకురించేది. ఇంతటి విద్వాంసుడు ఈ రాజ్యంలో లేడే అని. ఆ రోజు మంత్రి ఒక సలహా ఇచ్చాడు. రాజ్యంలో తాళజ్ఞానం వున్న అయిదుగురిని ఎంపిక చేసి వారిని మణిఅయ్యర్ దగ్గర శిష్యులుగా చేర్పిస్తే కొంతకాలానికి వీరే నిపుణులై రాజుగారి కోరిక తీరుస్తారు.

"మంచి సలహా" అంటూ కరాజు ఈ కార్యాన్ని మంత్రినే స్వయంగా నిర్వహించమని కోరాడు.

మంత్రికి సంగీతజ్ఞానం కొద్దిగా తక్కువ. రాగాలనీ, తాళాలనీ ఉన్నాయని తెలుసు గాని వాటి రూపు రేఖలేమిటో అసలు తెలీదు. అందుకని సంగీతం తెలిసిన వాళ్ళనీ వీళ్ళనీ రహస్యంగా అడిగి అప్పటికే మృదంగం అభ్యసిస్తున్న నలుగురు యువకుల్ని ఎంపిక చేశాడు. ఈ సమయంలో తన ఇంటికి వచ్చిన మేనమామ వాళ్ళ ఊళ్ళో ప్రసిద్ధి కెక్కిన తాళం వంశీయులను గురించి చెప్పాడు.

"తాళం బ్రహ్మయ్య అనే కుఱ్ఱవాడున్నాడు. అతను తాళం శివయ్య కొడుకు. తాళం రుద్రయ్యకు మనమడు. బాగా ఉన్నవాడు. తాళం వంశీయులు కనుక పుట్టుకతో వారిలోని ప్రతి అణువు తాళంతో నిండి వుంటుంది. సందేహం లేదు" అన్నాడు మేన మామ.

మేనమామ తర్కానికి మంత్రి తలొగ్గక తప్పింది కాదు. తాళం బ్రహ్మయ్యను





మణి అయ్యర్ దగ్గరికి పంపాడు. మణి అయ్యర్ లౌకికుడు. ఈ ఉద్యోగంపోతే ఇంత జీతం మరెక్కడా దొరకదనే సత్యాన్ని గ్రహించినవాడు. అందుకని మంత్రిగారి ఆజ్ఞానుసారం అయిదుగురినీ తన శిష్యులుగా తీసుకున్నాడు. పాఠాలు మొదలుపెట్టాడు. మొదటి నలుగురితో ఎటువంటి సమస్యా రాలేదు. బ్రహ్మయ్య దగ్గరి కొచ్చేసరికి మణిఅయ్యర్‌కు ఒక ఘోరమైన నిజం తెలిసి వచ్చింది. బ్రహ్మయ్యకు ఇసుమంత కూడా తాళ జ్ఞానం లేదని. గురువుగారు ఒక దారిలో వెళ్తే బ్రహ్మయ్య మరో దారిలో వేళ్ళేవాడు. తాళం సరిగా వెయ్‌మంటే తొడమీద గట్టిగా కొట్టేవాడు. ఇక ఆగలేక మణిఅయ్యరు శిష్యుణ్ణి పిలిచి "బ్రహ్మయ్యా! ఇదేమిటి! నీకు బొత్తిగా తాళజ్ఞానం లేదు. ఇంటిపేరు తాళం కదా!" అనడిగాడు.

"అది ఒకప్పుడు మా వ్యాపారమండీ!" అన్నాడు బ్రహ్మయ్య. మణిఅయ్యర్‌కు అర్థం కాలేదు.

"అవునండి. తాళాల వ్యాపారం. మా పూర్వీకులు మంచి నాణ్యత వున్న తాళాలు చేసేవారు. ఆరోజుల్లో ప్రతి ఇంట్లోనూ, ప్రతి అంగట్లోనూ మేం చేసిన తాళాలు తప్ప వేరే తాళం కొనే వారుకాదు, వాడేవారూకాదూ. చివఱకు రాజ్యంలోని చెఱసాలలకు కావలసిన తాళాలని ప్రభుత్వంవారు మాచేతే చేయించే వారు. అప్పుడు చేసిన తాళాల్ని ఇప్పటికీ వాడుతున్నారు. అంతటి నాణ్యత వున్న తాళాలు. దాని మూలకంగా మా వ్యాపారం బాగా దెబ్బతిన్నది" అన్నాడు బ్రహ్మయ్య.

"నాణ్యత గలవి చేస్తే వ్యాపారం ఎందుకు దెబ్బ తిన్నది?" అన్నాడు మణి అయ్యరు అర్థంకాక.

"మరంతే కదండీ! కొన్న వారంతా మళ్ళీ కొనే అవసరం లేకుండా వాటినే వాడేటప్పటికి కొన్నాళ్ళకు మా దగ్గర కొనే వాళ్ళెవరూ రాలేదు. అప్పుడు ఆ వ్యాపారాన్ని పక్కకు పెట్టి వేరే రకం సరుకులు తయారు చేయడం ప్రారంభించాం. కాకపోతే పోయిన సారిలాగాక ఈసారి వాటిని బాగా నాసిరకంగా చేశాం. ఇప్పుడు వాటిని కొన్న వారంతా ఏడాది తిరక్కముందే అవి చెడిపోయి మళ్ళీ కొనడానికి మా దగ్గరికి వస్తున్నారు. ఈ పద్ధతిలో మా వ్యాపారం ఇప్పుడు బాగా పుంజుకుంది. కానీ మా ఇంటిపేరు మాత్రం తాళం వారుగా అలాగే వుండి పోయింది." అన్నాడు బ్రహ్మయ్య.

మణి అయ్యర్‌కు ఈ పరిస్థితిలో మంత్రికి కోపం రాకుండా ఇతర శిష్యులకు సమస్య రాకుండా చేయగలిగిందొక్కటే. బ్రహ్మయ్యకు వేరేగా రాత్రిపూట పాఠాలు చెప్పాడు. బ్రహ్మయ్య ఎంతవరకు నేర్చుకున్నాడనే ఆలోచనకుపోయి తన మనస్సును పాడుచేసుకోదలచుకోలేదు. అయినా ఎలాగో ఈ విషయం మంత్రిగారి చెవిన పడింది. అప్పట్నుంచీ మంత్రికి ఒక సంకట పరిస్థితి. బ్రహ్మయ్యను తీసేస్తే ఇంటిపేరును బట్టి మనిషిని ఎలా ఎంపిక చేశావని అందరూ తననే అంటారు. తీసేయకపోతే బ్రహ్మయ్య మీద ఇంత పక్షపాతం చూపించడానికి కారణం ఏమిటి అని ఎవరైనా అనూనిస్తారేమోననీ భయం. ఈ భాధతో సతమతమౌతూండంగానే మంత్రికి మరో వైపునుంచి మరో సమస్య ఎదురైంది.

ఆదిశంకర భట్టు ఆర్థిక శాస్త్రంలో ప్రవీణుడు. కౌటిల్యుని అర్థశాస్త్రానికి వ్యాఖ్యానాన్ని రాశాడు. ఆదాయాలమీద, వ్యయాల మీద వివిధ రకాల ఆర్థిక సమస్యల మీద పరిశోధనలు చేసినవాడు.





అతని ప్రతిభని గుర్తించి రాజుగారు అతన్ని అర్థికాధికారిగా నియ మించాడు. పదవిని ఆక్రమించిన క్షణం నుంచి అతనిది ఒకటే ధ్యేయం. రాజ్యానికి ఎక్కువ డబ్బును ఎలా రాబట్టాలా అని. ఏడు సంవత్సరాల పరిశోధనతో అతను కనిపెట్టిన అద్భుత సత్యం, డబ్బు చేకూరాలంటే తిరుగులేని ఒకే మార్గం- ఎవ్వరూ తప్పించుకోలేనట్టుగా పన్నులు విధించడం.

అంటే అదిశంకర భట్టు సిద్ధాంతం ప్రకారం దేశంలో పన్ను కట్టని వారుండ కూడదు. అమ్మేవాడూ కట్టాలి, కొనేవాడూ కట్టాలి. వైద్యుడూ కట్టాలి. రోగీ కట్టాలి. గుడిలో దక్షిణలు తీస్కొనే పూజారీ కట్టాలి. ప్రసాదం పుచ్చుకున్న భక్తుడూ కట్టాలి. దాత కట్టాలి. బిచ్చగాడూ కట్టాలి. వీటితో ఎన్నెన్నో పురోగాభివృద్ధి పథకాలను అమలు చెయ్యొచ్చునని శంకర భట్టు అభిప్రాయం. అయితే దీన్ని ఎదిరించడానికి ఎవ్వరూ సాహిసించలేకపొయ్యారు. శంకరభట్టు దూర్వాసుడని అందరికీ తెలుసు. ఎలాంటి అభ్యంతరం తెలిపినా ఆ కోపంతో ఉన్న పన్నును రెండింతలు చేస్తాడేమోనని భయం.




ఇప్పుడతన్ని ఎలా లొంగదీయడమా అని అందరూ ఆలోచనలో పడ్డారు. వ్యూహాలు పన్నడం మొదలుపెట్టారు. కొందరు అతని పుట్టిన రోజనీ, పెళ్ళిరోజనీ ఏదో ఒక నెపం పెట్టుకుని బహుమానాలను సమర్పించుకునేవారు. భట్టు వాటిని సాదరంగా స్వీకరించి తనకిచ్చిన కానుకలను పరీక్షించి వీటిని కొన్నప్పుడు సరిగా పన్నులు కట్టేరా అని అడిగేవాడు. ఎంత ఆలోచించినా అతన్ని మెత్తపరిచే మార్గం ఎవ్వరికీ తోచలేదు. ధర్మరాజంతటి వాడికే జూదం అనే బలహీనత ఉండేది. ఈ భట్టుకి అలాంటి బలహీనత ఏదైనా ఉండే దాన్ని వాడుకోవచ్చుకదా అని అందరూ ఆలోచిస్తున్నారు.

ఈ సమయంలో శంకర భట్టు ఇంట్లో వంటవాడు ఒక రహస్యం బయటపెట్టాడు. శంకరభట్టు చిన్నప్పుడు పాటలు పాడే వాడట. అది విన్న వాళ్ళ అమ్మమ్మ అతని చేత మళ్ళీమళ్ళీ పాడించుకునేదిట. అప్పట్నుంచి అతనికి నలుగురి ముందూ సభలో పాడాలనే ఆశ ప్రారంభమైంది. ఇప్పటికీ ఏకాంతంగా వున్నప్పుడూ, స్నానం చేస్తున్నప్పుడూ తానొక సభలో పాడ్తున్నట్టు ఊహించుకుని పాడ్తూ వుంటాడట. కాని ఈ రహస్యాన్ని ఎదటవారికి చెప్పడానికి ఎప్పుడూ సంకోచించేవాడు.

ఈ వార్త వినగానే ఒక పట్టు దొరకింద నుకుంటూ అందరూ సంతోషించారు. కొందరు వ్యాపారులు ఒక రోజు శంకరభట్టును కలిసి ఆ మాటా యీ మాటా మాట్లాడుతూ ఏదో తెలియని వారిలా "భట్టుగారూ! మీరు మాట్లాడే తీరు, కంఠంలో పలికే హెచ్చు తగ్గులూ వింటూంటే మీరు స్వతహాగా మంచి గాయకులు అనిపిస్తోంది" అన్నారు.

ఈ మాట వినగానే భట్టు 'మీరెలా కనిపెట్టారు?' అన్నట్టుగా చూసి చిరునవ్వుతో "ఏదో అప్పుడప్పుడూ నా విశ్రాంతి సమయాల్లో పాడుకుంటుం టాను" అన్నాడు.

"అదేమిటి భట్టుగారూ! మీరింతటి గాన కళా సంపన్నులని ఎవ్వరికీ చెప్పలేదే! మీరు పాట పాడ్తారని తెలిస్తే అది ఎందరికో స్ఫూర్తినిస్తుంది" అన్నారు వ్యాపారులంతా.

శంకరభట్టుకి ఉత్సాహం ఎక్కువైంది. ఆ ఉత్సాహంలో తనకు తెలియకుండానే పాడ్డం మొదలెట్టాడు. ఇది కేదార గౌళ అని, ఇది భైరవి అని, ఇది నీలాంబరి అని చెప్పుకుంటూ పాడ్తున్నాడు. కాని వ్యాపారులకు అన్నీ ఒకే రాగంలా వినిపిస్తున్నాయి. పెరట్లో గేదె అరచినట్లుంది. ఆ భావాన్ని ముఖాన కనబర్చకుండా భట్టుగారి పాటకు తల ఊపుతూ ఆనందాన్ని ప్రకటించారు.

"భట్టుగారూ! మీ పాటవినే ఆనందంలో వచ్చిన పని మరచిపోయాం. ఈ నెల కట్టవలసిన పన్ను వచ్చే నెల చివర్లో కడ్తామని విన్నవించుకోడానికి వచ్చాం" అన్నారు వ్యాపారులు సవినయంగా.

"అదేం పరవాలేదులెండి. కాంభోజి రాగంలో ఈ పాట వినండి" అన్నారు భట్టుగారు. పన్ను కట్టమని అడగనంతసేపూ ఎన్ని రాగాలైనా వినడానికి సిద్ధంగా వున్నారు వ్యాపారులు.

కొన్నాళ్ళకే పట్టు వస్త్రాల సంఘం వారు తమ వార్షికోత్సవానికి భట్టుగారిని ఆహ్వానిస్తూ ఆయనకు సత్కారం చేయ సంకల్పించారు. పైగా ఆ రోజే భట్టు గారిని పాటకచ్చేరి చేయమని కోరారు. అనుకోకుండా వచ్చిన ఈ అవకాశాన్ని వినియోగించుకొని తన చిరకాల వాంఛ తీర్చుకోవాలనుకున్నాడు శంకరభట్టు.

భట్టుగారు గానం చేస్తారన్నవార్త ఊళ్ళో ఒక సంచలనాన్ని సృష్టించింది. ఆ రోజు కచేరీకి వెళ్ళి ముందు వరుసలో కూర్చొని ఆయన చూస్తుండగా తల ఊపడానికి అందరూ పోటీ పడ్డారు. భట్టుగారి కచ్చేరీకి వాయిద్య విద్వాంసులను సంఘం వారే ఏర్పాటు చెయ్యాల్సొచ్చింది.

కచ్చేరి రోజున సభామందిరం జనంతో కిక్కిరిసిపోయింది. వేదిక మీద ఆదిశంకర భట్టుతో పాటు ఫిడేలు, తంబురా, మృదంగం వాయించేవారు కూర్చున్నారు. శంకరభట్టు ఒకసారి అందర్నీ కలియచూశాడు. మామూలు



సమయంలో అయితే ఆ చూపు ఎవరెవరు పన్నులు కట్టలేదో చూస్తున్నట్టుంటాయ్. కాని ఇప్పుడు ఆ చూపుల్లో పన్నుల సంగతే మర్చిపోయినట్టు కనిపిస్తోంది.

భట్టుగారు హంసధ్వని రాగంతో కచ్చేరి మొదలుపెట్టారు. రాగం ఆలాపించగానే అందరి ముఖాలు వేపాకు నమిలినట్టుగా మారాయ్. కాని వెంటనే తేరుకొని ప్రయాసతో అందరూ ముఖంలో ఆనందాన్ని తెచ్చుకున్నారు. ముఖ్యంగా ముందు వరుసలో కూర్చున్నవారి పరిస్థితి మరీ ఘోరంగా వుంది.

ఆలాపన కాగానే కీర్తన మొదలెట్టాడు భట్టు. వెంటనే మృదంగ విద్వాంసుడు తోడయ్యాడు. ఇప్పుడు వచ్చింది అసలు చిక్కు. కొంతసేపు పాటసాగగానే మృదంగం వాని తాళానికి, భట్టుగారి పాటకు పొత్తు కుదరలేదు. భట్టుగారు మృదంగం వాని ఊహకు చిక్కకుండా ఎటో వెళ్ళిపోతున్నాడు. ఉన్నట్టుండి పరుగెడ్తాడు. వెంటనే నిదానంగా పాడ్తాడు. ఈ పరిస్థితిలో మృదంగం వానికి ఏం చెయ్యాలో తోచక చరణం మధ్యలో వాయించడం ఆపేశాడు. ఒక్కసారిగా కచేరి ఆగిపోయి సభంతా నిశ్శబ్దంతో స్తంభించి పోయింది.

"ఏమిటి ఆపేశావ్?" అని గర్జించాడు భట్టు. మృదంగం వాడు ఏమీ పలక్క శిలా ప్రతిమలా వుండిపోయాడు. నోరెత్తితే ఏమి కీడు సంభవిస్తుందో అన్న భయంతో మౌనం వహించాడు.

శంకరభట్టు మళ్ళీ మళ్ళీ అడిగే సరికి మాట్లాడకుండా లేచి సభను విడిచిపెట్టి వెళ్ళాడు. భట్టుకు కోపం వచ్చింది. మృదంగం వాని మీదకాదు. అతన్ని తీసికొచ్చిన పట్టు వస్త్రాల సంఘంవారి మీద. "తప్పు క్షమించండి. వచ్చేవారం మళ్ళీ కచేరి ఏర్పాటు చేస్తాం. అప్పుడు మంచి వాయిద్యగాణ్ణి నియమిస్తాం" అన్నారు దీనంగా. ఆ మాటతో కొంత శాంతించి సరేనని వెళ్ళిపోయాడు భట్టు.

దీనికి ఒప్పుకున్న వాళ్ళందరికీ కొరివితో తలగోక్కున్నట్టయింది. ఈ సారి సరైన మృదంగ వాయిద్యగాణ్ణి అందించలేకపోతే మూడు సంవత్సరాల వరకు రెండింతల పన్నుకట్టక తప్పదు. మరి కొందరు పెద్దలు పట్టువస్త్ర వ్యాపారులు చెయ్యలేనిది తాము చెయ్యగలిగితే భట్టు గారి దగ్గర తాము మంచిపేరు తెచ్చుకోవచ్చని అనుకున్నారు.

ఈ విధంగా చాలామంది కచ్చేరీలు ఏర్పాటు చేసినా భట్టుగారికి తృప్తినిచ్చే మృదంగ విద్వాంసుణ్ణి ఒక్కర్ని కూడా పట్టుకోలేకపోయారు. ప్రతిసారీ ఎవరో ఒక వాయిద్యగాడు రావడం, కచేరీ మొదలవడం, సగంలో ఆపేసి వెళ్ళిపోవడం. ఇలా అయిదుగురు వాయిద్య గాళ్ళు మారేరు. మిగిలిన వాళ్ళెవరూ రావడం లేదు.

చివరకు రాజుగారి అనుమతితో ఆస్థాన విద్వాంసుడైన పళనిమణిఅయ్యర్‌నే ఈ మహత్కార్య నిర్వహణకు ఆహ్వానించాలని నిర్ణయించారు. కాని మణిఅయ్యర్ కూడా విఫలుడైతే ఊళ్ళోవాళ్ళ భవిష్యత్తు నరకమే. కొద్దిరోజుల్లో కొత్త సంవత్సరం రాబోతుంది. ఇప్పుడున్న కోపంతో భట్టుగారు కొత్తపన్నులు ఏం విధిస్తారో అని అందరూ భయపడుతున్నారు.

మంత్రిని ఆవేదనలో ముంచిన రెండవ సమస్య ఇదే. ఆదిశంకర భట్టు లాంటి ఆర్థిక నిపుణుణ్ణి కాదనలేక, ప్రజలకు రానున్న కష్టాలకు విముక్తి చూపించలేక బాధపడ్తున్నాడు. ఈ పరిస్థితిలో క రాజుగారి ప్రస్తావించిన కవిత్వం మంత్రి బుఱ్ఱలోకి ఎక్కలేదు. ఇది గమనించిన కరాజు దీని కారణం ఏమిటో మంత్రి నడిగి తెలుసుకున్నాడు.

"దీనికి భయపడవలసిన పనేముంది మంత్రీ! మీకు ఎదురైన ఈ రెండు సమస్యలను ఒకదానికొకటి ముడివేస్తే సమస్య తీరుతుంది" అన్నాడు కరాజు. మంత్రికర్థం కాలేదు.

"శంకరభట్టు గానానికి తాళం బ్రహ్మయ్య ఒక్కడే సరియైన మృదంగ విద్వాంసుడు" అన్నాడు కరాజు.

రాజుగారి మాటల్లోని భావం మంత్రి కర్థమైంది. పౌర్ణమి రోజు భట్టుగారి గానసభ ఏర్పాటు చేశారు. ఎప్పటిలాగే మందిరం నిండిపోయింది. కాని ఎవ్వరూ ముందు వరుసలో కూర్చోడానికిష్టపడలేదు. భట్టుగారు తనధోరణిలో గానం చేస్తున్నారు. నైపుణ్యం లేకపోయినా భట్టు పాటకు తగ్గట్టు వాయించే ప్రతిభ బ్రహ్మయ్యకు వుంది. వేగంగాపాడ్తే వేగంగా, నిదానంగా పాడ్తే నిదానంగా వాయిస్తున్నాడు.

సంగీతం తెల్సినవారు బ్రహ్మయ్య వాయించేది విని ఘోరంగా వుందని చెవులు మూస్కొవచ్చుగాక, కాని భట్టుగారి కచ్చేరిలో మధ్య ఆపకుండా చివరివరకూ వాయించిన ఘనత బ్రహ్మయ్యకే దక్కింది. కచేరి దిగ్విజయంగా ముగిసింది. భట్టుగారు ఆనందంతో తేలిపోతున్నారు. ఇప్పుడు బ్రహ్మయ్య అతనికి ఆప్తుడయ్యాడు. భట్టుగారి కచ్చేరీ అంటే బ్రహ్మయ్య తాళం ఉండాలి అనే మాట ప్రతినోటా వినవచ్చింది. దీంతో బ్రహ్మయ్య పలుకుబడి విపరీతంగా పెరిగిపోయింది. భట్టుగారి దగ్గర ఏ పని చేయించుకోవాలన్నా అది బ్రహ్మయ్య ద్వారానే జరగాలనే స్థితికి వచ్చింది. ఎలాగైతేనేం, బ్రహ్మయ్య సిఫార్సు మూలకంగా ప్రజలకు పన్నుల భారం తగ్గింది. బ్రహ్మయ్య ఆదాయం పెరిగింది. మంత్రికి కొంత ఊరట కలిగింది.

"ఇప్పుడు తెలిసిందా మంత్రీ! ఎదట వాడికి తగ్గట్టు తాళం వేయగలిగిన వాడే ప్రతిభావంతుడు. ఆనాడైనా, ఈనాడైనా ఎవరైనా పైకి రావాలంటే మొదట నేర్చుకోవలసిన తాళం ఇదే. ఇదే నిజమైన ఆదితాళం. ఇందులో ఎంత ప్రావీణ్యం సంపాదిస్తే అంత అభివృద్ధిలోకి రాగలరు" అన్నాడు కరాజు జీవిత సూత్రాన్ని పూర్తిగా అర్థం చేసుకున్న స్వాములవారిలా. ●



"వంకాయలు ఎలా ఇచ్చార్రా?"
"తూచి"



"నిన్ను చూస్తుంటే నా కళ్ళు ఆనందంతో మెరిసిపోతున్నాయి ఉషా"
"అంత అందం నాలో ఎక్కడుంది రవీ? "
"నీ మెడలోని డైమెండ్ నెక్లెస్ రూపంలో వుంది ఉషా."



"మనం ఇలా ఇంకెన్నాళ్ళు ప్రేమించుకోవాలి శ్రీనూ ? "
"నీ పెళ్ళో, నాపెళ్ళో అయ్యేంతవరకు!"



రద్దీ బస్సులో అవస్థపడ్తోంది వనజ. నందు చూసి నడుం మీద చెయ్యేసాడో రోమియో.
"ఏయ్... ఏం చేస్తున్నావ్!?" అడిగింది వనజ కోపంగా.
"ఎమ్మే" అంటూ చెప్పాడా రోమియో గాభరాగా .



"నా సెక్రట్రీని డిస్మిస్ చేద్దామనుకుంటున్నాను".
"ఎందుకూ?"
"కూర్చొని డిక్టేషన్ రాసుకోమంటే కుర్చీకోసం వెతుక్కుంటోంది."

**ఈ జోకులను పంపించిన వారు: గొల్లపూడి శ్రీనివాస్, మారుతీనగర్, హైదరాబాద్**



"అర్జంటుగా పోలీసు స్టేషన్ కెళ్ళాలి... షార్ట్‌కట్ ఏదైనా ఉందా?"
"ఉంది. వెనక వస్తున్నావిడ మెడలో ఉన్న బంగారు గొలుసు లాగేయండి."



ప్రమాదంలో కాలు పోగొట్టుకున్న అల్లుణ్ణి పరామర్శించడానికి వచ్చాడు మామగారు. తిరిగి వెళ్తూ సాగనంపడానికి గుమ్మం దాకా వచ్చిన కూతుర్ని అడిగాడు
"అల్లుడు ఇదివరకు ఒట్టినే నోరుపారేసుకుంటాడన్నావ్ కదా! ఇప్పుడెలా ఉన్నాడమ్మా ?"
"అయిందానికి కానిదానికి ఒంటికాలి మీద లేస్తున్నారు నాన్నా."

తండ్రి :- ఏంట్రా ! ఎప్పుడూ ఆ కార్టూన్ల ఛానలే చూస్తావ్ ?
అంతకంటే మంచి జోక్స్‌తో ఎంటర్‌టైనింగ్‌గా ఉండేవే లేవా?
కొడుకు :- ఉన్నాయ్, కానీ దాని కోసం కొన్ని నెలలు ఆగాలి.
తండ్రి :- ఏంటవి?
కొడుకు :- అసెంబ్లీ సమావేశాల ప్రత్యక్ష ప్రసారాలు.



**ఈ జోకులను పంపినవారు: రమణ శాస్త్రి, సంగారెడ్డి.**



"ఏరా పరుగుపందెంలో బంగారం గొలుసు గెలుచుకున్నావట".
"అవును గురూ! నిజమే"
"సాధారణంగా పరుగుపందెంలో కప్పో, క్యాష్ ఇస్తారు కదా...?"
" ఈ పరుగు పందెం ప్రత్యేకత వేరులే"
"అలాగా ! ఎంతమంది పరిగెత్తేరేంటి నీతో పాటు?"
"ఓ ఎస్ ఐ, నలుగురు పోలీసులు, గొలుసు సొంతదారు"



"తలకి ఆ కట్టేమిటి?"
"మా ఫ్రెండ్ శ్రీధర్ గాడికి ఈ మధ్యనే పెళ్ళియిందిలే!"
"వాడి పెళ్ళికి నీ తల కట్టుకి ఏమిటి సంబంధం?"
"వాడికి పెళ్ళి చేసుకోమని సలహా యిచ్చింది నేనే కదా"..




"నాన్నా !బయటి కెళ్ళి గోపిగాడితో గోలిలాట ఆడుకుంటా న్నాన్నా!
"గోలి అంతలేవు -నీకు గోలీలాటేంట్రా? నోర్మూసుకుని ముందు ముక్కవెయ్!"



ఓ జ్యోతిష్యుడి దగ్గర బోర్డులో - ప్రశ్నలు అడిగి మీ భవిష్యత్తు తెలుసుకోండి-అని ఉంది. ఇదేదో చూద్దామని ఒక కోయ దొర వెళ్ళి " రెండు ప్రశ్నలకు వందరూపాయలా?" అని ఆశ్చర్యపోయాడు.
"అవును, యింక నీ రెండో ప్రశ్న అడుగు!"
"ఇలాటి చిట్కాలు మాకూ తెలుసు. అసలు నేను మొదటి ప్రశ్న ఎప్పుడడిగాను...? అది చెప్పండి ముందు" అన్నాడా కోయదొర.
" నీ రెండు ప్రశ్నలూ అయిపోయాయి. ఇవ్వు వంద."



రెండు గాడిదలు కష్టసుఖాలు మాట్లాడుకుంటున్నాయి.
"ప్చ్ ! ఈ గాడిద జన్మ లాభంలేదు గురూ! వచ్చేజన్మలో మనిషిగా పుడతాను."
"పుడితే పుట్టేవుగానీ - ఆ జన్మలో పెళ్లి మాత్రం చేసుకోకు".
"ఏం? "
"ఏముందీ! మళ్లీ ఈ జన్మలోకే వచ్చేస్తావు."



టీచర్ : ఒరేయ్ ! మీలో సంగీతం అంటే యిష్టం ఉన్నవాళ్లు యిలా రండిరా!
సంగీతం అంటే చెవికోసుకునే ఓ ముగ్గురు విద్యార్థులు లేచి వచ్చారు.
టీచర్ : గుడ్! మీ ముగ్గురూ ఈ వీణని జాగ్రత్తగా పట్టుకుని ప్రిన్సిపాల్‌గారి ఇంట్లో పెట్టిరండి. క్రిందపడిందంటే మీ వీపులు చీరేస్తా వెధవల్లారా!

**ఈ జోకులను పంపినవారు: కోనే నాగ వెంకట ఆంజనేయులు ఉక్కునగరం, విశాఖపట్టణం .**

కోర్టులో లాయర్ ముద్దాయిని ప్రశ్నిస్తున్నాడు.
"హత్య జరిగిన ప్రదేశంలో దొరికిన ఆ సైకిల్ నీదేనా?"
"నాది కాదు"
"పోనీ అక్కడే దొరికిన ఈ గళ్ళ రుమాలు "
"నాది కాదు"
"నీ పేరు?"
"నాదే !"



ఈ సంచికలోని హ్యూమర్‌బాక్స్‌కి జోకులను పంపిన
**గొల్లపూడి శ్రీనివాస్, హైదరాబాద్, రమణశాస్త్రి, సంగారెడ్డి, కోనే నాగవెంకట ఆంజనేయులు, విశాఖపట్నం**
గార్లకు సోహన్ మ్యూజిక్ వారు 'జై' సినిమా పాటల ఆడియో సి.డి.ని బహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో ఈ సి.డి.ని పోస్ట్ ద్వారా పంపించడం జరుగుతుంది.

SOHAN MUSIC



తెలుగు సినిమా నేపథ్య గాయనీమణుల జీవిత చిత్రాలు తెలిపే

# కొమ్మా కొమ్మా కోకిలమ్మా 2



- ఇంద్రగంటి జానకీబాల

## గతసారి జాణ

# సురభి కమలాబాయి



తెలుగు సినిమా తెరకి పాడుతూ ఆడుతూ పరిచయమైన మొదటి హీరోయిన్ సురభి కమలాబాయి. 1931 లో టాకీలొచ్చిన కొత్తలో తెలుగులో టాకీ నిర్మించాలని నటీమణి కోసం వేట మొదలుపెట్టారు. హెచ్.ఎమ్.రెడ్డిగారు. ఆయన ఎంపిక చేసుకున్న నటి సురభి కమలాబాయి. తీస్తున్న చిత్రం 'భక్తప్రహ్లాద'. అందులో లీలావతిపాత్రను సురభి కమలాబాయికిచ్చారు. ఆమె ఆ పాత్రలో జీవించారని ఆనాటి తరం వారు గొప్పగా ఇప్పటికీ చెప్పుకుంటారు.

'సురభి' అనేది ఆమె ఇంటిపేరు కాదు. అది నాటక కంపెనీ పేరు. సురభి నాటకాల కంపెనీ పేరు విననివారుండరు. మహారాష్ట్ర నుండి తరలివచ్చి ఆంధ్రదేశమంతా అత్యంత్య ఖ్యాతిని సంపాదించిన సంస్థ సురభికంపెనీ. కుటుంబమంతా నటులుగా, నటీమణులుగా, వాద్యగాళ్ళుగా, సెట్టింగులు వేసినా, తెరలు దించినా, ఎత్తినా అన్నీ చేసేది ఒకే కుటుంబానికి చెందిన సభ్యులే. అందరూ రక్తసంబంధీకులే. స్త్రీ పాత్రలు స్త్రీల చేతనే వేయించిన కంపెనీ సురభి కంపెనీ. ఆ విధంగా ఉగ్గుపాలతో నటన, సంగీతం, నాట్యం, నేర్చుకున్న కమలాబాయి సినీరంగం ప్రవేశం చేసింది 'భక్తప్రహ్లాద' సినిమాతో.

ఆమె జన్మించటమే రంగస్థలం మీద జన్మించారు. అదొక విచిత్రమైన సంఘటన. తల్లి వెంకూబాయి నిండు గర్భిణిగా వుండి కూడా రంగస్థలం మీద నటించేందుకు సిద్ధపడ్డారు.

**1931లో హెచ్.ఎం.రెడ్డి దర్శకత్వం వహించగా విడుదలైన 'భక్తప్రహ్లాద' చిత్రంలో సురభి కమలాబాయి పాడిన ఓ రెండు స్వరరచనలివి.**

**రచన : చందాల కేశవదాసు రాగం : కానడ**

పరితాపభారంబు భరియింప తరమా
కటకట నేవిధి గడువంగ జాలుదు
పతియాజ్ఞను దాటగలనా
పుత్రుని కాపాడగలనా
ఈ విషము నేనెటును
తనయుని త్రావింపగలను?
ధర్మము కాపాడుదునా
తనయుని కావగ గలనా?

**రచన : చందాల కేశవదాసు రాగం : నాదనామక్రియ**

"తనయా ఇటులన్ తగదుర బలుకా తండ్రిమాట వినకా
సకల సద్గుణంబులకు నిధివై శాంతి మార్గావలంబకుడవువై
జనకు కంటె గురుదైవ యెవ్వరిల, ప్రేమభరిత ఇటు తగునా
శత్రుత్వమున్ జూపగన్"



'పాతాళభైరవి' (1951)లో ఎన్టీఆర్, బాలకృష్ణతో...



'శభాష్ రాముడు' (1959)లో ఎన్టీఆర్‌తో "జయమ్ము నిశ్చయమ్మురా భయమ్ము లేదురా" పాటలో...

ఫోటో కర్టెసీ : విజేత

అందులో పాత్ర కూడా గర్భిణియే....అయితే నాటకం సాగుతుండగా ఆమెకు నొప్పులు రావడం పిల్ల పుట్టడం జరిగిపోయింది. తెర దించి పురిటి సంగతి తెలియజేస్తే, ప్రేక్షకులు మెదట్లో నమ్మలేదట కానీ నెమ్మదిగా అర్థం చేసుకుని, కానుకలు కూడా సమర్పించారట. ఆ విధంగా రంగస్థలం మీదనే పుట్టిన కమలాబాయి పుట్టుకతోనే నటి, గాయకురాలు.

ఆమె శకుంతల, పాదుకా పట్టాభిషేకం, తుకారాం, కీచకవధ మొదలైన నూట నలభై సినిమాలలో నటించారు.

ఆమె 'కీచక వధ'లో ద్రౌపదిగా నటిస్తూ పాడుతూ, కీచకుడ్ని దూషిస్తూ, పాట చెడకుండా ,నటన బెసగకుండా చేసిన అభినయం చూసి ఆనాటి మేటి నటుడు, గాయకుడు కె.ఎల్.సైగల్ ముగ్దుడై నిలబడిపోయార్ట. ఆ తర్వాత ఆమెను కలిసి, అభినందించి మరీ వెళ్ళార్ట. ఇది తెలుగుజాతి గర్వించదగ్గ గొప్ప సంఘటన కాదూ మరి.

తెలుగు సినిమా కొంత వృద్ధి చేసి సాంకేతికంగా ఎదిగాక సురభి కమలాబాయి ఎక్కువగా ప్రౌఢ పాత్రలలో, తల్లి పాత్రలలో, గయ్యాళి అత్త పాత్రలలోనే కనిపించారు. వాటిలో మచ్చుకి పాతాళాభైరవి, మల్లీశ్వరి చెప్పుకోవచ్చు.

ఆకతాయి కొడుకైన తోటరాముడ్ని (ఎన్.టి.ఆర్) లొంగదీయడానికి, భయం చెప్పడానికీ, ఆమె పడే అవస్థ, చివరికామె 'ఓరి దేముడా ఇలాంటి కొడుకునిచ్చావేమయ్యా' అనే మాటలు భలే వుంటాయి. 'పాతాళ భైరవి' లాంటి కళాఖండానికి తొలి సన్నివేశం ఈమెతోనే ప్రారంభమవుతుంది.

అలాగే 'మల్లీశ్వరి'లో అన్ని రకాల ఆరాలు తీసి, చెప్పాల్సింది చెప్పి, తిప్పాల్సిన మూతి తిప్పి 'అయినా నా కెందుకు - ఎవరెట్టా పోతే నాకేం' అంటూ తరచూ కనిపించే, జాణతనం వొలికించే కమలాబాయి ప్రేక్షకుల గుండెల్లో చిరస్థాయిగా వుండిపోయారు.

ప్లేబాక్ అనే మాటని కాస్సేపు పక్కన పెడితే తెరమీద మొట్టమొదటగా తెలుగు సినిమా పాటను పాడిన ఖ్యాతి సురభి కమలా బాయిదే అని చరిత్ర చెప్తోంది. అదేమంటే 'భక్తప్రహ్లాద (1931)లో లీలావతి పాత్రలో 'పరితాపభారంబు - భరియింపతరమా' అనే పాట ఆమె గళమెత్తి గానం చేస్తూ తెరకెక్కారు.

చక్కని కనుముక్కు తీరు -నిండైన విగ్రహం, మంచి ఉచ్చారణ. మధురమైన కంఠస్వరం, మంచి నటనా చాతుర్యం గల సురభి కమాబాయి 1971లో మరణించారు.

(వచ్చే సంచికలో మరికొంత...)

# సరదా పద్యాలు

-టి.యల్.ప్రసాద్.



పడగొట్టి ఎదుటి వారిని
గడియైనా విడుపు నిడక గంటల కొలదీ
చెడు సుత్తి కొట్టు వానికి
కడుదూరము నుండ మేలు కలుగును గదరా




లాల్చీ సిల్కుది వేస్కొని
కాల్చెయ్యేమాత్రమైన కదపక బ్రతికే
శాల్తీయైను చివరికి
బాల్చీ తన్నేసి బ్రతుకు బంధము వీడున్

చిక్కని లిక్కరు త్రాగిన
కక్కుల RAWరాజు మురికి కాల్వను పడగా
కుక్కలు మూతిని నాకిన
నొక్కింతయు మేలుకొనక ఒదిగి పరుండెన్





దోమలు కుట్టుట సహజము
కోమలులెల్లపుడు నగలు కోరుట సహజము
చీమల శ్రమయును సహజము
సోమరులకు పనికిరాని సోదియె సహజము




# పెళ్ళిపుస్తకం

## దర్శకత్వం : బాపు

స్క్రీన్‌ప్లే-మాటలు-నిర్మాత
**ముళ్ళపూడి వెంకటరమణ**

**నవలీకరణ**
ఇలపావులూరి మురళీమోహనరావు

వెండితెర నవల
**4**

**జరిగిన కథ**

కృష్ణమూర్తి, సత్యభామలకు కొత్తగా పెళ్లవుతుంది. మధ్య తరగతి కుటుంబాలలో ఉండే అన్ని బాధలు వీరికీ ఉంటాయి. అందుకే కృష్ణమూర్తి బొంబాయిలో ఉద్యోగం చేస్తుంటే, భామ అని పిలవబడే సత్యభామ కేరళలో ఉద్యోగం చేస్తుంటుంది. ఒక కుటుంబానికి ఒకే ఉద్యోగం అంటూ ప్రకటించిన శ్రీధరరావు కంపెనీలో ఇద్దరూ ఒకరితో ఒకరికి పరిచయం లేనట్టుగా వెళ్లి ఉద్యోగాలు సంపాదించుకుంటారు. -(ఇక చదవండి)

కృష్ణమూర్తి , సత్యభామ ఇంటికొచ్చారు. వంటకు సిద్ధం చేస్తుంటే కృష్ణమూర్తి కూరలు తరుగుతున్నాడు. తమ యజమాని అకౌంటెంట్‌ను వెన్నపూసరాసి కత్తిని వెన్నులో దించినట్లు డిస్మిస్ చేసిన తీరును ఇంకా మర్చిపోలేకపోతున్నారు.

"చూశావుగా మా యమ్.డీ గారి తడాఖా. నవ్వుతూ గుండేసి పేల్చి పారేశాడు రాజారామ్ గాడిని! చిన్నతేడా వచ్చినా సరే సహించడు. క్షమించడు. సహించడు. క్షమించడు. సహించడు - క్షమించడు" అంటూ రిథమాటిక్‌గా నొక్కుతూ వక్కాణించాడు కృష్ణమూర్తి .

కూరలు తరగడం పూర్తయింది. భర్తమాటలకు నవ్వింది సత్యభామ.

"నిన్ను నన్ను చెరో రాకెట్లో కుదేసి రాహుమండలానికి విసిరేస్తాడు" అన్నాడు కృష్ణమూర్తి.

మళ్ళీ నవ్వింది భామ. "ఇక భోంచేద్దాం రండి" అన్నది. "నువ్వు తినెయ్. నాకు ఆలస్యముంది. వంటేం చేశావు?" అడిగాడు కృష్ణమూర్తి. "గోంగూర పచ్చడి" చెప్పింది భామ.



"ఆహా.... గోంగూర పచ్చడి. స్నానం చేసొస్తా" బాత్రుమ్‌కు వెళ్ళాడు. "కోరి భుజింతును - గోంగూర పచ్చడి" అంటూ కూనిరాగం తీస్తూ స్నానం చేస్తున్నాడు కృష్ణమూర్తి.

ఇంతలో భామ ఒక సీసాను తీసుకుని మూత తీయాలని ప్రయత్నిస్తూ అది ఎంతసేపటకీ రాకపోవడంతో భర్త దగ్గరకు వెళ్ళింది. లోపల 'అబ్బ నీ తియ్యనీ సబ్బు' అని కూనిరాగం ఆలపిస్తూ సబ్బుతో ఆడుకుంటున్నాడు కృష్ణ మూర్తి. భామను చూసి కెవ్వుమని అరిచాడు. "హన్నా.... మగాళ్ళు వంటరిగా స్నానం చేస్తుంటే చాటునుంచి చూస్తావా? నేను చాటుకెళ్ళి పోసుకుంటాను బాబు." అన్నాడు స్త్రీ లా సిగ్గుపడుతూ



"భామ నవ్వి" ఏమండీ.." అన్నది.

"ఏమిటి?" అన్నాడు కృష్ణమూర్తి.

"ఈ ఊరగాయ సీసా మూత రావట్లేదు కాస్త తీసి పెడతారా?" సీసా చూపిస్తూ అడిగింది భామ.

"నీళ్ళాడే దాకా కాస్త ఆగు" చెప్పాడు కృష్ణమూర్తి.

బయటకొచ్చింది భామ.

"మామయ్యగారు, ఈ సీసామూత కాస్త తీసి పెట్టరూ?" అంటూ రంగారావుకిచ్చింది. రంగారావు మూత తీసిఇచ్చాడు. భామ వెళ్ళబోతుండగా పిలిచాడు కృష్ణమూర్తి. భామ చేతి లోంచి సీసా తీసుకున్నాడు. "ఈ ఊరగాయ సీసా మూతనా తీయాల్సింది?" అని మూతను గట్టిగా పట్టుకున్నాడు.

మామగారు తీశారని చెప్పబోతున్నది సత్యభామ. కానీ కృష్ణమూర్తి మాట్లాడనివ్వలేదు. "మాట్లాడకు ఇలాంటి క్లిష్ట సమస్యలనెలా సాధించాలో జాగ్రత్తగా చూడు, నేర్చుకో."మూత తియ్యడానికి ప్రయత్నించసాగాడు.



అఖ్ఖర్లేదని చెప్పబోతుండగా" మాట్లాడొద్దన్నానా? మాట్లాడకుండా చూడు. నేర్చుకో. వాచ్ కేర్‌ఫుల్లీ. కొత్త బాటిల్ మూత రానప్పుడు కంగారుపడి తిప్పితే చెయ్యి కోసుకుంటుంది. దానికో న్యాక్ ఉంది. బాటిల్‌ను ఇలా పట్టుకుని తల్లక్రిందులుగా తిప్పి.... ఇలా తియ్యాలి" అని చెబుతూ మూతను గట్టిగా ఊడదీయబోతుండగా అప్పటికే మూత తీసి ఉండటంలో మూత గభాల్న ఊడి సీసాలోని పచ్చడంతా కృష్ణమూర్తి

వంటిమీద పడింది.



భామ ఫక్కాల్న నవ్వి "ఇపుడే మామయ్యగారు తీసి పెట్టారు" చెప్పింది.

"మరా మాట ముందుగా ఎందుకు చెప్పలేదు?" అన్నాడు కృష్ణమూర్తి ఏం చెయ్యాలో తెలీక.

"చూసి నేర్చుకుంటున్నాను. మళ్ళీ వెళ్ళి స్నానం చేసిరండి." నోటికి చెయ్యి అడ్డం పెట్టుకుని నవ్వుకుంటూ వెళ్ళింది భామ.

* * *

శ్రీధరరావు బంగళా -భోజనాలవేళ.

డైనింగ్ టేబుల్ నిండుగా పదిరకాల గిన్నెల్లో ఆహార పదార్థాలు నోరూరిస్తున్నాయి. శ్రీధరం భార్య మంగళ ప్లేట్లు సిద్ధం చేస్తున్నది. పదార్థాలన్నీ ఘుమాయిస్తున్నాయి. హరాయించుకునే శక్తి ఉండాలేకాని కలవారింట్లో ప్రతిపూట పండుగే కదా!

శ్రీధరం టేబుల్ వద్ద కొచ్చాడు. పదార్థాలను చూసి నాలుక తడుపుకున్నాడు ."ఆహా..... అబ్బో...ఈ ఐటమ్స్ అన్నీ నేను చెప్పినవా? నువ్వు చేసినవా?" అడిగాడు మంగళను మెచ్చుకుంటూ.

"ఇవాళ మన వసుంధర పుట్టిన రోజు" చెప్పింది మంగళ.

వసుంధర నవ్వుతూ టేబుల్ దగ్గరకు వచ్చింది. జీన్స్ టీషర్ట్ ధరించి జుట్టును షాంపూ మోడల్‌లా గాలి కొదిలేసింది. కూతురు ఆహార్యాన్ని చూసి నిట్టూర్చింది మంగళ.

"నా పుట్టిన రోజు ఇవాళ కాదమ్మా. ఎల్లుండి... డిసెంబర్ ఇరవైఒకటి." కుర్చీలో కూర్చుంటూ చెప్పింది వసుంధర.



"తిథి ప్రకారం ఇవాళ. తేది ప్రకారం ఎల్లుండి. దణ్ణం పెట్టు." అన్నది మంగళ.

వీళ్ళ మాటలు వింటూ గిరి కూడా అక్కడికి వచ్చాడు. "ఇవాళ మా తెలుగువాళ్ళ పండగ. ఎల్లుండి మీ దొరసాన్ల పండుగ. సరేనా? నాన్నగారికి దణ్ణం పెట్టమ్మా" మళ్ళీ చెప్పింది మంగళ.

వసుంధర నవ్వుతూ శ్రీధరం పాదాలకు నమస్కరించింది. "గాడ్ బ్లెస్యూ" ఆశీర్వదించాడు శ్రీధరం.

కుమార్తె అంటే శ్రీధరంకు అమితాపేక్ష. ఎవరికుండదు కానీ ఆయనకు మాత్రం కుమార్తె తెలివితేటల మీద,వ్యాపార దక్షత మీద అపార నమ్మకం. దానికితోడు ఆమె డ్రెస్ డిజైనర్ కూడా. అందుకే ఆమెకు కంపెనీ డైరెక్టర్‌గా కూడా స్థానమిచ్చాడు. కానీ కూతురు ఆధునికపు పోకడలు ఆ తల్లికి నచ్చవు. ఆమె పాతకాలపు ముత్తైదువకు ప్రతినిధి. ఈమె ఆధునిక స్త్రీకి ప్రతీక. కనీసం పుట్టిన రోజు పండుగనాడైనా ఆడపిల్ల తేట తేట తెలుగులా, తెల్లవారివెలుగులా అచ్చమైన ఆంధ్ర యువతిలా ఉండక పోవడం ఆమెకు అసంతృప్తి కలిగించింది.



"పండగనాడు కూడా ఆ మగవాడి బట్టలు తప్పవా? జడలో పూలు, దవనం బదులు ఆ ప్లాస్టిక్ పిన్నులు, పూసలు తప్పవా?" అంటూ మందలించింది .

"ఎల్లుండి చీర గ్యారంటీగా కట్టుకుంటుందోయ్" హామీ ఇచ్చాడు శ్రీధరం.

"ఏం గ్యారంటీనో ఏమో... మా తమ్ముడు వాడి జీతం డబ్బుల్తోనే చీరకొని నిన్న సాయంత్రం ఇస్తే ఛీ పొమ్మంది" చిరుకోపంగా చెప్పింది మంగళ.

"అది చీరె కాదు సిల్కు దుప్పటి. అది కొన్నది కాదు మొన్న భజనలో కప్పుకున్నాడే అది" వెక్కిరింతగా అన్నది వసుంధర.

శ్రీధరం పెద్దగా నవ్వాడు.

"అలాగే గారం చెయ్యండి. పెళ్ళయ్యాక కూడా చీరా, రవికా, వంటా వార్పు తెలియకుండా అవస్థపడి మిమ్మల్నే తిడుతుంది రేపు." కోపంగా అన్నది మంగళ.

"దానికి వంటావార్పు కంటే మనం అర్జెంటుగా నేర్పవలసింది ఆఫీసు నడపటం. రేపు మన సంపదకు రాణీ-రాజు అదేకదా. ఎవడొలాంటి వాడో, ఎక్కడేవుందో తెలుసుకోకపోతే నిమిషంలో దోచి పారేస్తారు." నవ్వాడు శ్రీధరం.



"ఊ...ఆ తర్వాత వంటావార్పే మిగులుతాయి." గిన్నెలు సర్దుతూ వ్యంగ్యంగా అన్నది మంగళ.

"ఇవాల్టినుంచీ రెండేళ్ళదాకా ఆఫీసు, వ్యాపారం ఇవే అమ్మాయికి పాఠాలు." అన్నాడు శ్రీధరం భోజనానికి కూర్చుంటూ.

* * *

ఆఫీసులో సిబ్బంది అంతా యజమానురాలి కోసం ఎదురు చూస్తున్నారు. ఆమె జన్మదినం సందర్భంగా ఘనంగా స్వాగతం చెప్పడానికి పుష్ప గుచ్ఛాలు చేత బట్టుకుని లిఫ్టుముందే నిల్చున్నారు. వారందరికీ నాయకుడిలా కొండ్రావు ముందు వరుసలో నిలుచ్చున్నాడు. డబ్బున్నవాడు 'జోక్‌చెబుతాను'అని మాటవరసకంటే చాలు విరగబడి నవ్వుతారు కదా అందరూ! ఇక సాక్షాత్తు యజమానురాలి పుట్టినరోజే అయితే వారికింద పనిచేసే వారికి నేలమీద కాళ్లుంటాయా!?

"గోల చెయ్యకండి. సైలెన్స్" అరుస్తున్నాడు కొండ్రావు.

లిఫ్టుతెరుచుకుంది. అందరూ అటెన్షన్లో నిలబడ్డారు. తీరా చూస్తే వచ్చింది అటెండర్. "ఛీ వెధవా. నువ్వా. ఫో అవతలకు." కసిరాడు కొండ్రావు.

అతను వెళ్ళిపోగానే గిరి వచ్చాడు. అతను కూడా కంపెనీ డైరెక్టర్లలో ఒకడు, శ్రీధరం గారికి సాక్షాత్తు బావమరిది కావడంతో "రండి చినబాబు గారూ... రండి పదండి...పదండి.... "అన్నాడు కొండ్రావు.

వెనకే శ్రీధరం కూడా వచ్చాడు. సీట్లలో కూర్చుని పనులు చేసుకోకుండా అందరూ అలా నిలుచోవడం ఆయనకు చిరాకెత్తించింది. "...ఏమిటీ న్యూసెన్స్?" అన్నాడు చిరాగ్గా.

"అబ్బాయ్...అంతమాటనకు. నీకు, నీకూతురికి చిరాగ్గా ఉండొచ్చు. మేమంతా నీ పిల్లల్లాంటి వాళ్ళం ప్రజలం". చేతులు నలుపుకున్నాడు కొండ్రావు. శ్రీధరానికేమైనా కోపం వస్తే తన పెద్దరికంతో శ్రీధరాన్ని శాంతింపజేయగల చనువు ఆయన కొక్కడికే ఉంది మరి!



"ఏదో మా సరదా! కాదనకు. ఇంతకూ అమ్మాయేదీ?" అడిగాడు.

"నా కంటే ముందే వచ్చేసిందే!" ఆశ్చర్యంగా అన్నాడు శ్రీధరం.

"ఆఁ ...ముందే

వచ్చేసిందా? అయితే పదండి....పదండి" అని ఆఫీసులోకి పరుగుదీశాడు కొండల్రావు. ఆయన వెనకే పరిగెత్తారంతా గొర్రెల్లా.

ఆఫీస్ హాల్లో ఏవో డిజైన్లు చెక్ చేస్తోంది వసుంధర. అందరూ చూట్టూ ఈగల్లా మూగారు.

"వెయ్యమ్మా..దండవెయ్.." అనిభామకు పూలదండ అందించాడు కొండల్రావు.

'వెల్కం మిస్ వసుంధరా..." అని వసుంధర మెడలో దండవేసింది భామ.

కొండపల్లి బొమ్మలా, అజంతా శిల్పంలా, కాటన్ చీరలో అందంగా, హుందాగా, అమరశిల్పి జక్కన చెక్కిన సజీవ శిల్పంలా ఉన్న సత్యభామను చూసి ఆశ్చర్యపోయింది వసుంధర. "వాటేలవ్లీ మోడల్! తెలుగుతనం ఉన్న ఇంత చక్కటి మోడల్ని నేనెక్కడా చూడలేదు. ... ఐ థింక్ ...ఈ దండ మీకు పడాలి .." అన్నది.

"యస్..యస్.."సమర్థించాడు గిరి.

వసుంధర తన మెడలోని దండ తీసి భామకు వెయ్య బోయింది "అయ్యో...వద్దండి. ...." వెనక్కు వెళ్ళింది భామ.



"నో...నో...నో...... షి ఈజ్ నాట్ ఎ మోడల్. మన టైపిస్టు. ఆఫ్టాల్ ఎ హౌస్ వైఫ్. ఇల్లాలు. పనికిరాదు." కల్పించుకున్నాడు కృష్ణమూర్తి.

అతడిని మొదటిసారిగా చూసింది వసుంధర.

"ఏం ఇల్లాలు అందంగా ఉండకూడదా? మోడల్గా పనికిరాదా?" కోపంగా అన్నది వసుంధర.

"అదే...అదే,....ఐమీన్...మనం పనికొస్తుందనుకున్నా....ఆ పనికి...రాదు..." అన్నాడు కృష్ణమూర్తి.

"ఆ మాట చెప్పడానికి మీరెవరండీ? హూ ఆర్యూ?" సీరియస్గా అడిగింది.

అప్పుడే శ్రీధరం వచ్చాడు.... "భలే దానివే... ఆయన మూర్తమ్మా.. ఆర్ట్ డైరెక్టర్... బాంబే నుంచి మనకోసమే వచ్చారు." పరిచయం చేశాడు.



"ఓ...అయాంసారీ... అయాంసారీ.. మిస్టర్ మూర్తి... అయాం వసు." చెయ్యిజాపింది వసుంధర.

"ఇట్స్ ఓ.కె. ... ఐయామ్ కె.కె. ...హౌడూయూడు...." షేక్ హాండిచ్చాడు కృష్ణమూర్తి. "థ్యాంక్యూ" నవ్వింది వసుంధర.

"ఎ హార్టీ వెల్కమ్ టూ యు మిస్ వసుంధర..." అన్నాడు కృష్ణమూర్తి.

"ఈమె మా అమ్మాయి. ఈ కంపెనీకి డైరెక్టరు కూడా.." కూతురును పరిచయం చేశాడు శ్రీధరం.

"వారు ఆర్టిస్టేనండీ.... టెక్స్టైల్స్ డిజైన్స్ వేస్తుంటారు." అన్చెప్పి వసుంధర తయారు చేసిన కొన్ని డిజైన్స్ చూడమని ఇచ్చాడు.



కృష్ణమూర్తి ఆ డిజైన్స్ను పరిశీలించాడు. ముఖం అసంతృప్తిగా పెట్టాడు.

" అద్భుతంగా ఉన్నాయి కదూ!" ఆత్రంగా అన్నాడు కొండల్రావు.

యజమానులు తుమ్మినా దగ్గినా అందులో ఏదో అద్భుతం కనిపిస్తుంది కదా భృత్యులకు! కానీ కృష్ణమూర్తి అలాంటి వాడు కాదు. ముక్కు సూటి వ్యక్తి.



"లేదు." అన్నాడు ముక్త సరిగా.

గిరికి కోపం వచ్చింది. "ఎవరి గురించి మాట్లాడుతున్నావో తెలిసే అంటున్నావా? ఎన్ని గుండెలు నీకు?" అన్నాడు.

"అమ్మాయిగారి బొమ్మలు బాగలేవు అంటే అర్థం ?"గుడ్లు మిటకరించి అన్నాడు కొండల్రావు.

వాళ్ల కోపాన్ని లెక్కచెయ్యలేదు కృష్ణమూర్తి. ఉన్నదున్నట్లుగా మాట్లాడే స్వభావం అతనిది. "బాగులేవు అంటే బాగులేవు అని అర్థం ...అయామ్ సారీ.." అన్నాడు.

"అంటే ?" శ్రీధరం కూడా రెట్టించాడు.

"అంటే గింటే లేవు డాడి. హి ఈజ్ రైట్. బాగాలేవని నాకు తెలుసు. ఈయన గనుక మెచ్చుకుని ఉంటే వెంటనే డిస్మిస్ చేసుండేదాన్ని. మిస్టర్ మూర్తీ. ఐలైక్ యువర్ ఫ్రాంక్నెస్". అభినందించింది వసుంధర.



మరోసారి షేక్ హాండిచ్చిన వసుంధరను, ఆ కాంప్లిమెంట్ను ఆనందంగా స్వీకరించి ఆమె చేతిలో చేయివేసి ఊపుతున్న భర్తను అసూయగా చూసింది సత్యభామ.

"ఇన్ ఫాక్ట్..... ఐలైక్ యూ వెరీవెరీ మచ్." అన్నది వసుంధర.

"థ్యాంక్యూ...ఈ షర్ట్ కొన్నది బాంబే సిటిలోనా?" వసుంధర ధరించిన షర్టును చూపించి అన్నాడు కృష్ణమూర్తి.

"అవును. నోవేర్ ఎల్స్. ఇంకెక్కాడా దొరకవు." చెప్పింది వసుంధర.

"త్రీ సెవెంటీ ఫైవ్ కదా"మళ్ళీ అన్నాడు కృష్ణమూర్తి.

"మీకెలా తెలుసు? "ఆశ్చర్యంగా అడిగింది వసుంధర.

-"ఇలాంటిది ఇది ఒక్కటే ఉంటుంది. దీన్ని డిజైన్ చేసింది నేనే. కావాలంటే ఆ కింద చూడండి. నాపేరు కె.కె. అని ఉంటుంది" నవ్వాడు కృష్ణమూర్తి.

"ఓ మైగాడ్....రియల్లీ,మీరా? హౌ థ్రిల్లింగ్.....సార్...మీ ఆటోగ్రాఫ్ కావాలి" ఆనందంతో అరిచింది వసుంధర మెరుపుతీగ వంటి మేను మెలికలు తిరుగుతుండగా.



వారి సంభాషణను నోళ్ళు తెరిచి వింటున్నారంతా.

భామ వైపు తిరిగి "మైడియర్ లౌలీ హౌస్ వైఫ్...మీ పెన్ను ఒకమారు తీసుకుంటానండీ." భామ నుంచి పెన్ను లాక్కుంది వసుంధర.

వసుంధర అంత చనువుగా మాట్లాడటం, దానికి తన భర్త మురిసిపోటం చూసి మండింది భామకు. కానీ బయటపడే వీలులేదు కదా..నోరు తెరిస్తే నిజం బయట పడుతుంది. పడితే ఉద్యోగం ఊడుతుంది. పేదవాని కోపం పెదవికి చేటని ఊరికే అన్నారా? గుడ్లురుముతూ చూస్తున్నది వారి వరసను.

పెన్ను కృష్ణమూర్తి కందించింది వసుంధర. "ప్లీజ్...కాలర్ మీద ఆటోగ్రాఫ్ పెట్టరూ..." అన్నది కాలర్ఎత్తి.

"ష్యూర్..." అని వసుంధర షర్ట్ కాలర్ మీద సంతకం చేశాడు కృష్ణమూర్తి.

"మా డైరెక్టర్గారికి నీ లేటెస్టు డిజైన్స్ కూడా చూపించవయ్యా ఆర్యూ..."

అన్నాడు శ్రీధరం.



"అవును సార్.. మీరు డిజైన్ చేసిన చీర ఒకటి చూపించరూ... మా అమ్మగారు చీర కట్టుకోమని చంపేస్తున్నారు..'' అన్నది వసుంధర.

''విత్ ప్లెజర్'' అన్నాడు కృష్ణమూర్తి.

"హౌ ఫన్నీ... "ఆనందిస్తూ'థాంక్యూ అంటీ' అంటూ పెన్నును భామకు తిరిగిచ్చింది వసుంధర.

కృష్ణమూర్తి తాను ఈ మధ్య రూపొందించిన చీరను తెచ్చి వసుంధరకు చుట్టాడు. తెల్లని ఆ చీరలో పాలరాతి శిల్పంలా మెరిసింది వసుంధర.

"హౌ బ్యూటిఫుల్....." ఉక్కిరి బిక్కిరయింది వసుంధర.

"బ్యూటిఫుల్.. ఈ చీరలో నువ్వు అజంతా బొమ్మలా ఉన్నావమ్మా...." అన్నాడు శ్రీధరం సంతోషంగా.



" కదూ డాడీ..." తండ్రివైపు తిరిగింది వసుంధర.

"యస్" అన్నాడు శ్రీధరం.

''ఏమంటారు కె.కె. ..'' కృష్ణమూర్తి ముందు వయ్యారంగా నిలబడింది వసుంధర.

"నే నొప్పుకోను... మీరు వసుది ఏంజెల్లా ఉన్నారు" అన్నాడు కృష్ణమూర్తి.

తను అభిమానించే ఆర్ట్ డైరెక్టర్ నోట వచ్చిన ఆ మెచ్చుకోలుకు ఉబ్బితబ్బిబ్బైపోయింది వసుంధర. అభిమాన హీరో ఏం మాట్లాడినా వేదంలా వినిపిస్తుంది కదా "

"ఓ...థ్యాంక్యూ...థ్యాంక్యూ... ఐ లైక్ యువర్ ఫ్రాంక్‌నెస్ కె.కె...ఐ లైక్యూ...." మరోసారి కృష్ణమూర్తికి షేక్ హాండిచ్చింది వసుంధర. "కె.కె. సార్... నా ఫొటో ఒకటిస్తాను. దానికి చీర కట్టి బొమ్మవేసి పెట్టరూ..."రిక్వెస్టుగా అడిగింది వసుంధర.

"ఓ.కె.. డన్.." వాగ్దానం చేశాడు కృష్ణమూర్తి.

తన షర్టు కాలర్ మీద కృష్ణమూర్తి చేసిన సంతకాన్ని ముద్దాడింది వసుంధర మురిపెంగా.

సత్యభామ ముఖం కోపంతో ఎర్రబారింది.



అన్యాయం, అనుమానం ముందుపుట్టి ఆడది తరువాత పుట్టిందంటారు అనుభవజ్ఞులు. అన్ని రోగాల్లోకి అనుమానం అతి పెద్దరోగం. మర్రి విత్తనం వటవృక్షం కావడానికి కనీసం పదేళ్ళు పడితే అనుమానం విషవృక్షం కావడానికి పది నిముషాలు చాలు. మగాడికి అనుమానం అనేది వస్తే ఒక్క భార్య మీదనే వస్తుంది. కానీ ఆడదానికి మాత్రం అందరి మీదా అనుమానమే.

సత్యభామ కూడా ఈ విషయంలో మినహాయింపు కాదు. తమ యజమానురాలు, అందునా పడుచుపిల్ల, పైగా పెళ్ళికాని యువతి - తన భర్తతో అంత చనువుగా వ్యవహరించడం, తన భర్త కూడా తను చూస్తున్నానని కూడా లేకుండా -పరాయిస్త్రీతో అతి చనువు తీసుకోవడం. ఆమె నవ్వులో నవ్వు కలపడం, ఆమె శరీరం ధరించిన షర్టు మీద ఆటోగ్రాఫ్ ఇవ్వడం బాగా అసూయ, కొంచెం అనుమానం కలిగించాయి.

సాధారణంగా ఇటువంటి సందర్భాలలో స్త్రీలు సాధింపు అనే అస్త్రం ప్రయోగిస్తుంటారు. ఇది అణ్వస్త్రం కంటే ప్రమాదకరమైంది. అణ్వస్త్రం అనేది ఏదైనా ప్రాంతం మీద ప్రయోగిస్తే ఆమేరకు ఆనవాలు లేకుండా పోతుంది. కానీ ఈ సాధింపు అస్త్రం మనిషిని చంపకుండా, మనశ్శాంతిని చిల్లులు పొడుస్తూ చిత్రహింసల పాల్జేస్తుంది.

రాత్రి పది గంటలైంది. భోజనానికి సిద్ధమయ్యాడు కృష్ణమూర్తి కూర గిన్నె తెచ్చి విసురుగా టేబుల్‌మీద పెట్టిలోపలకెళ్ళింది భామ. ముఖంలో రోషం, అలుక కొట్టొచ్చినట్లు కనిపిస్తున్నాయి.



కృష్ణమూర్తికి మాత్రం ఇదేమీ అర్థం కాలేదు. భామ మరికొన్ని గిన్నెలు తెచ్చి టేబుల్ మీద పెట్టి ఏమీ మాట్లాడకుండానే మళ్ళీ లోపల కెళ్ళింది. కృష్ణమూర్తి ఆలోచిస్తున్నాడు. భామ గ్లాసులు, ప్లేట్లు తెచ్చి వడ్డిస్తున్నది ముభావంగా.

భార్య వాలకం అర్థంకాని కృష్ణమూర్తి ఆమెకు కోపం తగ్గించాలని ''వారెవ్వా...క్యాబాత్ హై ....శభాష్..'' అన్నాడు వంటను మెచ్చుకుంటున్నట్లు.

వెంటనే వసుంధర అన్నట్లుగా "ఐలైక్ యూ....ఐలైక్ యువర్ ఫ్రాంక్‌నెస్...దీని మీద మీ ఆటోగ్రాఫ్ పెట్టరూ?" అన్నది భామ ఏడుస్తూ.

అప్పటికి విషయం బోధపడింది కృష్ణమూర్తికి. సత్యభామ అలుక వహించిందని గ్రహించాడు. భార్యంటే ఇష్టమున్న మగాడికి అలాంటి అలుక ఎంతో అందంగా కనిపిస్తుంది. భార్య అలుకలు తీర్చడంలో కృష్ణమూర్తి అలనాటి శ్రీకృష్ణమూర్తికేమీ తీసిపోడు. అవసరమనుకుంటే పాదతాడనం కూడా సహిస్తాడు.

భామ కన్నీరు తుడిచి "అమ్ముకుట్టీ" పిలిచాడు ప్రేమగా.

"నీకు కోపమొచ్చింది. కన్నీళ్ళు కదిలాయి. నాకు గర్వంగా ఉంది- ఇంత గట్టి పెళ్ళాం దొరికి నందుకు." అంటూ చెంపల మీద చేతులు వేసి నిమిరాడు. "ఇంత మంచి



ఫ్రెండును కాదని నేను మరో పిల్లకేసి చూసినా, ఒకవేళ చూస్తే, నవ్వితే, షేక్ హాండిస్తే, అది నా ఉద్యోగధర్మం అని నీకు తెలియదా? గుండెల్లో గూడు కట్టుకున్న ప్రేమను చీటికి మాటికి బయటకు చెప్పుకుంటామా?'' అన్నాడు అనునయంగా.

భామ కోపం మంచులా కరగసాగింది.

"అమ్ముకుట్టీ...పెళ్ళంటే పాలలో పాలలా కలిసిపోవడం, పంచదారలా కరిగిపోవడం. పెళ్ళంటే నమ్మకం. ఆ నమ్మకం తిరుగులేనిది. అది దీపం లాంటిది. దాని మీద అనుమానపునీడలు పడవు. అనుమానం ఉన్న చోట నారాయణా అన్నా బూతులా వినిపిస్తుంది. నమ్మకం ఉన్నచోట బూతుకూడా నారాయణా అన్నట్టే వినిపిస్తుంది." లాలించాడు కృష్ణమూర్తి.

ఆ లాలనకు కరిగి నీరై కన్నీరు కార్చింది సత్యభామ. భార్య కోపతాపాలను సరైన రీతిలో అర్థం చేసుకుని ఉపశమింపజేసే సహనమూర్తిని భర్తగా పొందటానికి ఏ స్త్రీయైనా ఎంత పుణ్యం చేసుకుని ఉండాలి? అపార్థమేఘం కరిగిందని గ్రహించాడు కృష్ణమూర్తి, భామ కంటనీరు తుడిచాడు.

"ఆ బాసు కుట్టికి ఆటోగ్రాఫ్,షేక్‌హాండ్లూ ఇచ్చాను గానీ అంత బతిమలాడినా ఆ చీరె ఇచ్చానా? ఎందుకో తెలుసా? రేపు నీ పుట్టిన రోజు. ఆ చీరెను ఆఫీసు నుండి స్మగుల్ చేసి తెస్తా. ఆ చీరెను నువ్వు కట్టుకుంటే ఇద్దరం గుడికెళ్దాం. ఆ చీర మొట్టమొదటిసారి నువ్వే కట్టుకోవాలి. ఆ తరువాతే బాసులు, అబ్బాసులు, ఊర్వశులు, రంభలూ...." అన్నాడు కృష్ణమూర్తి.

భామ పులకాంకితయింది. రవిశంకర్ చేతిలోని సితార అయింది. హరిప్రసాద్ చౌరాసియా పెదవుల మీద వేణువయింది. బాలమురళి గళంలోని స్వరరాజ్ఞిగా మారిపోయింది. తాను స్వయంగా డిజైన్ చేసిన చీరలో భామ పాలరాతి శిల్పంలా గోచరించింది కృష్ణమూర్తికి. ఆ మధుర భావన రాగంగా సంతరించుకుంది. భావ కవిత పలికింది.

(ఇంకావుంది)

# ఉగాది నాడు 3 ఊళ్లలో

**తారణ నామ సంవత్సరాది హాస్య, సంగీత ప్రియులకు ఓ కానుకగా భాసించింది. మూడు ఊళ్లలో 'హాసం క్లబ్స్' ప్రారంభమయ్యాయి. ఉదయం 10.35 కు రాజమండ్రిలో, సాయంత్రం 6.05 కు అటు విశాఖపట్టణంలో, 6.35 ఇటు ఏలూరులో 'హాసం క్లబ్స్' రసజ్ఞుల హర్షధ్వానాల మధ్య ఊపిరి పోసుకున్నాయి.**

## రాజమండ్రి

రాజమండ్రిలో పేపరుమిల్ వద్దనున్న శ్రీరామనగర్‌లో ఎం.వి.అప్పారావు (సురేఖపేరుతో కార్టూన్లు వేస్తారు) గారి ఆవరణలో దైవప్రార్థనతో 'హాసం క్లబ్' ప్రారంభమయింది. 'ఆంధ్రా కిషోర్‌కుమార్'గా పేరుబడ్డ శ్రీపాద జిత్‌మోహన్‌మిత్రా యోడలింగ్‌లో కిశోర్‌కుమార్‌కు, మహమ్మద్ రఫీకు గల తేడాను సోదాహరణంగా పాడి వినిపించారు. బేబీ మాధురి 'అయ్యయ్యో ముక్కుకు పడిశం పట్టెనే' అనే ప్యారడీ పాట పాడి అందర్నీ నవ్వించింది. అధిక్షేప హాస్యంపై డాక్టరేటు పొందిన ఆర్.ఎస్.వెంకటేశ్వరరావు హాస్యంలో పలురకాలను వివరించారు. కన్వీనర్లలో ఒకరైన హనుమంతరావు సమన్వయకర్తగా చతుర సంభాషణతో అందర్నీ ఆకట్టుకొనడంతోబాటు తమ శ్రీమతి విజయలక్ష్మితో కలసి స్కిట్స్ ప్రదర్శించారు. జో.రా.శర్మ, కార్టూనిస్టు శేఖర్, విస్సాప్రగడ లక్ష్మి, వి.పళ్లంరాజు సభను రంజింపచేశారు. ఇస్మాయిల్ వంటి అనేకమంది లబ్ధప్రతిష్టులు, సాహితీవేత్తలు సభను అలంకరించారు.

అతిథులుగా విచ్చేసిన 'హాసం క్లబ్' స్టేట్ కన్వీనర్ ఎస్.వి.రామారావు క్లబ్ లక్ష్యాలను వివరించారు. 'హాసం' మేనేజింగ్ ఎడిటర్ ఎమ్బీయస్ ప్రసాద్ సంభాషణాచాతుర్యం అలవడాలంటే ఇటువంటి క్లబ్స్‌లో పాల్గొనాలని విజ్ఞప్తి చేశారు. కన్వీనర్లుగా వ్యవహరిస్తున్న శ్రీ అప్పారావు (ఫోన్-2438085) శ్రీ హనుమంతరావు (ఫోన్ 2430945) రాజమండ్రిలో 'హాసం క్లబ్' సమావేశాలు ప్రతినెలా మూడవ శనివారం సాయంత్రం శ్రీరామనగర్‌లోనే జరుగుతాయని ప్రకటించారు.




రఫీ, కిశోర్‌ల యోడలింగ్‌లో తేడాలను పాడి చూపుతున్న జిత్‌మోహన్‌మిత్రా



సభాసదులలో ఒక భాగం. ముందువరుసలో శ్రీ ఎస్.వి.రామారావు, శ్రీ అప్పారావు, రెండో వరుసలో ఎమ్బీయస్ ప్రసాద్

**తమ ఊళ్లలో 'హాసం క్లబ్స్' ప్రారంభించ దలచిన హాస్య సంగీత ప్రియులు సంప్రదించవలసినది**
**శ్రీ ఎస్.వి.రామారావు, హైదరాబాద్.**
**ఫోన్ - 040- 24160279**

# 'హాసం క్లబ్స్' ప్రారంభం

## విశాఖపట్టణం



శ్రీ అవసరాల రామకృష్ణారావు 'హాసం' పై రాసిన పాటను ఆలపిస్తున్న శ్రీ టి.ఎల్.ప్రసాద్, శ్రీ చక్రధర్, శ్రీ మేడా మస్తాన్‌రెడ్డి

విశాఖపట్టణం మహారాణి పేటలో జిల్లా కేంద్ర గ్రంథాలయంలో సాయంత్రం గం॥ 6.05 లకు 'హాసం క్లబ్' ప్రారంభమయింది. కన్వీనర్‌లలో ఒకరయిన టి.ఎల్.ప్రసాద్ వ్యాఖ్యాతగా వ్యవహరించడంతోబాటు తను రాసిన పారడీసాంగ్స్‌తో సభానదులను నవ్వించారు. ప్రఖ్యాత రచయిత అవసరాల రామకృష్ణారావు, రచయిత, వ్యాఖ్యాత, 'పన్'డితుడు రాంభట్ల నృసింహశర్మ , రచయిత జె.పి.శర్మ జోక్స్ చెప్పగా రాగతి రమ హాస్యకవిత వినిపించారు. విశాఖ హ్యూమర్ క్లబ్ ప్రతినిధులు నండూరి ప్రభాకర్, చిదంబరం కూడా పాల్గొన్న ఈ సభలో పలువురు జోక్స్ వినిపించగా, రాంప్రసాద్ అన్నమయ్య గీతాన్ని పాడి వినిపించారు. పాటలన్నిటికి వల్లీసుబ్రహ్మణ్యం తబలా సహకారం అందించారు. నాగార్జున మెస్ వారు తేనీటి విందు సమకూర్చారు.

విశాఖలో ప్రతినెలా మూడవ ఆదివారం సాయంత్రం 'హాసం క్లబ్' సమావేశాలు జరుగుతాయని కన్వీనర్లు శ్రీ టి.యల్.ప్రసాద్ (ఫోన్ - 98850 56449), శ్రీ మేడా మస్తాన్‌రెడ్డి (ఫోన్ -2720219 / 2713554) ప్రకటించారు.

## పత్రికల స్పందన

...సాహిత్యసంబంధమైన జోకులే కాకుండా నిత్యజీవితంలో ఎదురయ్యే అనేక సంఘటనలను జోకులుగా మలచి వినిపించిన ఈ కార్యక్రమంలో కవులు, పండితులు, పురప్రముఖులు పెద్ద సంఖ్యలో హాజరయ్యారు.
(ఈనాడు, తూర్పుగోదావరి)

...ఒక మంచి కార్యక్రమం వీక్షించామంటూ సమావేశానికి హాజరైన పలువురు ఆనందం వ్యక్తం చేశారు
(సమాచారమ్)

... హాస్య, సంగీతాభిమానులందరికీ ఈ క్లబ్‌లో సభ్యత్వం ఉచితమని, కుటుంబ సమేతంగా వచ్చి జోకులు చెప్పవచ్చని నిర్వాహకులు అన్నారు.
(వార్త, విశాఖపట్నం)

...ఉగాదిరోజున శ్రీకారం చుట్టుకున్న హాసం క్లబ్ ప్రతి నెలా మూడవ ఆదివారం సాయంత్రం వేళల్లో హాస్య, సంగీత కార్యక్రమాలు వుంటాయని తెలిపారు.
(ఆంధ్రజ్యోతి, విశాఖపట్నం)

...అనేక మంది రచయితలు, గాయకులు తమ జోక్స్‌తో, హాస్య కవితలతో, గానంతో హాస్య, సంగీతప్రియులను అలరించారు.
(ఆంధ్రభూమి, విశాఖపట్నం)

## ఏలూరు

సాయంత్రం గం॥ 6.35కు కన్వీనర్లలో ఒకరయిన మోతే నారాయణరావుగారి ఇంట్లో ఏలూరు 'హాసం క్లబ్' ప్రారంభమయింది. ఛలోక్తులతో, జోక్స్‌తో, పాటలతో, పేరడీసాంగ్స్‌తో సాగిన ఈ కార్యక్రమానికి ప్రశాంతి వాకర్స్ క్లబ్ వారు అధికసంఖ్యలో హాజరయ్యారు.

వాకర్స్ క్లబ్ శారీరక ఆరోగ్యాన్నిస్తే హాసం క్లబ్ మానసిక ఆరోగ్యానికి దోహదపడుతుందని అంటూ ఎస్.వి.రామారావు హాసం క్లబ్ స్థాపనలో లక్ష్యాలను వివరించారు.

ఏలూరులో 'హాసం క్లబ్' కార్యక్రమాలు ప్రతినెలా మూడో ఆదివారం సాయంత్రం జరుగుతాయని, తదుపరి కార్యక్రమం రామచంద్రరావు పేటలోని డా॥ప్రసాద్ ఆసుపత్రివద్దనున్న డి.రామకృష్ణారావు గారి ఇంటివద్ద జరుగుతుందని కన్వీనర్లు శ్రీ మోతే నారాయణరావు (ఫోన్ - 221989) శ్రీ రామకృష్ణారావు (222318) ప్రకటించారు.

హాసం క్లబ్ లక్ష్యాలను వివరిస్తున్న శ్రీ ఎస్.వి.రామారావు, వేదికపై ఆసీనులయిన శ్రీరామకృష్ణారావు, శ్రీ మోతే నారాయణరావు






నలభై ఏళ్లుగా సినీ పరిశ్రమ
తీరుతెన్నులపై అధ్యయనం
చేసిన రచయిత, జర్నలిస్టు, నటుడు

# రావి కొండలరావు

రాసిన వ్యాసమిది



## మంట ఫైటుతో ఒళ్లు మంట!

"అర్ధరాత్రి" అనే సినిమాలో (1968) నేను విలన్ వేషం వేశాను ఏకంగా. హీరో జగ్గయ్యగారు. ఆయన్ని ఈ విలన్ గాడు బ్లాక్‌మెయిల్ చేస్తాడు. చివర్లో ఫైటూ చేస్తాడు. ఆ ఫైటూ కాగడాలతో ఫైటు. నాకు ఫైట్లు, కుస్తీలూ రావు. అసలేమి తెలీవు. ఆ మాటే డైరెక్టరు సాంబశివరావు గారితో చెప్పాను.

"ఫైట్ అంటే అంతసేపు రీళ్లూ రీళ్లూ కొట్టుకోవడంకాదు. జస్ట్-కాస్సేపే" అన్నారు. ఆ మాటే స్టంట్ మాస్టర్ రాఘవులుతోనూ చెప్పాను. "డూప్ వేసేంత దేం వుండదు. నేను చెప్తాగా" అన్నాడతను.

జగ్గయ్యగారికీ నాకూ చెరో కాగడా ఇచ్చారు. కిరసనాయిలు పోశారు. మండించారు. నన్ను పైకెత్తమన్నారు. అలా ఎత్తే సరికి వేడివేడి కిరసనాయిలు చుక్కలు నా చేతి మీదకి జారగా,



చెయ్యికాలగా, కాగడా కిందపడేశాను! "అలామరీ అంత పైకెత్తికండి సార్.... స్ట్రైయిట్‌గా పట్టుకోండి" అని ఆ కాగడాకి మళ్లీ మంట బెట్టి చేతికందించారు. కెమెరా ఎదురుగా పెట్టి కాగడాని అటూ ఇటూ ఆడిస్తూ ముందుకు రమ్మన్నారు. క్లోజప్ లో అన్నమాట. ఏదో చేశాను. అంతలో జగ్గయ్య గారొస్తే ఆయనకి క్లోజప్‌లు తీశారు. ఆ తర్వాత ఇద్దర్నీ ఎదురుగా పెట్టి ఫైటింగన్నారు. నాకు భయం ! పైగా నిప్పుతో చెలగాటం! పైగా కంచు కంఠేశ్వరుడైన జగ్గయ్య గారితో ఫైటు, కానీ! మంటలే కుండా మాములుగా రెండు రిహార్సిల్లు చేయించి 'టేక్' అని, కిరసనాయిలు పోసి మంటపెట్టి కాగడాలు ఇచ్చారు. సినిమాల్లో స్టంటులెవరూ నిజంగా చెయ్యరు. ఎలా నిజంగా నటులు ఏడవరో, ఎలా నిజంగా నవ్వరో అలాగే ఇదీ నటనేట! నాకేం తెలుసు ? షాటులో జగ్గయ్యగారి వేపు దూసుకువెళ్లి, సాముకర్ర తిప్పినట్టు కాగడా తిప్పాను. కిరసనాయిలు చింది, జగ్గయ్యగారి మీద పడింది ! "ఏమిటి స్వామి! మొహం అంతా కాల్చేసే లాగున్నారు. మీరు ఫైటింగేమిటి? సాంబశివరావు!" అని డైరెక్టరుని కేకేసి, ఈయనే మిటయ్యా - నిజంగా ఫైట్ చేసేలా వున్నారు ? ...అంత స్పీడయితే ఒళ్లంతా కాలినా కాల్తుంది. ఐనా హీరో అంత సేపు విలన్‌తో, అందులోనూ ఈ మాస్టారితో, ఏ రాజనాలో ఎవరో అయితే, సాటి పోటీ వుంటుంది గాని ఈయనతో అక్కర్లేదయ్యా" అన్నారు జగ్గయ్యగారు- నవ్వుతూనే.

నాకు ముచ్చెమటలు పొయ్యడానికి బదులు, వేడి కిరసనాయిలు మంటలు పోశాయి! "నాకు రాదు, నాకు తెలీదు అని చెబుతూనే వున్నాను సార్" అన్నాను. "తెలుగు మాస్టార్లా డైలాగులు చెప్పి నటిస్తాడయ్యా ఈయన ! (అప్పటికి "ప్రేమించి చూడు" అయిపోయింది) ఈ ఫైట్లు, సాహసాలూ ఎందుకు -నన్ను దహింప చెయ్యడానికి కాకపోతే ?" అన్నారు జగ్గయ్యగారు నవ్వుతూనే. "ప్రస్తుతానికి మీ ఒళ్లు మండుతుంది, ఇంకోరకంగా నా ఒళ్లూ మండుతోంది" అన్నాన్నేను. ఎలాగోలా, నాలుగైదు షాట్లులో ఫైటింగ్ ముగించి, నా చేత జగ్గయ్యగారి చేతా కూడా "అమ్మయ్య" అనిపించారు దర్శకుడు, స్టంటు మాస్టరూ.

* * *

## జనం భయం !

ఒకసారి, ఎక్కడికో అవుట్డోర్ షూటింగ్ కి వెళ్లాం. ఆ సినిమాలో జగ్గయ్యగారున్నారు. షూటింగులకి జగ్గయ్యగారు లేటుగా వస్తారన్న పేరు పొందినవారు. అవుట్డోర్ అయినా అంతే. విజయవాడ నుంచి ఏదో వూరు వెళ్ళాలి. నన్ను కారెక్కించారు - కూచున్నాను. జగ్గయ్యగారు నిదానంగా వచ్చి కారెక్కారు. బయల్దేరింది. అప్పుడు ఈ ఎ.సి.కార్లూ, అద్దాలు ముయ్యడాలు ఏం లేవుకదా!, జగ్గయ్యగారు వెనకసీట్లో 'కిటికీ' దగ్గర కూచున్నారు. జనం పోగవుతారు, చూస్తారు - సహజం! ఆయన డైరెక్టర్‌తో టవున్ లోంచి వెళ్లద్దనీ, జనం గుర్తు పడాతారనీ వీలైతే వేరే దార్లో వెళ్లమనీ చెప్పారు. కాని ఒక్కోసారి



తప్పదుగా "ఇటు వక్క వద్దు నాయనా గుర్తుపడతారు." అన్నారాయన, చిన్న విసుగు మిళాయించి. నేనన్నాను "ఏమిటి సార్ ! 'గుర్తు పడతారు గుర్తు పడతారు' అని భయపడుతారు? నేరస్తులు భయపడాలి -పోలీసులు గుర్తుపడతారని"! అన్నాను. పకపకమని నవ్వింది. ఆ కంచుకంఠం.

"మనం సినిమా వాళ్లం - మనమూ నేరస్తులమే. బందీలం. స్టార్‌డమ్ వచ్చిన తర్వాత, ఎక్కడికీ తిరగడానికి లేదు. అంతకుముందు స్టార్‌డమ్ కావాలని కోరుకుంటాం. వచ్చిన తర్వాత కష్టాలే. రైల్లో ప్రయాణం, చెయ్యాలన్నా షాపింగ్ చెయ్యాలన్నా - ఏ ఫంక్షన్‌కి వెళ్లాలన్నా ఇబ్బందే. జనం అనండి, అభిమానులనండి కదలనివ్వరు. షేక్ హాండ్లూ, ప్రశ్నలూ, కబుర్లు వాటితోనే సరిపోతుంది. ఇది చాలామంది తారలు ఇష్టపడతారు. నాకెందుకో చిరాకు. నేరస్తులు చట్టానికీ, పోలీసులకీ భయపడతారు. నేను ఈ అభిమానులనబడే చుట్టాలకీ, ఆ పొకడలకీ భయపడతాను" అని నవ్వారు. కోపం వచ్చినప్పుడు తప్ప జగ్గయ్యాగారు ఎక్కువగా నవ్వుతూనే వుండేవారు. అది కూడా చిన్ననవ్వు కాదు - పకపకమనే నవ్వు!

## పద ! ద్రుపదా !

చందమామ విజయకంబైన్స్ 'శ్రీకృష్ణార్జున

విజయం' మొదలెడుతున్నప్పుడు పాత్రధారుల నిర్ణయంలో ద్రుపదుడి పాత్రకు గుమ్మడి గారనుకున్నాం. ఆయనతో మాట్లాడ్డం, డేట్స్ చెప్పడం కూడా జరిగింది. అయితే, అటు తర్వాత ఆయనకి అనారోగ్యం చేసింది. షూటింగు తేదీలు దగ్గర పడుతున్నాయి. సత్యనారాయణని అడిగితే, బిజీ -కుదర్లేదు. 'ఎవరా ఎవరా' అనుకుని జగ్గయ్యగారయితే బాగుంటుందన్న



అభిప్రాయానికి వచ్చాం. మంచి డైలాగులున్న దృశ్యాలున్నాయనీ జగ్గయ్యగారి సంభాషణలు అదురుతాయనీ అనుకుని నేనూ, మేనేజరూ జగ్గయ్యగారి దగ్గరికి వెళ్లి నిదానంగా విషయం మొదలెట్టాం. అంతా విని ముందుగా ఆయన ఒక్కసారి వికటాట్టహాసం చేశారు. "మంచి ద్రుపదుడి దగ్గర కొచ్చారు" అన్నారు నవ్వుతూనే. నేను అగమ్యంగా అయోమయంగా చూశాను.

"వీరులు అస్త్ర సన్యాసం చేసినట్టు నేను పాత్రధారణ సన్యాసం ఎప్పుడో చేశాను. పైగా, ఈ ద్రుపదుడి పాత్రకి నన్నెలా అనుకున్నారు? నేను పురాణ పాత్రలు ధరించడమే చాలా తక్కువ. అందులో ఈ గడ్డాల పాత్రలు అసలు ధరించలేను. ఎప్పుడో పరశురాముడి వేషం వేశాను. అయినా ఈ పాత్రకి నన్ను ఎలా అనుకున్నారు?" అని మళ్లా రెట్టించి అడిగారు జగ్గయ్య.

"మీరు కారెక్టర్ యాక్టర్ కదా. ఈ కారెక్టరులో ఒక వైవిధ్యం వుంటుందనీ..." అన్నాను నసుగుతూ.

"నాకు కారెక్టరుంది. నా కారెక్టర్‌కి ఈ పాత్ర పడదు. నటుడు పాత్రల్ని వెతుక్కుంటూ వెళతాడు. ఈ పాత్ర నన్ను వెతుక్కుంటూ వచ్చింది. కాని రాంగ్ ప్లేస్‌కి వచ్చింది. ఇంకో చోటుకి పంపేద్దాం - సారీ" అన్నారు జగ్గయ్య గారు మెత్తగా చీవాట్లు పెట్టినట్టు-సహజ ధోరణిలో నవ్వుతూ.

### పసుపు విభూతి !

ఎ. పి. నాగరాజన్ అని, తమిళంలో పెద్ద డైరెక్టరు. ఎక్కువగా పురాణాలు తీశారు. ఆయన ఒక శైవకథని సినిమాగా మొదలుపెట్టారు. మొదట రోజు షూటింగ్ నాడే వందల కొద్దీ జనం. ఒక పెద్ద గుడి మంటపంలో, శైవులందరూ సమావేశం కావడంలాంటిదేదో సన్నివేశం. ఆ వందల మందినీ శారదా స్టూడియోకి రప్పించి, చొక్కాలు తీయించి, పంచెలు కట్టించి, విభూతి పిండికట్లు నుదుటి మీద, చేతులకీ, ఛాతిమీదా పెట్టించారు. నలుగురైదుగురు మేకప్‌మాన్లు తెల్లవారుజాము నాలుగ్గంటల నుంచి ఆ వ్యవహారంలో పడిపోయి అందర్నీ ఏడు గంటలకల్లా సిద్ధంచేసి సెట్టుకి పంపించారు. షాట్ రెడీ చేసుకుని సిద్ధంగా కూచున్న డైరెక్టరు, పక్కనే వున్న ఫొటోగ్రాఫరూ ఈ జనాన్ని చూసి, కనుబొమలు పెకెత్తి - నోరు వెళ్లబెట్టి ఒకర్నొకరు చూసుకుని, వాళ్లు విభూతి పెట్టుకున్న నుదుటి మీద తాము కొట్టుకున్నారు! కారణమేమి? అది రంగుల చిత్రం. అప్పుడప్పుడే బ్లాక్ అండ్ వైట్ సినిమాలు పోయి, కలర్‌లు వస్తున్న రోజులు. మామూలుగా బ్లాక్ అండ్ వైట్ అయితే, విభూతి పసుపు పచ్చని రంగులో పెయింట్ వేస్తారు. వందల మందందరికీ పసుపు రంగులే పూశారు! కలర్ సినిమా! తొలిరోజు ఆరంభం! రాత్రి ఎవరూ మేకప్ వాళ్లకి సరిగా చెప్పలేదుట, వాళ్లు బ్లాక్ అండ్ వైట్ అనుకుని, ఆ ప్రకారం మూడు గంటలపాటు ఒళ్లు హూనం చేసుకుని పసుపు విభూతులు రుద్దేశారు.! కలర్ సినిమాలో, మాముల తెల్లని విభూతి రంగులే వాడాలి. ఏం చేస్తారు? మళ్లీ అందర్నీ బయటకి పంపి, పసుపురంగుల్ని తుడిపించి,తెల్ల రంగులు తెప్పించి పూయడానికి-ఈ సారి నాలుగు గంటలు పట్టింది. అనుకున్న ముహూర్తం షాటు కుదరక, గుడిలోని శివలింగ మీద క్లాప్ కొట్టి-"నమః పార్వతీ పతియే", అనిపించేశారు! బ్లాక్ అండ్ వైట్ -కలర్‌గా మారుతున్న సంధ్యా సమయంలో ఏర్పడే తిప్పలు- కొల్లలు!

### ముఖం గోడకి సున్నం !

చేతులకి పెయింట్ అంటే జ్ఞాపకం వచ్చింది. ఆత్రేయ గారొకసారి చెప్పారు. ఆయన మద్రాసు చేరుకున్న కొత్తల్లో - వేషాలైనా వేదామని తెగతిరిగారుట. (ఆయన మంచినటుడు. తాను



రాసిన 'గుమస్తా' నాటకంలో - గోపీ పాత్ర ధరించి పేరు, బహుమతులు తెచ్చుకున్నారు. ''చిన్న వేషాలేవైనా వెయ్యొచ్చునేమో అని శోభనాచల స్టూడియోకి వెళ్లాను. అక్కడెవరో కనిపిస్తే అడిగాను కూడా. అతను, "ఇలా కుడి పక్కకి వెళ్లి ఎడమ పక్క చూస్తే ఫ్లోర్ కనిపిస్తుంది. ఫ్లోర్ వెనక్కి వెళితే చిన్న వేషాలు వేసే వాళ్లకి మేకప్‌లు చేస్తున్నారు. అక్కడ అసిస్టెంటు డైరెక్టరుంటాడు. అతన్ని అడగండి." అని పంపించాడు. వెళ్లాను. వెళితే ఓ ఇరవైమంది వరసగా నించుని, క్యూలో నడుస్తూ వుంటే - ఒకతను పెద్ద బకెట్ నిండా జేగురు రంగులాంటిది కలిపి, దాంట్లో చీపురు సైజులో వున్న బ్రష్ ముంచి, ముఖాల మీద - గోడకి సున్నం కొట్టినట్టు కొట్టి -'నెక్స్ట్' అంటున్నాడు!

నాకు తల తిరిగిపోయింది. ఆ దృశ్యం జ్ఞానోదయం కలిగించింది. "వేషాల కోసం ప్రయత్నం వద్దురా బాబూ - రచనకే ప్రయత్నించు" అని నాకు నేను చెప్పుకుని -ఒకవేళ నన్నూ రమ్మని పిలుస్తారేమో అన్న భయంతో చరచరా వరుగెత్తి, స్టూడియో నుంచి బయటపడ్డాను!" అని చెప్పారు ఆత్రేయ.

* * *

"బంధువులొస్తున్నారు జాగ్రత్త" అన్న సినిమా షూటింగు జరుగుతోంది. మద్రాసులోని ఒక ఇంట్లో బయట కొందరికి షాట్లు తీస్తూవుంటే - లోపల కొందరు కూచున్నాం. టీవీలో "విప్ర నారాయణ" సినిమా వస్తోంది. చూస్తున్నాం. అంతలో శ్రీలక్ష్మి షాటు పూర్తవగా, లోపలి కొచ్చింది. విప్రనారాయణుడు దేవదేవి తో మాట్లాడుతున్న సన్నివేశం వస్తే - ఛట్టున గుర్తుపట్టలేక, శ్రీలక్ష్మి "ఎవరు? ఎవరాయన?" అని అడిగింది.

"అదేమిటమ్మా - నాగేశ్వరరావుగారు,



తెలియలేదా?" అని అడిగాను. ఆ సినిమా ఆమె చూడలేదుట. ఆ గుండు, పిలక, నామం, తులసిమాల అవీ చూస్తూ 'అ!' అని వుండిపోయింది శ్రీలక్ష్మి. "ఏం శ్రీలక్ష్మీ-ఇంకా నీకు అనుమానమేనా ? నాగేశ్వరరావు గారమ్మా - అదే నాగార్జున ఫాదరు" అన్నాన్నేను సరదాగా. "తెలుసులెండి.." అని శ్రీలక్ష్మి నవ్వేసింది. నేను ఊరుకోక, ఆ తర్వాత నాగేశ్వరావుగారిని కలిసినప్పుడు ఈ విషయం చెప్పాను. ఈ తరం వాళ్లకి ఎక్కువగా ఈ తరం వాళ్లు తెలుస్తారు గదా-అందుకనే నేను జోక్యులర్‌గా "నాగార్జున ఫాదరు" అన్నానని - నాగేశ్వరావుగారితో చెప్తే - ఆయన గొప్ప చమత్కారం విసిరారు. ఏమిటో తెలుసా? "ఇంకానయం నాగార్జున ఫాదరు కూడా సినిమాలో యాక్ట్‌చేసేవారా? అని అడగలేదు శ్రీలక్ష్మి !". ◆

## 'సరిగపదమని-14'

**జవాబులు:-**

అడ్డం: 1.చిలుకలు 3.ఆడజన్మ 5.మేడ 8.వేయి 10.బాలరాజు 12.బ్రహ్మ 13. దేవుడు 15.నవ 16.మొక్క 17.ఒప్ప 18.అచ్చ 20.పసిడి 21. వానా 22. నిద్ర

నిలువు: 1. చిన్న 2.కళ్ళు 3 .ఆడవే 4.జడ 6.బాల 7.రోజు 9.బ్రహ్మమొక్కటే 10.బాట 11.రాగం 13.దేవ 14.అప్పుచేసి 15.నవ్వాను 18.అమ్మెనా 19.లేని

### కరెక్టు సమాధానాలు వ్రాసిన వారు:

జి.ప్రకాశరావు- సికింద్రాబాద్, ఎమ్.వెంకటదుర్గ- సామర్లకోట, జాగిర్దార్ మాధురి- సామర్లకోట, ఆర్.పుల్లాయమ్మ- తెనాలి, వేదగిరి విజయలక్ష్మి- హైదరాబాద్, మేడా దినేష్‌రెడ్డి- విశాఖపట్నం, మేడా పద్మావతి- విశాఖపట్నం, ఆమంచి వేంకటలక్ష్మి కామేశ్వరి- రాజోలు (తూ॥గో॥జిల్లా), వై.రాజానాయుడు- మదనపల్లె (చిత్తూరు), పి.బి.మాధవ- హైదరాబాద్, రజని- హైదరాబాద్, ఎన్.సిహెచ్- కోదాడ్ (నల్గొండ), చింతపెంట శేషాంజలి- అనపర్తి (తూ॥గో॥జిల్లా), మహమ్మద్ లతీఫ్- నాచారము (రంగారెడ్డి), మేడా మస్తాన్‌రెడ్డి- విశాఖపట్నం, యల్లాప్రగడ భానుమతి- సోమల (చిత్తూరు), కె.మురళీకృష్ణ- సత్తెనపల్లి, (గుంటూరు), యం.రామకృష్ణమాచార్యులు- హైదరాబాద్, ఆర్.సూర్యకీర్తి- తణుకు (ప॥గో॥జిల్లా), కిశోర్‌కుమార్.ఆర్- 8ఇంక్లైన్ కాలని (కరీంనగర్), టి.సౌభాగ్యలక్ష్మి- సికింద్రాబాద్, ఎన్.జగదీశ్వరరావు- హైదరాబాద్, ఎ.జి.కృష్ణమూర్తి- గుంటూరు, యం.విజయలక్ష్మి- నల్గొండ, గంగారపు కళ్యాణి- పత్తెనపల్లి, తాడి రంగారావు- రాజమండ్రి, ఎమ్.ఎన్.వి.శాస్త్రి- కాకినాడ, జె.భాగ్యలక్ష్మి- కర్నూలు, పి.ఎస్.ఆర్.సి.మూర్తి- సికింద్రాబాద్, ఆర్.కళ్యాణి- బెంగుళూరు, బి.ఎ.ఎస్.ప్రసాద్- పుల్లలపాడు (ప॥గో॥జిల్లా), ఎన్.జగన్మోహన రావు- కరీంనగర్, పడాల రాము- పాతపట్నం, సి.యామినీ- హైదరాబాద్, టి.రమణ ప్రసాద్- చిత్తూరు, వేముల శేఖర్- నిజామాబాద్, అయ్యగారి రాజశేఖర్- రాజోలు, యు.యు.ఉరుకుందు- ఎమ్మిగనూరు, వి.ప్రభాకరరావు- నెల్లూరు, వంగల శ్రావ్య- రాజమండ్రి, పి.శేఖర్‌బాబు- ధర్మాసాగర్ (వరంగల్), గంటి వినయ్- అమలాపురం, గంటి రమ్య- అమలాపురం, పి.పార్థసారథి- ఆకుతోటపల్లి (అనంతపురం), అంజలి- జాడిజమాల్‌పూర్ (నిజామాబాద్), జి.సంతోష్ విహారి- హైదరాబాద్, టి.దీప్తి- పుణే, భావరాజు వెంకట మల్లిఖార్జునం- హైదరాబాద్, సిహెచ్. సుమతి పావన్- హైదరాబాద్, ఎన్.వి.ఎల్.పావని- తూర్పుగోదావరి, బల్లారి ఉమాదేవి- అదోని (కర్నూలు), కాకర్ల మోజస్- అంబవరం (ప్రకాశం), సి.ఛాయదేవి- విజయవాడ, యం.మీనాప్రభాకర్- పాలెం (మహబూబ్‌నగర్), ఆర్.సత్యరాజన్- కొవ్వూరు (ప॥గో॥జిల్లా), బి.అననూయ- చిలకలూరిపేట, సి.ఎస్.రాము- నెల్లూరు, టి.వి.నిర్మల- పర్లాకిమిడి (ఒరిస్సా), బచ్చు తులసిదాసు- పర్లాకిమిడి (ఒరిస్సా), టి.అనిత- అచ్చంపేట్ (మహబూబ్‌నగర్), కె.అరుణ- సికింద్రాబాద్, తేజో కార్తిక్- పిలాని (రాజస్థాన్), మంచెం విజయ- కాకినాడ, చెరుకుతోట పరాత్పరరావు- ఏలూరు (ప॥గో॥జిల్లా), బులుసు ప్రభాకరరావు- హైదరాబాద్, చెల్లూరు సాంబమూర్తి- విశాఖపట్నం, ఎ.సప్నరాణి- గుంటూరు, పి.ఉదయ భాస్కర్ & విజయ- రాజమండ్రి, పి.వి.వి.సత్యనారాయణ- చిపూరుపల్లి, దిల్‌షాద్ ఫాతిమా- ధవళేశ్వరం, వడ్లమన్నాటి నాగసాయి భరద్వాజ్- విజయవాడ, ఉప్పల వెంకటరమణయ్య- కడప, ఉద్దాలి భాసరయ్య- చెన్నై, కె.వి.సత్యవతి- హైదరాబాద్, కె.వి.కామేశ్వరరావు- విశాఖపట్నం, మైనంపాటి శారద- విజయవాడ, టి.వింధ్యారాణి- నల్గొండ, నేమాన సుభాష్‌చంద్రబోస్- శ్రీకాకుళంటౌన్, గుత్తా మాధవి- కంచికచెర్ల (కృష్ణ), కె.వి.నరవన్‌కుమార్- సోదాం (చిత్తూరు), ఎమ్.కోటేశ్వరరావు- కాశీపూర్ (ఉత్తరాంచల్), ఆదూరి రామకృష్ణ- హైదరాబాద్, కె.సుధాదేవి- చీరాల, వి.వి.రమణి- బచేలి, ఎన్.సత్యనారాయణరెడ్డి- సాలూరు (విజయనగరం), ఎస్.సమీర- హైదరాబాద్, సి.హెచ్.దీపిక- విశాఖపట్నం, కె.కళ్యాణ్‌కుమార్- రామసముద్రం (చిత్తూరు), ఎ.బాలచందర్- హైదరాబాద్,ఎ.టి.శ్రీనివాసన్- అనంతపూర్, కె.వి.ఎన్.ఎస్.భగవాన్- రాజమండ్రి, కె.సంతోష్‌కుమార్- సికింద్రాబాద్, పి.రాణి- నరసాపురం (ప॥గో॥జిల్లా), ఎమ్.దుర్గా- వైజాగ్, ఇప్పగుంట వెంకటశ్రీనివాసరావు- మీర్‌పేట్, నెత్తారామకృష్ణ- విజయనగరం, కోట లలిత- నల్గొండ, మామిళ్ళపల్లి వేణుగోపాలశర్మ- రాయిచూర్ (కర్ణాటక), టి.వి.ఎల్.శశికాంత్- హైదరాబాద్, మాచెర్ల సురేష్- రాజమండ్రి, బిహారా శేషశాయి- సత్తెనపల్లి (గుంటూరు), అల్లూరు రామరాజు- విజయవాడ, కె.వి.సరస్వతి- హైదరాబాద్, బి.కవిత- ప్రొద్దుటూరు (కడప), చముటూరి కిరణ్మయి- హైదరాబాద్, పి.మధు- విజయనగరం, సి.విజయసారథి- కర్నూలు, పి.వేణుగోపాల్‌రావు- అచ్చంపేట (మహబూబ్‌నగర్), ఎమ్.శోభన్‌బాబు- సికింద్రాబాద్, వై.యశోద- వైజాగ్, జి.వి.కృష్ణకుమార్- జగ్గయ్యపేట (కృష్ణా), టి.ఎస్.హిమరాణి- కాకినాడ, ఎమ్.రామలక్ష్మి- విజయవాడ, వి.వి.రమణాచార్యులు- శ్రీకాకుళం, కె.కృష్ణశాస్త్రి- రాజమండ్రి, ఇ. రాము- కర్నూలు, జి.జయలక్ష్మి- కర్నూలు, జి.జయచంద్రగుప్త- కర్నూలు, పప్పు అప్పారావు- శ్రీరాంనగర్ (విజయనగరం), కర్రీ రఘునీ- హైదరాబాద్, వుండమాటి ఆదిలక్ష్మి- కాకినాడ, ఎన్.అరుణాకుమారి- ఎలమంచిలి (విశాఖజిల్లా), ఎస్.రుహి- కరీంనగర్, టి.సత్యనారాయణ- గూడూరు, కె.రాఘవేంద్ర- గద్వాల్, రామసహాయం రఘువీరరెడ్డి- నల్గొండ, టి.శేషగిరి- తుని (తూ॥గో॥జిల్లా), మామిడి మహేంద్ర- పూణే (మహారాష్ట్ర), పక్కి చక్రవర్తి- గరివిడి (విజయనగరం), రజన రమేష్- బెర్హంపూర్ (ఒరిస్సా), సి.హెచ్.కళ్యాణ్ చక్రవర్తి- బెర్హంపూర్ (ఒరిస్సా), యనమ్నడ రాజ్యలక్ష్మి- సికింద్రాబాద్, యడ్లపల్లి చంద్రశేఖర్- తెనాలి (గుంటూరు), లుంచూరు లక్ష్మీప్రసాద్- హైదరాబాద్, తాళ్లూరి రేణుకాదేవి- హైదరాబాద్, బచ్చు విజయ్‌కుమార్- విశాఖపట్నం, అవసరాల మహతి- విశాఖపట్నం, ఎ.వి.ఆర్.కృష్ణ- హైదరాబాద్, వేదగిరి లక్ష్మీప్రసాద్- సికింద్రాబాద్, కె.శంకరనారాయణ- హైదరాబాద్, కురుగంటి కల్యాణి- హైదరాబాద్, కె.కామేశ్వరీ రఘురామ్- విశాఖపట్నం, ఎస్.టి.శ్రీనివాసులు- హైదరాబాద్, తిరుమల్ ప్రసాద్.పి- హైదరాబాద్, పి.వి.జ్యోత్స్న, శ్రీవళ్ళి- హైదరాబాద్, పి.వి.సౌజన్య- హైదరాబాద్, ఘణగం నాగదుర్గ- హైదరాబాద్, ఆర్.చంద్రశేఖర్-హైదరాబాద్, పినకా జ్యోతి- కత్తిపూడి (తూ॥గో॥జిల్లా), ఆర్.ఫణిబాల- ధవళేశ్వరం, ఎ.మల్లిఖార్జునరావు- హైదరాబాద్, ఎమ్.కొండారెడ్డి-కడప, బి.తిరుమలరాజు- పలమనేరు (చిత్తూరు), ఆర్.వై. గౌడు-అనంతపురం, ఇ.రెడ్డి బాబు-కదిరి, బి.కె.ఎల్.స్రవంతి-అనకాపల్లి, ఫణికిరణ్- కొడాలి (కృష్ణా), ఎ.రాధికరావు-అమలాపురం, యల్లాపంతుల చందు- శ్రీకాకుళం, పాణ్యం అమూల్య-కర్నూలు, ఎం.కీర్తన-మదనపల్లి (చిత్తూరు), బి.శివరామకృష్ణా-తాడేపల్లి (గుంటూరు), కె.ఎస్.దయానిధి-గుంటూరు, ఉప్పాల మోహనబాబు- అవనిగడ్డ(కృష్ణా), ఎమ్.అంజిరెడ్డి-ఒంగోలు, కె.చెన్నక్రిష్ణారెడ్డి- హైదరాబాద్, అడపా విఘ్నేశ్వరరావు- పర్లాకిమిడి (ఒరిస్సా), ఎస్.జితేంద్ర- హైదరాబాద్, కె.ఎస్.కార్తీక్- రాజమండ్రి, మారిశెట్టి శంకరరావు- అనకాపల్లి, సి.హెచ్.జహ్నవి-వరంగల్.

### ఒక తప్పుతో వ్రాసిన వారు:

పి.గోపి కిరణ్- హైదరాబాద్, కోట్ల గణపతి- హైదరాబాద్, పి.బాలమణి- శ్రీకాకుళం, కె.వాసంతీదేవి- నిజామాబాద్, బిచ్చాల్ ప్రభాకర్‌రావు- హైదరాబాద్, రమేష్ సాంపాళి- ఎమ్మిగనూరు, బాసరాజు యాదగిరి- రామన్నపేట (నల్గొండ), నీలం రామమూర్తి- కొరాపుట్ (ఒరిస్సా), జి.పాండురంగశర్మ- హైదరాబాద్, సి.మల్లిఖార్జున రెడ్డి- కర్నూలు, జి.వెంకటరావు- హైదరాబాద్, కె.ఆర్.బి.ప్రసాద్- హుజూర్‌నగర్ (నల్గొండ), కుంటా శివనాగేశ్వరరావు- గుంటూరు, స్వాతి అప్పు చిన్ను- విజయవాడ, ఉప్పులూరి లక్ష్మీశాంత- ముగలికుదురు, తేతలి శుభాప్రణీత- విశాఖపట్నం, చివుకుల సుబ్రహ్మణ్యశాస్త్రి- ఒంగోలు, పి.జె.ప్రియతము- విశాఖపట్నం, ఎల్.వి.వి.ఎస్.భగవాన్‌శాస్త్రి- గండిపాళెం (నెల్లూరు), నిర్మలక్రిష్ణ- తిరుపతి (చిత్తూరు), వి.వి.సత్యనారాయణ- విజయవాడ, ఎన్.రాధాకామేశ్వరి- హైదరాబాద్, చుంచు మల్లేశబాబు- విశాఖపట్నం, మాదాబత్తుల లక్ష్మి- విజయనగరం, ఎన్.చిన్న- కోల్‌కట, ఎమ్.ఆరుణ్ కొండిన్య- హైదరాబాద్, కె.జగదీష్‌బాబు- పార్వతీపురం (విజయనగరం), వి.రాంబాబు- విజయనగరం, జి.సుకుమార్- బెంగుళూరు, యర్రాపోతరాజుగారు- కాకినాడ, బి.ధనుంజయరావు- పాతపట్నం, పి.నిర్మల- నర్సాపూర్ (ప॥గో॥జిల్లా), వేలివెంటి నాగస్వర్ణ- తెనాలి (గుంటూరు), మిలుకూరి శ్రీనివాసశర్మ- విజయవాడ, పింగళి శ్యామసుందర్- బెంగుళూరు, కె.మల్లిఖార్జున ఆచారి- కర్నూలు, డి.కిరీటి- హైదరాబాద్, కె.అన్నపూర్ణ- విజయవాడ, జె.నాగలక్ష్మీదేవి- అనకాపల్లి, ఎ.అశోక్‌కుమార్- గుర్రంపోడ్ (నల్గొండ), కేమిశెట్టి భువనేశ్వరి- కాకినాడ, గానుగపాటి సరోజనీదేవి- సికింద్రాబాద్, ఎన్.శంకరాచార్యులు- చిలుకానగర్, ఎస్.కె.జిలాని- కొత్తగూడెం (ఖమ్మం), శిల్ప.వి- కర్నూలు, కె.హరికృష్ణ- ఖమ్మం, క్కొక్కొండ పర్మి- పోతిరెడ్డిపల్లి (వరంగల్), పమిడుముక్కల వరలక్ష్మి- చొడువాడ (విశాఖపట్నం), రాజ్‌కుమార్ ముగ్గళ్ళ- మల్కాజ్‌గిరి, డి.పార్వతి- విజయవాడ, వాసన్త వరలక్ష్మి- నెల్లూరు, సిహెచ్.శ్రీనివాసులు- పెద్దదోర్నల (ప్రకాశం), మరువాడ కామేశ్వరరావు- మంచిర్యాల (ఆదిలాబాద్), కె.విజయకుమారి- కాకినాడ, తెలికిచర్ల రామకృష్ణ- విజయనగరం, గర్రాటి సాయిశ్రీ- ఖమ్మం, వి.పద్మావతిదేవి- విశాఖపట్నం, పెంటకోట షర్మిళాబుషి- చింతల అగ్రహారం (విశాఖజిల్లా), పి.అలివేలు- విజయవాడ, పి.రమణ- హైదరాబాద్, అపూర్వ భావన- పాలకొల్లు, కె.సత్యం- ఎస్.కోట (విజయనగరం), వేముల కిరణ్‌కుమార్- నిడుబ్రోలు (గుంటూరు), జి.ఇందిరా కుమారి- హైదరాబాద్, వి.శ్రీలక్ష్మి- హైదరాబాద్, బులుసు గిరిధర్- విశాఖపట్నం, మన్నవ మాధవి- సత్తెనపల్లి, ఎం.వి.యస్.లక్ష్మి- కాకినాడ, పుణ్యాల శాంతి- సత్తెనపల్లి, ఆర్.శారద- హైదరాబాద్, ఎస్.పి.మధుసూదన- తిరుపతి, ఎమ్.సత్యవాణి- తణుకు, యజ్జల జగన్నాథం- పాతపట్నం (శ్రీకాకుళం), సపారే ఇందిర- కళ్యాణ్, ఎస్.శివనారాయణ- కొత్తపేట (ప్రకాశం), నందిగం రామారావు- అంకంపాలెం (ఖమ్మం), పి.స్వరాజ్య లక్ష్మి- తిరుపతి, ఎస్.శివప్రసాద్- నంద్యాల, గుడ్లరాజు- రామారెడ్డి (నిజామాబాద్).

### రెండు తప్పులతో వ్రాసిన వారు:

సంజీవ్‌కుమార్- హైదరాబాద్, సీతాదేవి.వి- విజయవాడ, ఆత్కూరి వెంకటలక్ష్మి- హైదరాబాద్, ఎమ్.డి.షాహీన్- హైదరాబాద్, పి.పాపారావు- విశాఖపట్నం, ఎల్.భవాని- హైదరాబాద్, గుంటి ఈశ్వర్ యామిని కార్తిక్ సాగర్- వనపర్తి (మహబూబ్‌నగర్), డి.దుర్గ- హైదరాబాద్, పింగళి కనకవల్లి- గుంటూరు, పేరి వెంకటలక్ష్మి- హైదరాబాద్, ఎ.ఆదినారాయణ- పోతవరం (గుంటూరు), జన్ను బాబురావు- మచిలీపట్నం, శ్రీరామచంద్ర.కె- హైదరాబాద్, రావుల వేణుగోపాల్- కాజీపేట (వరంగల్), డాం కె.సంజీవ్‌కుమార్- నవీపేట్ (నిజామాబాద్), పి.కాంతామణి- విజయనగరం, ఎమ్.వి.ఎన్.శాస్త్రి- విజయవాడ, ఇ.నటరాజన్- కాజూర్ (చిత్తూరు), కనకదండి జగన్నాథరావు- టాటానగర్ (జార్ఖండ్).

### మూడు తప్పులతో వ్రాసిన వారు:

టేరుమళ్ళ సాయి వినీత్- నెల్లూరు, సాలా రవికుమార్- పోతినమల్లయ్య పాలెం, సంజీవ రత్నం- అనంతపురం, ఎస్.కె.భాషా- సాలూరు (విజయనగరం), సగిలి రవికుమార్- చింతలపల్లి (కడప), కె.జి.వినోద్- హైదరాబాద్, ముసలే అంబాజీరావు- వడ్డెగేరి (కర్నూలు), ఆర్.పరుశురామ్- మంచిర్యాల (ఆదిలాబాద్), బోగ్గుల కుమార స్వామి-అనంతపురం, ఎ.రాజశేఖర్‌రెడ్డి- మంగళగిరి (గుంటూరు), కె.కిరణ్మయి- మదనపల్లె (చిత్తూరు), యం.భానుమతి- తిరుపతి. ■

ఏప్రిల్ 12 గుల్షన్ బావ్‌రా పుట్టినరోజు సందర్భంగా...

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

చిత్రం : ఖేల్ ఖేల్ మేఁ
రచన : గుల్షన్ బావ్‌రా
సంగీతం : ఆర్.డి. బర్మన్
అభినయం : రిషికపూర్, నీతూసింగ్, రాకేష్ రోషన్.





### గానం : శైలేంద్ర సింగ్, బృందం

హమ్‌నే తుమ్‌కో దేఖా, తుమ్‌నే హమ్‌కో దేఖా ఐసే
హమ్‌నే తుమ్‌కో దేఖా, తుమ్‌నే హమ్‌కో దేఖా ఐసే
హమ్‌నే తుమ్‌కో దేఖా, తుమ్‌నే హమ్‌కో దేఖా ఐసే
హమ్ తుమ్ సనమ్ సాతోఁజనమ్ మిల్‌తే రహేఁహై జైసే ॥హమ్‌నే॥
అంఖోఁ కా రహ్ రహ్ కే మిల్‌నా, మిల్‌కే ఝుక్ జానా
కర్ దేతీ హైఁ యహీ అదాయేఁ దిల్ కో దీవానా ॥అంఖోఁ కా॥
హువా యూఁ సామ్‌నా, పడా దిల్ థామ్‌నా
హువా యూఁ సామ్‌నా, పడా దిల్ థామ్‌నా ॥హమ్‌నే॥
బస్‌తే బస్‌తే బస్ జాయేగీ ఇస్ దిల్ కీ బస్తీ
తబ్ హీ జీవన్ మేఁ ఆయేగీ ప్యార్ భరీ మస్తీ ॥బస్‌తే బస్‌తే॥
హమారీ దాస్తాఁ కహేగా యే జహాఁ
హమారీ దాస్తాఁ కహేగా యే జహాఁ ॥హమ్‌నే॥

### గానం : కిశోర్ కుమార్, ఆశా భోంస్లే

అ : ఏక్ మైఁ ఔర్ ఏక్ తూ, దోనోఁ మిలే ఇస్ తరహ్
ఔర్ జో తన్ మన్ మేఁ హో రహా హై, యే తో హోనా హి థా ॥ఏక్ మైఁ ఔర్ ఏక్ తూ॥
అ : యూఁ నహీఁ మిల్‌తే హైఁ యార్ యార్ సే
దే ముఝే ప్యార్ కా జవాబ్ ప్యార్ సే
ధడ్‌కనేఁ హుయీ జవాఁ, వక్త్ భీ హై మెహర్బాఁ
ఫేర్ యే కైసీ దూరియాఁ, బోలో బోలో బోలో బోలో బోలో బోలో ॥ఏక్ మై॥
ఆ : దూరియాఁ వక్త్ ఆనే పే మిటాయేంగే
ఏక్ దిన్ ఇత్‌నే పాస్ పాస్ ఆయేంగే
ఇంతజార్ తబ్ తలక్, బేకరార్ తబ్ తలక్
యూఁ హి ప్యార్ తబ్ తలక్, బోలో బోలో బోలో బోలో బోలో బోలో ॥ఏక్ మైఁ॥
ఆ : దిల్లగీ బన్ గయీ హై దిల్ కీ లగీ
జిందగీ, ఇసీ కా నామ్ జిందగీ
ఖేల్ ఖేల్ మేఁ సనమ్, ఆ గయే జహాఁ పే హమ్
రోక్‌లే వహీఁ కదమ్, బోలో బోలో బోలో బోలో బోలో ॥ఏక్ మై॥





గుల్షన్ బావ్‌రా వ్రాసినది మొత్తం కలిపి 250 పాటలు కూడా ఉండవు. కొంతమంది రచయితలు పనిచేసిన సినిమాల సంఖ్య కంటే ఆయన వ్రాసిన పాటల సంఖ్య తక్కువ . అయినా రెండు ఫిలింఫేర్ అవార్డులు అందుకున్నారు. 'మేరే దేశ్ కీ ధర్తీ' (పుకార్), 'యారీ హై ఈమాన్ మేరా '(జంజీర్) పాటలకు ఆయనకు ఫిలింఫేర్ అవార్డులు లభించాయి.ఉన్న విషయాన్ని సూటిగా ఎటువంటి దోషాలు లేకుండా చెప్పడం ఆ ప్రత్యేకత.

గుల్షన్ బావ్‌రా ఆయన అసలు పేరు కాదు. ఆయన వ్రాసిన పాటలు చూసి మురిసిన ఒక నిర్మాత ఆయన రంగురంగుల దుస్తుల వేషధారణ చూసి విస్తుబోయి పేరుకు 'బావ్‌రా' (వింత చేష్టలు చేసే వారిని ఇలా పిలుస్తారు)జోడించారు. జీనియస్‌లు కొంచెం వింతగా ప్రవర్తించటం మామూలే కదా! ఆయన ఎంతటి పెర్‌ఫెక్షనిస్ట్ అంటే శైలేంద్ర వ్రాసిన 'ఆవారా హూఁ' పాటలోని ఒక భౌతిక శాస్త్ర సంబంధిత దోషాన్ని ఎత్తి చూపారు. 'మై గర్దిష్ మేఁ హూఁ ఆస్మాన్ కా తారాహూఁ' (నే కల్లోలంలో ఉన్నాను, ఆకాశంలో తారను) అనే లైన్‌ను సవరిస్తూ 'తారలెప్పుడూ కల్లోలంగా ఉండవు. ఆ లైన్ 'మై ఁ గర్దిష్ మేఁ భీ ఆస్మాన్ కా తారా హూఁ (నేను కల్లోలంలో కూడా ఆకాశంలో తారలా ఉంటాను) అని ఉండాలి." అని అన్నారాయన.

ఆయన 90 దశకంలో కూడా పాటలు వ్రాశారు. 'హకీకత్' (అజయ్ దేవగన్, తబు) లో 'లే పపియాఁ ఝుపియాఁ పాలే హమ్' పాట హిట్ అయింది. నేటి చిత్రాలలోఅధిక శాతం బాగుండకపోవడంతో చిత్రరంగానికి దూరమైన వారిలో ఆయన ఒకరు.

'ఖేల్ ఖేల్ మేఁ' చిత్రానికి రవి టండన్ (ఈయన రవీనా టండన్ తండ్రి) దర్శకత్వం వహించారు. యువతను ఆకట్టుకునే చక్కని సంగీతం అందించారు ఆర్.డి.బర్మన్. హుషారైన ప్రేమ పాటల్లో ఒకటిగా 'ఏక్ మైఁ ఔర్ ఏక్ తూ' నేటికి యువతరాన్ని ఆకర్షిస్తోంది.

'హమ్‌నే తుమ్‌కో దేఖా' పాట కాలేజ్ వార్షికోత్సవం రోజు నాయకుడు స్టేజిమీద పాడే పాట. పాడాల్సిన వాడికి గొంతు బావుండకపోవటంతో ఒక టేప్ పెట్టుకుని ఆ టేప్‌లోని పాటకు అనుగుణంగా పెదవులు కలపాలని ప్లాన్ వేసుకుని స్టేజి ఎక్కిన నాయకుడు, ఆ టేప్ పనిచేయకపోవటంతో తానే పాడతాడు. నిజానికి ఇదంతా అతని మరో ప్లాన్. తన మనసులోని మాట నాయికకు చెప్పేముందు ఆమెను ఇంప్రెస్ చేయటమే అతని ఉద్దేశం. పాటలో కూడా తమ కలయిక గురించి పాడతాడు. కాలేజ్ సన్నివేశాలలో చిలిపితనానికి, హుషారుకు తగినట్టు ఉంటుందీ పాట.

సనమ్ అంటే ప్రియమైనవారు. 'సాతోఁజనమ్' అంటే 'ఏడు జన్మలూ' అని మిల్‌నా అంటే కలవటం.

'నేను నిన్ను చూశాను,
నువ్వు నన్ను చూశావు
మనం ఏడేడు జన్మలుగా కలిసి ఉన్నట్టుగా'

తమ మొదటి చూపులోనే అతనికి తాము ఏడేడు జన్మలుగా కలుసుకుంటున్నట్టుగా అనిపించిందట. ఆ చూపులోనే జన్మజన్మల బంధం ఉట్టిపడింది.

'రహ్ రహ్‌కే' అంటే 'ఉండి ఉండి'. 'ఝుక్ జానా' అంటే వాలిపోవటం. అదాయేఁ అంటే సొగసులు. సామ్‌నా అంటే ఎదురుపడటం. థామ్‌నా అంటే చిక్కబట్టుకోవటం.

**'ఉండి ఉండి కలిసేను కనులు, మరల వాలిపోయేను**
**ఈ సొగసులే కదా, మదిని పిచ్చిది చేసేను**
**ఇలా ఎదురు పడ్డాక మనసు చిక్కబట్టుకున్నాను'**

ఉండి ఉండి కనులు కలవటం , కలిశాక సిగ్గుతో అమ్మాయి కనులు వాలిపోవటం. ఇలాంటి సంగతులు అబ్బాయిని పిచ్చివాణ్ణి చేస్తాయి. ఆమె అలా ఎదురుపడ్డాక అతను గుండెను చిక్కబట్టుకోవాల్సి వచ్చింది.

'దిల్ కీ బస్తీ' అంటే హృదయనగరు అనుకోవచ్చు. మస్తీ అంటే ఉల్లాసం. దాస్తాఁ అంటే కథ. జహాఁ అంటే లోకం.

**'ఒకరోజు ఈ హృదయనగరు కొలువుదీరేను**
**అపుడే వచ్చేను జీవితాన ప్రేమోల్లాసము**
**మన ప్రేమకథ చెప్పుకుంటుంది లోకమంతా'**

హృదయనగరులో ఒకరోజు ఒకరు నివసించటానికి వస్తారు. అప్పుడే కదా జీవితంలో ఉల్లాసం! వారి ప్రేమకథ లోకమంతా చెప్పుకునేలా ఆమెను ప్రేమిస్తాడట అతను.

'ఏక్ మైఁ ఔర్ ఏక్ తూ' ఆర్.డి. బర్మన్ టాలెంట్‌కు చక్కని ఉదాహరణ. పాట ఎత్తుగడ, చరణాలలోని ట్యూన్ ఆయన ఒరిజినాలిటీని మనకు మరల మరల గుర్తుచేస్తుంది.

**'ఒక నేను, ఒక నువ్వు, ఇద్దరం కలిశామిలాగ**
**తనువులో మనసులో అవుతున్నదేదో అవాల్సినదేగా'**

ప్రేమికులిద్దరూ కలిశాక తనువులో, మనసులో ఏదో అవుతుంది. కానీ అది జరగాల్సినదే అని అనిపిస్తుంది. ప్రేమ మహత్తు అలాంటిది.

యార్ అంటే నేస్తం, జవాబ్ అంటే జవాబు, బదులు. ధడ్‌కన్ అంటే గుండె సవ్వడి. వక్త్ అంటే సమయం . మెహెర్బాఁ అంటే దయ చూపేది. దూరియాఁ అంటే దూరాలు.

'ఇలా కాదు నేస్తం నేస్తంతో కలిసేది
ప్రేమకు బదులు ప్రేమనే ఇచ్చెయ్యి
గుండె సడి పెరిగింది, వేళ ఎంతో బాగుంది.





ఇక ఈ దూరాలెందుకు, చెప్పు చెప్పు చెప్పు చెప్పు చెప్పు చెప్పు'

నేస్తం నేస్తంతో దూరంగా ఉండి మాట్లాడకూడదని, దరికి రమ్మని అతను ఆమెను అడుగుతున్నాడు. ప్రేమకు బదులు ప్రేమను ఇవ్వమంటున్నాడు.

మిటానా అంటే చెరపటం. ఇంతజార్ అంటే నిరీక్షణ. బేకరార్ అంటే విరహం అనుకోవచ్చు.

**'ఈ దూరాలు సమయమొచ్చినపుడు చెరుపుదాం**
**ఒకరోజు మనం ఎంతో చేరువవుదాం**
**వేచి ఉండు అందాక, విరహమే అందాక**
**ఇంతే ప్రేమ అందాక, చెప్పు చెప్పు చెప్పు చెప్పు చెప్పు చెప్పు'**

'ఈ దూరాలు ఎందాకా' అని అతను అడిగితే సమయమొచ్చినపుడు దూరాలను చెరుపుదామని అంటోంది ఆమె. 'ఒకరోజు మనం దూరాలు చెరిపేసి దగ్గరయిపోతాం.



అందాక వేచి ఉండు' అంటోంది. 'అప్పటిదాక విరహం కూడా అనుభవించు' అని అనటంలో నిజాన్ని నిక్కచ్చిగా చెప్పారు. అప్పటి దాకా ఇలా దూరం నుంచే ప్రేమించుకోవాలి' అనటం ఒక కొసమెరుపు.

దిల్లగీ అంటే అల్లరి అనుకోవచ్చు. 'దిల్ కీ లగీ' అంటే మనసు బంధం. జిందగీ అంటే జీవితం. 'ఖేల్ ఖేల్ మేఁ' అంటే ఆడుతూ పాడుతూ, కదమ్ అంటే అడుగులు.

**ఆ: అల్లరి ఇపుడయ్యింది మనసుకు బంధమే**
**అ : జీవితం, దీని పేరేగ జీవితం**
**ఆ : ఆడుతూ పాడుతూ వచ్చామింత దూరము**
**ఇక ఇక్కడే అగుదాం, చెప్పు చెప్పు చెప్పు చెప్పు చెప్పు చెప్పు'**

అల్లరితో మొదలయిన వారి బంధం ఇప్పుడు అనుభంధమయింది 'జీవితమంటే ఇంతే కదా. అనుకోనివెన్నో జరుగుతాయి అంటున్నాడతను. ఆడుతూ పాడుతూ ఇంత దూరం వచ్చాం. ఇక ఇక్కడే ఆగుదాం. ఇంకా దూరం మంచిది కాదని ఆమె భావం.

హుషారైన పాటలకు రిషికపూర్, నీతూ సింగ్ అభినయం చక్కని ఊపునిచ్చింది.

**- పి.వి.సత్యనారాయణ రాజు**

## హిందీ సినీ సంగీతంలో మలుపులూ-మజిలీలూ

## 1962

రాజ్‌కోస్లా హిట్ చిత్రం 'ఏక్ ముసాఫిర్ ఏక్ హసీనా' కోసం ఓ.పి.నయ్యర్ అద్భుతమైన సంగీతం అందించారు. 'బహుత్ షుక్రియా', 'ఆప్ యూఁ హీ అగర్ హమ్‌సే మిలతే రహే', 'మైఁ ప్యార్ కా రాహీ' వంటి హిట్ గీతాలు ఈ చిత్రంలోనివే.

అలాగే 'హాంగ్‌కాంగ్' చిత్రంలోని 'హానోలూలూ..' కూడా పెద్ద హిట్ అయింది.

సలీల్ చౌధురి స్వరరచనలో వెలువడిన 'హాఫ్ టిక్కెట్' మ్యూజికల్‌గా మంచి పేరు తెచ్చుకుంది. 'చీల్ చీల్ చిల్లాకే', 'చాంద్ రాత్ తుమ్ హో సాత్' హిట్ కావడమే కాదు 'ఆకే సీధీ లగీ దిల్ పే' పాటను కిశోర్‌కుమార్ రెండు గొంతులతో పాడి సంచలనం సృష్టించారు. మగ గొంతుకతో నటుడు ప్రాణ్ కీ( చాలా ఏళ్ల తర్వాత కసూటీ, మజ్‌బూర్ సినిమాలలో మళ్లీ ప్రాణ్‌కి ప్లేబ్యాక్ పాడాడు కిశోర్) పాడితే, ఆడ గొంతుకతో తనకే (కిశోర్ ఆడవేషం వేశాడు) పాడుకున్నారు.

నౌషాద్‌కు 'సన్ ఆఫ్ ఇండియా' ఒక్కటే సినిమా వచ్చింది. ఆ సినిమాలో రెండు హిట్స్. 'నన్హా మున్నా రాహీ హూఁ'(శాంతి మాథుర్ రచన), లతా-రఫీల హాంటింగ్ డ్యూయెట్ 'దిల్ తోడనేవాలే తుజే దిల్ ఢూంఢ్ రహా హై' హిట్ అయ్యాయి.

కానీ హాంటింగ్ పాటల గురించి చెప్పుకోవాలంటే రవినే చెప్పుకోవాలి. 'ఆజ్ ఔర్ కల్' కోసం 'ముఝే గలే సే లగాలో', 'ఇత్నీ హసీఁ ఇత్నీ జవానీ రాత్', 'యే వాదియాఁ యే ఫిజాయేఁ' గీతాలతో పాటు 'టవర్ హౌస్' చిత్రం కోసం లతా పాడిన 'యే మేరే దిల్- ఏ-నాదాన్' పాటలు అన్నీ హాంటింగ్ మెలొడీలే!

ఈ నాటికీ హాంట్ చేసే లతా పాట కూడా ఈ ఏడాదే వచ్చింది. 'కహీఁ దీప్ జలే కహీఁ దిల్'! 'బీస్ సాల్ బాద్' చిత్రం కోసం హేమంత్ స్వరపరిచిన ఇదీ తక్కిన గీతాలు శ్రోతలను వెంటాడుతూనే ఉంటాయి.



'సాహిబ్ బీబీ ఔర్ గులామ్'లో
గురుదత్,మీనాకుమారి

'జరా నజరోఁ సే కెహ దో జీ', 'బేకరార్ కర్కే హమేఁ యూఁ న జాయియే' పాటలను హేమంత్ పాడగా తెరపై బిశ్వజిత్ అభినయించారు. ఇద్దరి కెరియర్లకీ ఇవి తోడ్పడ్డాయి.

హేమంత్‌కు ఇంకో హిట్ కూడా వచ్చింది. 'సాహిబ్ బీబీ ఔర్ గులామ్'. గురుదత్ సినిమాలలో అంతకుముందు పాటలు మాత్రమే పాడిన హేమంత్ కుమార్ ఈ చిత్రం ద్వారా సంగీతం కూడా అందించారు. బెంగాలీ నవల ఆధారంగా రూపొందిన బెంగాలీసినిమా రీమేక్ అయిన ఈ సినిమాకు జన్మత బెంగాలీ అయిన హేమంత్ కుమార్ తన సంగీతం ద్వారా మూడ్ మ్యూజిక్ క్రియేట్ చేయగలిగారు.

అన్ని పాటలూ హిట్స్ అనే చెప్పాలి. గీతాదత్‌కు 'నా జావో సయ్యా చుడాకే బైయ్యా' సూపర్ హిట్. దీనితో బాటు 'పియా ఐసే జియామే సమాయే గయే రే', 'కోయీ దూర్‌సే ఆవాజ్ దే చలే ఆవో' కూడా గీతావే ఆశా (వహీదాకు ప్లేబ్యాకు పాడింది) 'మేరీ బాత్ రహీ మేరే మన్ మే' 'భవరా బడా నాదాన్' 'సకియా ఆజ్ ముఝే నీంద్ నహీ ఆయేగీ'కు వచ్చాయి. దీంట్లో హేమంత్ పాడిన పాటను చివరినిమిషంలో తీసేయడం జరిగింది. ఆయన తర్వాత ఆ ట్యూన్‌ను 'అనుపమా' సినిమాలో 'యా దిల్‌కీ సునో' పాటకు వాడుకున్నాడు.

-(వచ్చే సంచికలో మరికొంత)




# ఆమె పేరే ఓ రాగం



# భాగేశ్రీ

'నీ కోసమె నే జీవించునది...' అనే పాటను వింటుంటే మనసంతా బరువెక్కిపోతుంది. విషాదాన్ని ఒలికించే భాగేశ్రీరాగంలో ఆ పదాలను ఇమడ్చటమే దానికి కారణం. తెలుగు సంగీత దర్శకులు చాలామంది విషాద గీతాలకు భాగేశ్రీ బాణీనే ఎంచుకునేవారు. అయితే -అదే రాగాన్ని పేరుగా పెట్టుకున్న భాగేశ్రీ వాజె మాత్రం తనదైన సంగీతంలో యువతకు వినోదాన్ని అందిస్తుండడం విశేషమనే చెప్పాలి.

భారతదేశంలో పుట్టి- కెనడాలో పెరిగిన భాగేశ్రీ ఇటీవలే తనపేరుతోనే ఓ పాప్ఆల్బమ్‌ను విడుదల చేసింది. భారత శాస్త్రీయ సంగీతం, పాశ్చాత్య సంగీతాల మేళవింపుగా సాగిన ఈ ఆల్బమ్ ఇప్పుడు విమర్శకుల ప్రశంసల్ని పొందుతోంది.

భాగేశ్రీ తన బాల్యం గురించి చెబుతూ "నాకు రెండు సంవత్సరాల వయసప్పుడే అమ్మానాన్న కెనడాకి తీసుకెళ్ళిపోయారు. వాళ్ళిద్దరూ డాక్టర్లు. అయితే నాన్నగారు డా॥దామోదర వాజెకి హిందుస్తానీ సంగీతంలో ప్రావీణ్యం వుంది. మా నాన్నగారి తల్లితండ్రులకీ సంగీతంలో పరిచయం వుంది. అందువల్ల సంగీతంలో నాకు తొలిగురువుగా నాన్ననే చెప్పుకోవాలి. ఆయన దగ్గరే హిందుస్తానీ సంగీతంలో ఓనమాలు నేర్చుకున్నాను" అని చెప్పింది.

దేశం కాని దేశం వెళ్లినా - అక్కడ కూడా తనని భారతీయ సంగీతం వెన్నంటే వున్నదని చెబుతూ...." నృత్యం ....సంగీతం ఈ రెండూ నాకిష్టమైన అంశాలు. స్కూల్ లో చదువుకునే రోజుల్లో ఈ రెండు అభ్యసిస్తుండే దానిని. 16 సంవత్సరాల వయసులో తొలిసారి డాన్సర్‌గా అరంగేట్రమ్ చేశాను. 2000వ సంవత్సరంలో శాస్త్రీయ సంగీతాన్ని భారతదేశంలో పేర్గాంచిన శ్రీమతి వీణా సహస్రబుద్ధే దగ్గర అభ్యసించడం మొదలుపెట్టాను. అకడమిక్ స్టడీస్ విషయంలో అక్కడ విద్యార్థులపై పెద్ద ఒత్తిడి వుండదు. అందువల్ల ఇతర అంశాలను అభ్యసించడం పెద్ద కష్టంకాదు. అందువల్ల నేను నృత్యం, సంగీతం విడవకుండా నేర్చుకోగలిగాను. డాన్స్ నేర్చుకోవడం కోసం అవకాశమున్నప్పుడల్లా ఇండియాకి వచ్చేదాన్ని...ఇక్కడే టి.కె.మహాలింగంపిళ్ళై,వెంపటి చిన సత్యం, పండిట్ బ్రిజ్‌మహరాజ్‌ల దగ్గర నృత్యాన్ని అభ్యసించాను" అని చెప్పింది భాగేశ్రీ.



## చిరుప్రాయం నుండే శిక్షణ

- 2000 - నుండి భారత్ లోని శ్రీమతి వీణా సహస్రబుద్ధ్ దగ్గర హిందుస్తానీ వోకల్ లో శిక్షణ.
- 1998 -2001 వరకూ పండిట్ బ్రిజ్‌మహరాజ్, జైకిషన్ మహరాజ్‌ల దగ్గర కథక్‌లో శిక్షణ. జయరామారావు వద్ద కూచిపూడి నృత్యంలో శిక్షణ.
- 1995-99 వరకూ వెస్ట్ ఆఫ్రికా, ఫరెటా,న్యూయార్క్‌లలో జాజ్ సంగీతంలో శిక్షణ.
- 1995 -99 వరకూ వెంపటి చిన సత్యం దగ్గర కూచిపూడి నృత్యంలో శిక్షణ.
- 1990 -98 వరకూ టి.కె.మహాలింగం పిళ్లై దగ్గర భరతనాట్యంలో శిక్షణ.
- 1984 -90 వరకూ శ్రీమతి సుధా చంద్రశేఖర్ దగ్గర భరత నాట్యంలో శిక్షణ.
- 1980 -82 వరకూ మేనకా థక్కర్ దగ్గర భరతనాట్యంలో శిక్షణ.
- 1986 నుండి....తండ్రి దామోదర్ వాజే దగ్గర హిందుస్తానీ వోకల్‌లో శిక్షణ.

చిరుప్రాయం నుండే నృత్య, సంగీతాలలో శిక్షణ పొందిన భాగేశ్రీ దేశవిదేశాలలో అనేక ప్రదర్శనలు ఇవ్వడమే కాకుండా పురస్కారాలను పొందింది.

తొలి ఆల్బమ్ గురించి చెబుతూ "భాగేశ్రీ' అనే నా పేరుతోనే ఈ ఆల్బమ్‌ను విడుదల చేశాను. ఇందులో మొత్తం పది పాటలుంటాయి. వీటన్నింటిని టొరంటోలో రికార్డ్ చేశాం. అలానే 'దీవానా' అనే పాటను పిక్చరైజ్ చేశాం. ప్రస్తుతం భారత్‌లోని వివిధ ఛానల్స్‌లో ఈ వీడియో ప్రసారం అవుతుంది. 'బోయ్ మీట్స్ గర్ల్' అనే రొటీన్ కాన్సెప్ట్‌గా కాకుండా కాస్త భిన్నంగా వుండాలని యానిమేట్ చేయించాం. ఈమధ్యకాలంలో ఎంటీవీలో 'ఉభర్తా సితార ఆఫ్ ద మంత్' అనే కార్యక్రమం నా మీద చేశారు. దాంతో చాలామంది దృష్టిలో నేను పడ్డాను. ఆ వెంటనే నా ఆల్బమ్ తాలుకు వీడియో కూడా ప్రసారం కావడంతో ఎంతో గుర్తింపు వచ్చింది. ఈ రకమైన పబ్లిసిటీ ఆడియో సేల్స్‌ని పెంచుతుంది. అయితే మన సంగీతలోనూ కాస్త 'స్టఫ్' వుండాలి. అప్పుడే శ్రోతల్ని ఆకట్టుకోగలం. నా పాటలు ఆ స్థాయిలో వున్నాయనే నమ్మకం నాకు వుంది" అని చెబుతోంది భాగేశ్రీ.



ఈ ఆల్బమ్‌కి సంబంధించి రెండో వీడియో తీసే యోచనలో వున్న భాగేశ్రీ- రెండో ఆల్బమ్ పనికూడా ప్రారంభించిందట. "మేం కెనడాలో వున్నా చాలామంది స్నేహితులు, బంధువులు మాకు పూణెలో వున్నారు. ఇక్కడున్న నా మేనల్లుళ్ళు, మేనకోడళ్ళకి నా సంగీతమంటే ఎంతో ఇష్టం. అలానే మా నానమ్మ మొదటి ఆల్బమ్‌లో మరాఠీ పాట ఒక్కటీ లేదేమిటి ? అని ప్రశ్నించింది. అందుకే ఆమె కోసం రెండో ఆల్బమ్‌లో ఓమరాఠీ పాటపెట్టబోతున్నాను "అని అంది.

స్కూల్, కాలేజీ రోజులలో సరదాగా పాటలు పాడినా, డాన్స్ చేసినా - ఇప్పుడు మాత్రం తను దానిని వృత్తిగా స్వీకరించానని - ఈ రంగంలో మంచి పేరు ప్రఖ్యాతులు తెచ్చుకోవాలన్నది తన కోరికని భాగేశ్రీ చెబుతోంది.

"నా దృష్టిలో సంగీతానికి మరుపు అనేది లేదు. ఎంత కాలం గడిచినా మంచి సంగీతాన్ని ఎవ్వరూ మరిచిపోలేరు. 'మడోన్నా'ను అంత తేలిగ్గా ఎవరైనా మర్చిపోగలరా? నాకివ్వాల్టి పాప్‌సింగర్స్ కంటే కూడా 8వ దశకంలోని గాయనీ గాయకులంటే ఎంతో ఇష్టం. ఇప్పటికీ వాళ్ళ పాటల్ని వింటుంటాను. భారతదేశానికి వచ్చే సరికి లతామంగేష్కర్, ఆశాభోంస్లే అంటే ఎంతో అభిమానం. అలానే గాయకుల విషయానికివస్తే హరిహరన్ అంటే ఎంతో ఇష్టం" అని చెప్పింది.

"సంగీతం అనేది అంతరాత్మను ఆవిష్కరించడం' అని నా వ్యక్తిగత భావన. మరింత మంచి సంగీతాన్ని అందించి మరింత చక్కటి వీడియోలు చేయాలి, అలానే పెద్ద పెద్ద స్టేజ్ ఫెర్ఫార్మెన్స్‌లు ఇవ్వాలి.... ఇదే నాకున్న కోరిక" అని చెబుతోంది 25సంవత్సరాల భాగేశ్రీ.

గాయనిగా వచ్చిన గుర్తింపుతో ప్రస్తుతం బాలీవుడ్ నుండి కూడా నేపథ్యగాయనిగా అవకాశాలు వస్తున్నాయని కానీ ఇప్పటి స్థితిలో తనని ఆ అవకాశాలు ఆకట్టుకోవటం లేదని భాగేశ్రీ అంటోంది. జర్నలిజంలోనూ డిగ్రీ తీసుకున్న భాగేశ్రీకి రచనావ్యాసాంగంలోనూ అనుభవం వుంది. కెనడాలోని పత్రికలలో ఆమె వ్యాసాలు ప్రచురితమౌతుంటాయి.

ప్రవాస భారతీయులందరు-ఇప్పుడు స్వదేశానికి తిరిగివచ్చి-తమ సంగీత పరిజ్ఞానాన్ని చాటుకుంటూన్నారెందుకు?అని భాగేశ్రీని ప్రశ్నిస్తే "నిజమే... విదేశాలలో భారతీయ కళాకారులకి లభించే అవకాశం చాలా తక్కువ. కెనడాలో కంటే మా ప్రతిభను భారత్‌లో ప్రదర్శిస్తే చాలా గుర్తింపు వస్తుందనే ఆశతో ఇటువచ్చాం. మా అంచనాలు తప్పుకాలేదు. దానికి నా ఆల్బమ్‌కి వస్తున్న స్పందనే ఓ ఉదాహరణ" అని చెప్పింది భాగేశ్రీ. త్వరలోనే ఆమె పాప్‌సింగర్‌గా అగ్రస్థానాన్ని అధిరోహించగలరని ఆశిద్దాం.

**- వి.అరుణ సత్యవతి**

# సం"గీతా" రహస్యాలు



**ఇ**ళయరాజా తొలి చిత్రం 'అన్నక్కిళి' అన్న తమిళచిత్రం. ఆ చిత్రంలోని పాటలన్నీ చాలా పాప్యులర్ అయినాయి. దాంతోనే సినిమా కూడా హిట్టయింది. ఆ హిట్ సినిమాని 'రామచిలుక' పేరుతో సుందర్‌లాల్ కంపెనీ తెలుగులో ఆరంభిస్తూ ఇళయరాజానే సంగీత దర్శకుడిగా పిలిచారు. మొదటి సిటింగ్ లోనే ఇళయరాజా ఆ సినిమా చెయ్యనన్నారు. ఏం? తమిళంలో పాటలన్నీ పాప్యులర్ గనక, అవేట్యూన్స్ కావాలన్నారు నిర్మాతలు. "అవే ట్యూన్లు మళ్లీ చెయ్యడానికి నేనెందుకు? కొత్తగా చెయ్యమంటే చెప్పండి, చేస్తాను" అన్నారు ఇళయరాజా. కాదన్నారు పెద్దలు, ఇళయరాజాకూడా కాదన్నారు. వెళ్లి పోయారు. అప్పుడు సత్యం సంగీతం చేశారు - అన్నీ ఒరిజినల్ వరసలతోనే.

* * *

**ఒ**క పెద్దహీరో (ఆ తరంకాదు) గారి సినిమాకి ఇళయరాజా సంగీత దర్శకుడు. ఒక డ్యూయెట్ రికార్డు చేస్తే,అది హీరోకి నచ్చలేదు. "ఇంకొంచెం ఫాస్ట్ బీట్‌లో ఉషారుగా వుండాలి. వేరే ట్యూన్ చెయ్యమనండి" అని హీరో అంటే, ఇళయరాజా ఒప్పుకోలేదు. "ఐతే,వేరేట్యూన్ చేస్తాను ఆయన ఇష్టప్రకారం. సినిమా అయిన తర్వాత నేను రీరికార్డింగ్ చెయ్యాలికదా, అప్పుడు హీరోగారి యాక్టింగ్ నాకు ఎక్కడైనా నచ్చకపోతే, ఆయన మళ్లీ నటిస్తారా? అడగండి. దీనికి ఒప్పుకుంటే నేను, ఇంకోట్యూన్ చెయ్యడానికి రెడీ" అన్నారు ఇళయరాజా. ఎలాగో రాజీ అయింది. ఆ పాటే వుంది సినిమాలో - పాప్యులర్ అయింది కూడా.

**-ఆర్కే**

# రాజా ఆడియో రివ్యూ

సంగీత దర్శకుడు ఆర్.పి. పట్నాయక్ నటుడిగా తెరమీద తనని తాను ఆవిష్కరించుకుంటున్న చిత్రమిది. కొన్నాళ్ల క్రితం.... బహుశా నాలుగైదేళ్ల క్రితం కావచ్చు... మలయాళంలో 'వాసందియుమ్ లక్ష్మియుమ్ పిన్నె న్యానుమ్' అనే చిత్రం ఒకటొచ్చింది. కళాభవన్ మణి అందులో హీరో. ఆద్యంతం గుడ్డివాడిగా అత్యద్భుతంగా నటించాడాయన. ఆ సంవత్సరం ఉత్తమనటుడి అవార్డు తనకి రాకుండా మోహన్‌లాల్‌కి వచ్చిందన్న వార్త వినగానే కళాభవన్ మణి స్పృహ తప్పి పడిపోయాడట. అంతగా ప్రాణం పెట్టి నటించాడన్నమాట. ఆ తర్వాత అదే కథకి - నిడివిని, పాటలని పెంచుతూ - విక్రమ్ హీరోగా 'కాశి' అనే పేరుతో తమిళంలో తీశారు. తమిళంలో కూడా విజయవంతమైంది. కళాభవన్ మణి అంత గొప్పగా విక్రమ్ చెయ్యకపోయినా ఒక కమర్షియల్ హీరో ఆర్ట్ ఫిల్మ్స్‌లో చేసినంత సహజంగా నటించడంతో విక్రమ్‌కి చాలా మంచి పేరొచ్చింది. ప్రస్తుతం తెలుగులో తీసిన 'శీను. వాసంతి.. లక్ష్మి...' చిత్రానికి ఇది ఒక నేపథ్యం....

రెండో నేపథ్యం ఏమిటంటే సంగీత దర్శకుడు ఆర్.పి.పట్నాయక్- గాయకుడు కూడా అని తెలుగు ప్రేక్షకులకు తెలుసుగానీ అతనిలో మంచి నటుడు కూడా ఉన్నాడని చాలామందికి తెలీదు. కాలేజీ రోజుల్లో అతనితో చదువుకున్న కొంతమంది, ప్రస్తుతం హాస్యనటుడిగా మంచి పొజిషన్లో ఉన్న సునీల్ తప్ప అతనిలోని నటుడ్ని చూసిన వారు ఎవరూ లేరనే చెప్పాలి. ఇంటర్ కాలేజీ పోటీల్లో ఓసారి పట్నాయక్ గుడ్డివాడుగా నటిస్తే అక్కడున్న వాళ్లందరూ నిజంగా ఓ గుడ్డివాడు తమ మధ్యకి వచ్చేశాడని నమ్మేశారు. ఆ పోటీల్లో పాల్గొనడానికి వచ్చిన సునీల్ - మర్నాడు అందరు స్టూడెంట్స్‌తో పాటు యథాలాపంగా కాలకృత్యాలు తీర్చుకుంటున్న పట్నాయక్‌ని చూసి 'అయ్‌బాబోయ్... నిన్న గుడ్డోడుగా నటించింది మీరే కదండీ' అంటూ తెగ ఆశ్చర్యపోయి, అడిగిన వాళ్లకీ, అడగని వాళ్లకీ అందరికీ మరీమరీ చెప్పి బోలెడంత పబ్లిసిటీ ఇచ్చేశాడు. అప్పుడే కాదు ఈ 'శీను. వాసంతి.. లక్ష్మి...' సినిమా రూపుదిద్దుకొనేటంత వరకూ కూడా ఇండస్ట్రీలో ప్రతివారికీ పట్నాయక్ ప్రసక్తి వచ్చినప్పుడల్లా 'మీరెప్పుడైనా ఆర్పీగారు గుడ్డోడుగా కళ్లు పెట్టడం చూశారండీ... అయ్‌బాబోయ్... అదరగొట్టేత్తారండీ బాబూ' అంటూ 'నాలిక భుజానేసుకుని' తిరిగేవాడు.

ఇదిలా ఉండగా ప్రముఖ నిర్మాత అట్లూరి పూర్ణచంద్రరావుగారు మలయాళ సినిమా చూసి హక్కులుకొని తెలుగులో తియ్యాలని సంకల్పించారు. అప్పుడు ఆర్పీ సంగీత దర్శకునిగా చాలా బిజీగా వుండటం చేత ఆ ప్రాజెక్ట్ అలా వాయిదా పడుతూ వచ్చింది. పూర్ణచంద్రరావుగారి పట్టుదల, గుడ్డివాడిగా నటించడంలో తనకున్న అనుభవం, ఇంతమంచి పాత్ర ఒదులుకుంటే జీవితంలో ఇలాంటి అవకాశం మళ్లీ రాదన్న ఆలోచన - వీటన్నిటితో ఆర్పీ తన చేతిలో ఉన్న కమిట్‌మెంట్స్‌ని పూర్తిచేసుకుని - నటిద్దామనుకున్న టైమ్‌కి పూర్ణచంద్రరావుగారు అటు హిందీ, ఇటు తెలుగు చిత్ర నిర్మాణంతో బిజీ అయిపోయారు. కన్నడంలో 'ఎక్స్‌క్యూజ్‌మి' అనే చిత్రాన్ని ఆర్.పి.పట్నాయక్ సంగీత దర్శకత్వంలో నిర్మించిన నిర్మాత ఎన్.ఎమ్.సురేష్ - ఆర్పీ వీరాభిమాని. తన ఇంట్లో ఆర్పీ నిలువెత్తు ఫొటోని పెట్టుకున్న అభిమానం ఆయనిది. ఆయన నిర్మాత అయితే బావుంటుందన్న ఆలోచనతో పూర్ణచంద్రరావు గారిని అప్రోచ్ అయితే- కళాభవన్ మణి నటించిన ఆ గుడ్డివాని పాత్రకు ఆర్పీ అయితేనే బావుంటుందన్న నమ్మకంతో ఆ హక్కుల్ని సహృదయంతో ఇచ్చేశారాయన. ఇది మూడవ నేపథ్యం.

'శీను. వాసంతి.. లక్ష్మి...' చిత్రంలోని పాటలు సంగీత, సాహిత్యపరంగా ఎలా ఉన్నాయో తెలుసుకునే ముందు ఆ చిత్రం వెనుక గల ఈ మూడు నేపథ్యాల ప్రాధాన్యతను తెలుసుకోవడం ముఖ్యం. ఎందుకంటే



విడుదల: సూర్యామ్యూజిక్ వెల: రూ॥35/-

ముందుగా విజయం సాధించిన వాటి ముద్ర తరువాత వచ్చే వాటిమీద ఉండటం సహజం కనుక..! ఈ చిత్రంలోని సంగీత విభాగం వరకూ ఒక అదృష్టం ఏమిటంటే అటు మలయాళ చిత్రంలోని పాటలను గాని, ఇటు తమిళ చిత్రంలోని పాటలను గాని ఆర్పీ పట్నాయక్ ఒక సంగీత దర్శకునిగా, గాయకునిగా ఎక్కడా అనుకరించలేదు, అనుసరించలేదు కనుక!

**(ఈ చిత్రం మాతృక అయిన మలయాళ చిత్రం వీసీడీని, ఆ చిత్రం ఆధారంగా వచ్చిన తమిళ చిత్రం వీసీడీని అత్యంత వ్యయ ప్రయాసలకోర్చి హైదరాబాద్‌లోనే పట్టుకుని స్వయంగా చూసిన తర్వాతనే ఈ వాక్యాలను రాయటం జరిగిందని ఈ సమీక్షకుని మనవి)**

'కుకుకూ కుకుకూ కుకుకుకూ తొలిరాగం నేర్పింది ఈ పలుకూ' అనే మకుటంతో సాగే తొలి గీతాన్ని కులశేఖర్ రాయగా ఆర్పీ, బృందం ఆలపించారు. సంగీతపరంగా చూసుకుంటే ఇళయరాజా ముద్ర ఈ పాటలో బాగా కనిపిస్తూ వుంటుంది. పల్లవి చివర్న వచ్చే 'నాలో... ఏదో.. మైమరపు' దగ్గర స్వరరచనా విధానంలోనూ, చరణాల ముందు వచ్చే ఇంటర్‌లూడ్స్‌లో వాద్యాలను ఉపయోగించే పద్ధతిలోనూ ఆ మార్కును గమనించవచ్చు. దీన్ని అనుకరణ, అనుసరణలను మించిన 'అనుసృజనం'గా మనం భావించవచ్చు.

రెండవపాట 'పాడనా శిలను కరిగించు గీతం'లో తన ప్రతిభా పాండిత్యాలను సమపాళ్ళలో రంగరించి మంచి సాహిత్యాన్ని అందించిన కులశేఖర్‌దే ఫస్ట్ క్రెడిట్. ఆయనకి ఏదైనా అవార్డు రాదగ్గ పాటిది. ఈ పాటలో ఆయన కలం చేసిన విన్యాసాలను, ప్రయోగించిన శబ్ద భావ పద సౌందర్యాలను వర్ణించాలంటే ఆయన్ని ప్రత్యేకంగా ఓ ఇంటర్వ్యూ చేయాల్సిందే తప్ప ఎవరికి వారు ఊహించుకుని విశ్లేషించే స్థాయిది మాత్రం కాదు. గాయకుడిగా నిహాల్‌కున్న సంగీత పరిజ్ఞానాన్ని ఈ పాటలో బాగా వాడుకున్నారు. హిందోళ రాగంలో స్వరపరచబడిన ఈ పాట మధ్యలో అక్కడక్కడ చంద్రకోన్ రాగచ్ఛాయలు కూడా తొంగిచూస్తూ ఉంటాయి. కథావరంగా నిహాల్‌ని ఆర్పీ (తెరమీద బ్రహ్మానందంని ఆర్పీ) ఓడించాలి కాబట్టి రెండవ చరణంలో నిహాల్ 20-23 సెకండ్ల పాటు, ఆర్పీ 35 సెకండ్ల పాటు బ్రీత్‌లెస్‌గా ఆలపించి పాటకి చక్కటి న్యాయం చేశారు.

'కోదండరాముణ్ణి చూడు కోరింది ఇచ్చేటివాడు' పాటను కులశేఖర్ రాయగా ఆర్పీ ఆలపించారు. సులభంగా నోటికి పట్టుబడే సంగీతం, సాహిత్యం కావటం చేత రానున్న రోజుల్లో రామాలయాలలో ఎక్కువగా వినిపించబోయే పాటల లిస్ట్‌లోకి ఈ పాట కూడా ఓ సముచిత స్థానాన్ని సంపాదించుకుంటుంది.

కులశేఖర్ రాయగా మాలతితో నటులు సునీల్, ఆలీ అక్కడక్కడ గొంతులు కలిపిన 'అమెరిక అన్నాడు అరెకరంవమ్మేడు' పాట కేవలం మాస్‌ని దృష్టిలో పెట్టుకుని తయారు చేసిన పాట కనుక సంగీతం, సాహిత్యం, గానం అన్నీ ఆ పాళ్ళలోనే 'తూగేయి'.

కులశేఖర్ రాయగా ఆర్పీ పాడిన 'వానా వానా వానా నీలాకాశంలోనా నీతో చిందేసి ఆడనా' పాట సంగీత సాహిత్యపరంగా మెచ్చుకోదగ్గ పాట. ఓ విధంగా చెప్పాలంటే ఆర్పీ వాయిస్‌కి సరిగ్గా సరిపోయే గీతమిది. ట్యూన్ కూడా ఉత్తరాది సంగీత దర్శకుల స్వరరచనా స్థాయిలో వుంది. 'నింగిలోన మబ్బుకూన అందుకుంది చినుకురాగం దాహం కోరే నేల కోసం/నేలపైన నీటి వీణ పల్లవించే మబ్బుకోసం స్నేహం పంచే పూలగీతం' అనే వాక్యాలు రచయితగా కులశేఖర్ గురించి ఎవరు చెప్పాల్సి వచ్చినా విధిగా ప్రస్తావించవలసినవి.

'గోదారి నవ్వింది తుమ్మెదా' పాటని కులశేఖర్ రాయగా ఆర్పీ, ఉష, బృందం ఆలపించారు. 'కోదండరాముణ్ణి చూడు' పాట లాగే ఈ పాట క్కూడా సులభంగా పట్టుబడి ఆకట్టుకునే సంగీత సాహిత్యాలు జతపడ్డాయి.

రచన: సాహితి (1) గానం : శ్రీరామ్-మాలతి

అ: హే...సిలకేమో సీకాకులం....అరె..కులుకేమో మల్కీపురం॥2॥
సొగసేమో ఇశాపట్నం జగదాంబ జెన్సర్రో
అరె...పెదవేమో పిఠాపురం...రుచి చూస్తే మిఠాయ్‌పురం
నుడుమేమో గరం గరం భీమలి బీచేరో
ఇది టెక్కలి టెక్కుల్దిరో మహ బొబ్బిలి నిక్కుల్దిరో
కుర్రకారుని సర్రని కిర్రెక్కించే కిర్లంపూడి సరుకేరో...
మాస్‌తో పెట్టుకుంటే మడతడి పోద్ది
ఒంట్లో ఒక్కోనరం మెలికడి పోద్ది...హేహేయ్... ॥సిలకేమో॥
అ: అరె..హే..హే..హే..వన్నె చూస్తే పాలగడి....ఒళ్ళు చూస్తె పూలంగడి
బుగ్గ చూస్తె భోగాపురం బూరెల కావడి..దీని
జెబ్బ చూస్తె పర్లాకిమిడి కొబ్బరి చలిమిడి
ఆ :అరె...హే...హే..పూసపాటి పుంజుకోడి రోసమొస్తె అబ్బాడీ
ముందు ఎనక నోట్లో వున్న ముప్పై పళ్ళూడి..అబ్బో
అపోజిసనైపోతాది అప్పడె పిండి పిండి
అ: ఓసి నా రాజమండ్రీ పలకదోర జాంపళ్ళీ బండీ
పూల బండెక్కి వచ్చి పాలబండి..
చుక్కల్లో పక్కేసి లాగిస్తా నా బండి
ఆ: మాస్‌తో పెట్టుకుంటే మడతడి పోద్ది
ఒంట్లో ఒక్కో నరం మెలికడి పోద్ది ...ఏయ్.. అ:॥సిలకేమో॥
అ: అరె..హే...హే...ఉన్నోళ్ళూ లేనోళ్ళని మనిషిలోన తేడాలు
ఉన్నదాక వేటే మానవు టక్కరి తోడేళ్ళు...దాని
ఆటలింక కట్టించకుంటే బతకరు పేదోళ్ళు
అరె..హో..యాయ్...యాయ్..ముందు మరి
ఈ సంగతి తెలుసుకొని పెద్దోళ్ళు
లోటు ఇంక సరిచేయకుంటే నా బోటి కుర్రాళ్ళు...ఇట్టా
వీధికెక్కి పెట్టక తప్పదు వీపుల దంపుళ్ళు...
ఆ :నువ్వు సేనానివయ్యో....సిమ్మాచెలం సింహానివయ్యో
నీకు ఎదురేదిరయ్యో ....
ఎదుటి వాడి మేలుని కోరే మనిషివి నువ్వేరో
అ: మాస్‌తో పెట్టుకుంటే మడతడి పోద్ది
ఒంట్లో ఒక్కోనరం మెలికడి పోద్ది...హేయ్ హే...
ఆ: మాస్‌తో పెట్టుకుంటే మడతడి పోద్ది
ఒంట్లో ఒక్కోనరం మెలికడి పోద్ది...హేయ్ హే... ॥సిలకేమో॥

రచన: సాహితి (2) గానం : మల్లికార్జున, ఆలాప్: కల్పన

అందాల చుక్కల లేడి
నా తీపి చక్కెర కేళి
ఇన్నాళ్లకు దర్శనమిచ్చిందా...
జగదాంబ చౌదరిగారి పంచాంగం లెక్కలు కుదిరి
లక్కీగా రైల్లో కలిసిందా...
శని దోషం పోగొట్టే తన సుందర దరహాసం
కురిపిస్తే చేయిస్తా గుళ్ళో అభిషేకం
తన మౌనం అయిపోతే త్వరలో అంగీకారం
తిరుపతిలో పెట్టిస్తా మా పెళ్ళికి లగ్గం
ఐ లవ్ యూ ఓ శ్రావణీ నా కోసం నువ్ పుట్టావని
ఐ లవ్ యూ ఓ శ్రావణీ నా తోనే నువు వుంటావని ॥అందాల॥
ఏయ్... ముత్యంలాంటి నీ నవ్వు
మొత్తం అంతా నాకివ్వు
బంగారంతో చేయిస్తా జడ పువ్వూ
నిగ నిగ మెరిసే నీ తనువు
సొగసరి కానుక నా కివ్వు
పువ్వులతోనే పూజిస్తా అణువణువూ
అరె సీతాకాలం మంచుల్లో ఒళ్ళంటుందే జివ్వూ
ఎండాకాలం ముంజల్లే ఓ తియ్యని ముద్దివ్వూ
అరె వానాకాలం వరదల్లే ముంచేస్తుందే లవ్వూ
కాలాలన్నీ కరిగేలా నీ కౌగిలి వరమివ్వూ ॥ఐ లవ్‌యూ॥॥అందాల॥
స్వర్గంలోనే పెళ్ళిళ్ళు అవుతాయంటూ పెద్దోళ్ళూ
చెప్పిన మాటే వినివుంటే నీ చెవ్వూ
ముగ్గులు పెట్టి వాకిళ్ళు ముంగిట వేసి పందిళ్ళూ
అందరికింక శుభలేఖలనే పంచివ్వూ
రేపంటూ మరి మాపంటూ ఇక పెట్టొద్దే గడువూ
నూరేళ్ళూ నిను పరిపాలించే పదవే రాసివ్వూ
మొత్తం నీపై పెట్టేశానే నా ఆశల బరువూ
గట్టే నన్ను ఎక్కిస్తానని హామీ అందివ్వూ॥ఐ లవ్‌యూ॥ ॥అందాల॥

రచన: సాహితి (3) గానం : మాణిక్ వినాయకమ్ -శ్రీలేఖ

సాకి: హెయ్ మారే మారే మారే మారే మారే మారే
మారే మారే మారే మారే మారే
అ: ఏయ్ మార్ మార్ మార్ మార్
మార్ పిల్లా మార్ జోర్ జోర్ జోర్ జోర్ జంబయి రే జోర్
కో: జోర్ జోర్ జోర్ జోర్ జంబయి రే జోర్
ఆ : యార్ యార్ యార్ యార్ ఖానా తయ్యార్
మోర్ మోర్ మోర్ వెజ్ కావాలా మోర్
కో: మోర్ మోర్ మోర్ వెజ్ కావాలా మోర్
అ : ఆకొక్కలిస్తవా... కోరస్ : హొవ్వాయే...
అ : అత్తర్లే పూస్తవా... కోరస్ : హొవ్వాయే....
ఆ : సందేళకొస్తవా.. కోరస్ : హొవ్వాయే..
ఆ : సరదాలే చేస్తవా.. కోరస్ : హొవ్వాయే..
అ : యమహో నా జాంగ్రీ మస్తుందిరే...
మార్ మార్ మార్ గోల్ మాలేరే
గుడివాడ సందులో గుంటూరు గొందులో..
తొక్కుడు బిళ్ళాడదాం రావే పోరీ
ఆ: ఒంగోలు గిత్తలా పల్నాటి పుంజులా
పైపైన పడకురో హోరా హోరీ అ: ॥హే మార్ మార్॥
అ: అటో గంటా ఇటో గంటా కన్నుకొట్టు కొంటూ నిన్ను చూసుకుంటా
ఆ: ఇలా వెంటా భలేగుంటా
చలే పుట్టు కొంటూ పట్టు కొంటే జంటా
అ: హే... అబ్బో నీ అబ్బోరే నీ అందం
సబ్బోరే అత్తర్లా నాక్కొంచెం రుద్దేసెయ్‌వే
ఆ: అయ్యారే హంగోరే సయ్యాన సంగోరే
వయ్యారి జాతర్లే జరిపించారే
అ: ఏయ్... మాటల్లో మరదలా పొద్దేజారే
మార్ మార్ మార్ ముద్దుమారే...
రోజూ వస్తుంటావు నోరే ఊరిస్తవూ
తీరా నే పూలు తెస్తే తిరిగి చూడవు...
ఆ: ఏయ్... తలపడితే కదలవు నా కొంగే వొదలవు
పడుచు పళ్ళ పరుశురామ చిలకే నువ్వు
ఆ: ఏయ్ బిలాలిస్తడే మడత పెడతడే మసాలేస్తడే
అ: అలా వస్తది ఇలా చూస్తది టలాయిస్తది
ఆ: అబ్బ సుబ్బర సోగ్గాడే అంబలగిరి గిజిగాడే
అ: సిగ్గులోరి మొగ్గలాగ ముడుచుకొంటదే
ఆ: ఇదేనంటా నీతో తంటా ఇలా పట్టపగలే చుట్టుకోకు చుట్ట
అ: ఒసేయ్ పిట్టా పూలబుట్టా నిన్ను పట్టకుండ యిడిసేది ఎట్టా
ఆ: హేయ్...నవ్వంటే ఛాంగోరే నా పైట చెంగోరే
ఏకంగా చుక్కల్లో ఎగిరిందొరే
అ: నీ ఒళ్లే బంగారే నిలువెల్లా బంగోరే
నా వోళ్లో పడిపోతే తలకిందులే
ఆ: మాపట్లో మాపల మంచిత్తరే
మార్ మార్ మార్ మాజా మారే
అ: ఈయేల సెగలకు నాకడ్డు తగలకు
నా వేడి చల్లారక జారేపోదు
ఆ: గడియైనా వొదలకు కొంగైనా ఇడవకు
తెల్లార్లు నువ్వింక నిదరే పోకు...
అ: మార్ మార్ మార్ మార్ ॥మార్ మార్॥

రచన: సాహితి (4) గానం : వేణు - సుమంగళి

అ: ఓ మనసా... ఓ మనసా
నీ చూపే మత్తెక్కించే కొంటె వయస్సా
ఆ: ఓ మనసా... ఓ మనసా... నీ నీడే నన్నే గిచ్చే నీకు తెలుసా
అ: నా.. కలే నిజం చేయవా..... ఈ క్షణాలలో
ఆ: ఆ... నిజం నిరూపించనా.... నా పెదాలతో
అ: చెలీ చెలీ.. సుఖాలనీ.... ఇలాగే సాగనీ ॥ఓ మనసా॥
అ: హో... ఎగసే అలల జడిలో ఎదలో ఏదో గుస గుసా
ఆ: మదిలో మధుర స్వరమే పలికే ఏదో పదనిసా
అ: లయలో హొయలు మెలివేస్తూ
నిను కదిలే నదిలా కలవాలి
ఆ: లతలా చేయి పెనవేస్తూ నను నేనే నీలో కలపాలి
అ: మరీ మరీ మనోహరీ సుఖాల వేళ చేరు నా కౌగిలీ
ఆ: ఓ మనసా..
ఆ: హో...మెరిసే నీలి కడలి కురుల నిన్నే దాచనా
అ: చిదిరే లేత నుదురే పాల నురగై తాకనా
ఆ: మనసే కోరు మధువులకే ఇక మనకో చోటే వెదకాలి
అ: ఒకటై చేరు తనువులకే మరి మనమూ దారి చూపాలి
ఆ: ప్రియా ప్రియా పెదాలిలా తపించిపోయే నీకే చెందాలనీ
అ: ఓ మనసా...





రచన: సాహితి (5) గానం : కార్తీక్ - సుమంగళి

అ: హోయ్... అనగనగా కథలా ఆ నిన్నకు సెలవిస్తే
అరె కనులను వెలిగించే ప్రతి ఉదయం మనదేలే
లోకాన చీకటిని తిడుతూనే వుంటామా
ఓ చిన్న దీపాన్ని వెలిగించుకోలేమా
ఆ వెలుగులకి తొలి చిరునామా
అది ఒకటే...చిరునవ్వేనమ్మా ॥అనగనగా॥
కో: హేలా హేలాల జాబిలి కంటికి కన్నీళ్ళా.....
హేలా హేలాల వెన్నెల కురవాలా
అ: హోయ్...బాధలో... కన్నులే.... కందినంత మాత్రానా
పోయిన కాలము పొందలేముగా
రేగిన గాయమే ఆరనంత మాత్రాన
కాలమే సాగక ఆగిపోదుగా
అరె ఈ నేల ఆకాశం వుందే మనకోసం
వందేళ్ల సంతోషం అంతా మన సొంతం
ఈ సరదాలు ఆనందాలు అలలయ్యేలా అల్లరి చేద్దాం..॥అనగనగా॥
కో: హేలా హేలాల హేలే లాలాల హేలా హేలాల హేలే లాలాలా
అ: ఎందుకో ఏమిటో ఎంత మందిలో వున్నా
నా ఎద నీ జతే కోరుతుందిగా
ఆ: ఒంటరి దారిలో నాకు తోడు వైనావే
ఎన్నడూ నీడగా వెంట వుండవా
కో: అరె కలలే నిజమైనాయి కనులే ఒకటయ్యి
కలిపేస్తూ నీ చెయ్యి అడుగే చిందెయ్యి
అ: మన స్నేహాలు సావాసాలు కలకాలాలకు కథ కావాలి
కో: హేలా హేలాల హేలే లాలాల హేలా హేలాల హేలే లాలాలా

రచన: సాహితి (6) గానం : పుష్పవనం కుప్పుస్వామి, కల్పన

అ: హే...గోంగూర తోటకాడ కాపుకాశా
ఆ: హే..కోడి కూసె వేళదాక ఎదురు చూశా
అ: హే...గోంగూర తోటకాడ కాపుకాశా
ఆ: హే..కోడి కూసె వేళదాక ఎదురు చూశా
అ: అంతలోనే పెరిగిపోయె ముద్దు ఆశా
ఆ: నీకు వెన్న ముద్దలిచ్చుకుంట వెంకటేశా
అ: కోరుకున్న దొరకన్నె గోరుముద్దలెప్పడమ్మో
ఆ: ఓరి పిల్లడా తలగడా మల్లెపూలు జల్లెడా
నువ్వు నాకు నచ్చినావు అందగాడా....
అ: ఓసి అమ్మడు గుమ్మడూ అంత నచ్చినప్పడు
దాచమాకు ఉట్టిమీద పాలమీగడ ॥గోంగూర॥
ఆ: హే..రా..రమ్మనీ కన్నుకొట్టగా కొంగునే చుట్టుకోనా
నా... కమ్మని కన్నె కౌగిలింత కానుకివ్వనా
అ: ఛీ...పొమ్మని... నన్ను ఊరికే నెట్టినా వదులుతానా
నీ...తియ్యని.... చెంపగిల్లకుండా ఉండగలనా
ఆ: ఏయ్... గువ్వా గోరింకలాటకే
పోదాము రావా గుమ్మ గుమ్మళ్ళ గూటికే
అ: ఏయ్.. చుమ్మా చుమ్మాల ముద్దుకే సందేళ రావే
గున్నా మావిళ్ళ తోటకే
ఆ: ఓరి పిల్లడా మల్లుడా ఇంటికొస్తే అల్లుడా
కంది సేను పక్క నిన్ను కలుసుకోనా
అ: ఓసి అమ్మడూ గుమ్మడూ పొద్దువాలినప్పడు
పెరటిలోన గిలక పట్టె మంచెమెయ్యనా
అ: హే...గోంగూర తోటకాడ కాపుకాశా
ఆ: కొక్కొరోకో..కోడి కూసె వేళదాక ఎదురు చూశా
అ: ఓహో...హో...నీ.... చెక్కిలి.... బుగ్గ చుక్కనై
చక్కగా నొక్కుకోనా
ఆ.... పక్కగా... నిన్ను కొమ్మ చాటు కెత్తుకెళ్ళనా
ఆ: నా... కొప్పులో.... నిన్ను ముద్ద బంతి
పువ్వులా పెట్టుకోనా
మా.... గొప్పగా..... నీకు ఏకధాటి ముద్దులెట్టనా
అ: ఏయ్ కయ్యా కయ్యాల పిల్లవే
కమ్మేసుకొంటె తియ్యా తియ్యని బెల్లవే...హే
ఆ: ఏయ్ మువ్వాగోపాలకృష్ణుడే
నా గుమ్మ సోకు ఉంగా ఉంగాలకొచ్చనే...హై..హై
అ: ఓసి అమ్మడూ గుమ్మడూ గుప్పెడంటే గుప్పెడు
నడుపువొంపు చూసుకోనేవే ఎప్పుడూ
ఆ: ఓ..ఓ..పిల్లడా చల్లగా అల్లమల్లె గిల్లగా
పైట చెంగు జారి పోయే నాకు ఇప్పుడూ
అ: ॥గోంగూర॥



పాటల పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు 'రాజా' పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.




## తారాగణం

రవితేజ, స్నేహ, అశుతోష్ రాణా, తనికెళ్ళ భరణి, మల్లికార్జునరావు, బ్రహ్మానందం, ఏవియస్, ఢిల్లీ రాజేశ్వరి, శిరీష


అట్లూరి పూర్ణచంద్రరావు


శ్రీను వైట్ల


దేవిశ్రీప్రసాద్


సాహితి

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| మాటలు | : కోన వెంకట్ |
| పాటలు | : సాహితి |
| ఎడిటింగ్ | : మార్తాండ్ కె.వెంకటేష్ |
| కెమెరా | : మూరెళ్ళ ప్రసాద్ |
| డ్యాన్స్ | : రాజశేఖర్, శంకర్, అశోక్‌రాజ్ |
| ఫైట్స్ | : విజయ్ |
| ఆర్ట్ | : నారాయణరెడ్డి |
| ప్రొడక్షన్ కంట్రోలర్ | : యు.సుబ్రహ్మణ్యం |
| ప్రొడక్షన్ డిజైనర్ | : డి.బ్రహ్మానందరావు |
| పబ్లిసిటీ | : ధని ఏలె |
| పి.ఆర్.ఒ. | : పులగం చిన్నారాయణ |
| కో-డైరెక్టర్స్ | : బండ్రెడ్డి నర్సింహారావు, గోపిచంద్ మలినేని |
| సంగీతం | : దేవిశ్రీప్రసాద్ |
| నిర్మాత | : ఎ. పూర్ణచంద్రరావు |
| కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం | : శ్రీను వైట్ల |

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

| | తమిళం | తెలుగు |
|---|---|---|
| చిత్రం | : కాదలిక్క నేరమిల్లై | ప్రేమించిచూడు |
| రచన | : కణ్ణదాసన్ | ఆచార్య ఆత్రేయ |
| సంగీతం | : విశ్వనాథన్ - రామ్మూర్తి | మాస్టర్ వేణు |
| గానం | : శీర్కాళి గోవిందరాజన్ | ఘంటసాల |
| అభినయం | : ముత్తురామన్, కాంచన | జగ్గయ్య, కాంచన |

'కాదలిక్కనేరమిల్లై' తమిళ చిత్రంలోని ఈ 'కాదలిక్క నేరమిల్లై' అనేపాటకు కొన్ని ప్రత్యేకతలున్నాయి. చిత్రం పేరుతోనే పాట పల్లవి మొదలు కావడం ఒక ప్రత్యేకత. కథానాయకుడి కోసం అతని తండ్రి వేషం వేసిన రెండవ కథానాయకుడు,ఆ ముసలి వేషంతోనే తన ప్రేయసిని అల్లరి పెట్టి ఆ తర్వాత తన అసలు రూపంలో ప్రత్యక్షమై ఆమెకు ఆనందం కలిగించడం -'కాదలిక్క నేరమిల్లై' చిత్రం విడుదలయ్యే నాటికి అరుదు. శాస్త్రీయ సంగీతంలో నిష్ణాతులయిన శీర్కాళి గోవిందరాజన్ ఇటువంటి అల్లరిపాట పాడడం కూడా ఓ ప్రత్యేకతే.

కణ్ణదాసన్ రాసిన ఆ పాటను చూద్దాం.

కాదలిక్క నేరమిల్లై
కాదలిప్పార్ యారుమిల్లై
వాలిబత్తిల్ కాదలిక్క
జాదగత్తిల్ వళియుమిల్లై ॥కాదలిక్క॥
పంజణైయుం కండదిల్లై
పాల్ పళం కుడిత్త దిల్లై
వంజి ఉన్నై కాణుం వరై
మనదుం తుడిత్తదిల్లై
పంజుపోల్ నరై విళుందు
పార్వైయుం కుళి విళుందు
రెండుం గెట్ట వేళైయిలే
కండేనే ఉన్నైయడి ॥కాదలిక్క॥
కాయిలే శువెప్పదిల్లై
కనిందదుం కశప్పదిల్లై
నోయిల్లా ఉడలిరుందాల్
నూఱువరై కాదల్ వరుం
మామియార్ కొడుమై ఇల్లై
మామనార్ యారు మిల్లై
ఇంద - సామియై మణముడిత్తాల్
సందోషం కుఱైవదిల్లై ॥కాదలిక్క॥
అవ్వులగం శెన్రు వందేన్
అముదం కుడిత్తు వందేన్
పొన్నులగం పోవదఱ్కు
పుదు ఉడల్ వాంగి వందేన్
ఇందిరనై కండువందేన్
ఇదుపట్ట్రి కేట్టు వందేన్
చందిరనై కండు వందేన్
సరసం నడత్త వందేన్
కాదలిక్క నేరముండు
కన్నియుండు కాళైయుండు
వాలిబత్తిల్ కాదలిక్క
జాదగత్తిల్ వళియుముండు
లాలలా లాలలల్లే లాలాలా లాలలల్లే......



ఈ తమిళగీతానికి భావానువాదం:
(ముసలి వేషంలో పాడిన భాగం)

ప్రేమించడానికి తీరికలేదు
ప్రేమించే వారెవరూ లేరు
వయసులో (యౌవనంలో) ప్రేమించడానికి
జాతకంలో దారీ (వీలూ) లేదు
(పట్టెమంచం)పాన్పును చూడలేదు
పాలూ పండూ తాగ (తీసుకో)లేదు
యువతి నిన్ను చూసేదాకా
మనసు తడ బడలేదు
దూదిలాగా తలనెరిశాక
కళ్లు గుంటలు పడ్డాక
రెంటికీ చెడ్డ వేళలో
చూశానే నిన్ను ॥ప్రేమించడానికి॥
కాయగా రుచించదు
పండినా చేదుకాదు
జబ్బులేని ఒడలు (శరీరం) ఉంటే
నూరు (ఏళ్ళ) దాకా ప్రేమ రావచ్చు
అత్తగారి బాధలేదు
మామగారంటూ ఎవరూలేరు
ఈ స్వామిని పెళ్లాడితే
సంతోషం తరిగిపోదు
(ముసలి వేషం తీసేసిన తర్వాత పాడిన భాగం:)
ఆ లోకం చూసివచ్చాను
అమృతం తాగి వచ్చాను
బంగరులోకం చూడడానికి (వెళ్లడానికి)
కొత్త శరీరం కొనుక్కువచ్చాను
ఇంద్రుణ్ణి చూసివచ్చాను
దీన్ని గురించి అడిగివచ్చాను
చంద్రుణ్ణి చూసి వచ్చాను

సరసమాడగా వచ్చాను
ప్రేమించడానికి తీరిక ఉంది
కన్నె ఉన్నది కోడె ఉన్నాడు
యౌవనంలో ప్రేమించడానికి
జాతకంలో వీలూ ఉంది

శీర్కాళి గోవిందరాజన్ పాడిన హుషారు పాటలలో ఒకటిగా ఈ పాట చాలా పేరు తెచ్చుకొంది. పాట పాడిన తీరులో సంగీత దర్శకులు ఎం.ఎస్.విశ్వనాథన్ ప్రభావం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ఈపాటలో వినిపించిన వాద్య విన్యాసం - విశ్వనాథన్ తర్వాత చేసిన చాలా పాటలలో వేర్వేరు రూపాలలో వినిపిస్తుంది. గోవిందరాజన్ పాటను వీలయినంత నాటకీయంగా పాడారు.

తమిళగీతం పల్లవి లాగనే 'ప్రేమించి చూడు' చిత్రంలోని 'ప్రేమించిచూడుపిల్లా' పాట పల్లవీ చిత్రం పేరుతోనే మెదలుకావడం విశేషం.

తమిళగీతం వరసనే తెలుగు పాట దాదాపుగా అనుసరించినా - తెలుగుపాట కొంత జానపద ధోరణిలో సాగింది. తమిళగీతంలో కన్నా తెలుగుపాటలో ఘంటసాల చేసిన ఆలాపన ప్రత్యేకంగా వినిపిస్తుంది. సంగీత పరంగానూ సాహిత్యపరంగానూ తెలుగుపాట తమిళగీతం కన్నా భిన్నంగా వినిపిస్తుంది.

తమిళ గీతంలోలాగనే తెలుగుపాటలో కూడా ముసలి వేషంతో పాడిన భాగమూ అసలు రూపంలో పాడిన భాగమూ ఉన్నాయి.

మొదట 'ప్రేమించి చూడు పిల్లా' అని పాడించినా ఆ తర్వాత పల్లవి సందర్భాలలో 'ప్రేమించి చూడు పిల్లో' అని పాడించడం అల్లరిని పెంచడానికే.

తమిళ, తెలుగు గీతాలు రెండింటిలోనూ నాయకుడు, నాయకను చూచేదాకా ప్రేమింటే తెలియలేదు అని చెప్పడం, అతని సత్య సంధతకు గుర్తు. గడ్డం తీసేసి తానెవరో తెలియజేసే సందర్భంలో తమిళగీతం ఆ లోకం నుంచి రావడం (గురించి) ఇంద్రుణ్ణి, చంద్రుణ్ణి చూసి రావడం గురించి, అమృతపానం గురించి ప్రస్తావించగా - తెలుగు పాటలో ఆ లోకం ముచ్చటేవీ కనిపించవు.

విజయనగరం ప్రాంతాలలో వాడే 'గుంట'(అమ్మాయి) అనే మాటను ఆత్రేయ రాసినా, దాన్ని విజయనగరంలో సంగీతాభ్యాసం చేసిన ఘంటసాల పాడడం కాకతాళీయం కాకపోవచ్చు. తెలుగు పాటలో 'మెక్కలేదు' అనే మాట రెండుసార్లు చమత్కారంగా వాడడం ఆత్రేయ ప్రత్యేకత. తమిళ గీతంలోని జాతకం ప్రస్తావన తెలుగు పాటలో లేకపోవడానికి ఆత్రేయ అభ్యుదయ దృక్పథం కారణం కావచ్చు. 'కొరత' అనే మాటకు 'కొరవ' అనే నెల్లూరి మాండలిక ప్రయోగాన్ని నెల్లూరు వారైన ఆత్రేయ చేయడం అసంకల్పితమే కావచ్చు.

మీసాలు లేని పాత్రలెన్నిటిలోనో కనిపించిన జగ్గయ్య కొంతసేపయినా గడ్డంతో కనిపించడం ఈ చిత్రంలో విశేషం!

**- పి.ఎస్.గోపాలకృష్ణ**

'ప్రేమించి చూడు' పాట ఇది:

**ప్రేమించి చూడు పిల్లా పెళ్లాడుదాము మళ్లా**
**వయసున్ననాడు ఇలా దొరకలేదొక పిల్ల**
**పట్టెమంచమెక్కలేదు**
**పాలు పళ్లు మెక్కలేదు**
**నిన్ను చూచేదాకా**
**ప్రేమంటే తెలియలేదు** ॥ప్రేమించి॥
**ముగ్గు బుట్టాయె తలా**
**ముడత పడె ముఖం ఇలా**
**పొద్దువాలి పోయే వేళా**
**పొత్తు కుదిరేనే పిల్లా** ॥ప్రేమించి॥
**కాయలో రుచి లేదే**
**పండులో పసవేరే**
**దుక్కవలె దేహమున్న**
**లెక్కేమె వయసైనా**
**అత్తగారి పోరులేదు**
**మామగారి అదుపు లేదు**
**ముసలాడే మొగుడైతే**
**మురిపాలకు కొరవలేదు** ॥ప్రేమించి॥
**గడ్డాన్ని చూచి ఇంత**
**కంగారు ఏల గుంటా**
**పైపైన చూడవద్దు**
**నాలోన మెరుగు కద్దు** ॥ప్రేమించి॥
**మనసైన సోకుగాడే**
**వయసున్న కుర్రవాడే**
**సరియైన జోడు వీడే**
**మనువాడి చూడు నేడే**
**లాలాల లాలల్లా లాలాల లాలలల్లా**





## కొమ్మ కొమ్మకో సన్నాయి...



# నాటి ఆకాశవాణి నేటి అశరీర వాణి

1950వ సంవత్సరం కాబోలు - తెనాలి స్టేషన్‌లో మద్రాస్ మెయిల్ కోసం ప్రయాణీకులు వెయిట్ చేస్తున్నారు. నేను అప్పుడు మద్రాసు ఆర్ట్సుకాలేజీ విద్యార్థిని. ఇంటర్మీడియేట్ చదువుతున్నాను. ఎవరో యిద్దరు యువకులు మాట్లాడుకుంటున్నారు. అందులో ఒక కంఠం ఘంటారావంగా వినిపిస్తోంది. అందరూ వినముచ్చటగా వింటున్న ఆ కంఠం, 'నీబొంద, ప్రయాగ రాఘవయ్యంటే తెలీని నీకు ఓటు వేసే హక్కు లేదు. అతనొక జూనియర్ నేతాజీ. క్విట్టిండియా ఉద్యమంలో బ్రిటిష్ దమననీతికి బలి అయిపోయిన ఆంధ్రవీరుడు, అప్పుడే ఈ తెనాలి స్టేషన్ తగల బెట్టారు' అన్నది గంభీరంగా. రాత్రి పదిగంటల వేళ -చుట్టూ జనం కొంచెంగా మూగుతున్నారు. నేనూ దగ్గరకు వెళ్లి చూదుమగదా ..ఆ అక్షింతలు వేయించుకుంటున్న రెండో వ్యక్తి మావూరి (తెనాలి తాలుకా - కొల్లూరు)వాడు చెరువు ఆంజనేయ శాస్త్రి!

ఈ చెరువు శాస్త్రి అప్పుడు చెప్పాడు ఆయనే 'ఆలిండియా రేడియో వార్తలు ...చదువుతున్నది జగ్గయ్య' అని, జగ్గయ్యగారు రేడియో ఉద్యోగం వదిలిపెట్టి త్రిపురనేని గోపిచందుగారి ప్రోత్సాహంతో 'ప్రియురాలు' అనే చిత్రంలో నటిస్తున్నారని, 'మేమిద్దరం, మన గుమ్మడి కలిసి' చాలా నాటకాలు ప్రదర్శించామని.

చెరువు ఆంజనేయ శాస్త్రి కూడా తరువాత మద్రాసు చేరి అసిస్టెంటు డైరెక్టరుగా, మాటలరచన, పాటల రచన వగైరాలలో సహాయకుడిగా వుంటూ వుండేవాడు. ఆరుద్రగారి దగ్గర కొంతకాలం పనిచేసినట్టున్నాడు. 'నారీ -రసమాధురీ లహరీ' అనే మంచి పాట ఒకటి రాశాడు- మంచి కవిగా పేరు తెచ్చుకున్నాడు. 'మానవాకారం, వట్టిమమకారం ఆలకించిన అంధకారం' వంటి పాటలు కొన్ని రాసి వినిపించేవాడు. అప్పుడు నేను విద్యార్థిని. జగ్గయ్యగారూ, తనూ ఒకటి రెండుసార్లు మల్లాది రామకృష్ణ శాస్త్రి గారి వద్ద కనిపించారు. అప్పటికి 'ప్రియురాలు' విడుదలై విజయానికి దూరమై తిరిగివచ్చింది.

కొంతకాలం తర్వాత మంచి నటుడుగా గుర్తింపు తెచ్చుకున్న జగ్గయ్య నటనా జ్యోతి జాజ్వల్యమానంగా వెలగడం మొదలు పెట్టింది. దానికి ఆయన స్ఫుట గంభీర కంఠమూ, భాషోచ్చారణాసంస్కారము తోడయ్యాయి. అచిరకాలంలోనే జగ్గయ్యగారి ప్రతిభకు చిహ్నంగా ఒకనిందా స్తుతి వాక్యం పరిశ్రమలో చోటుచేసుకుంది. 'జగ్గయ్య హీరోగా వేస్తే నిర్మాతను తింటాడు, సెకండ్ హీరో వేస్తే హీరోను తింటాడు' అనేది ఆమాట!

'శబ్ద సంస్కార మెచ్చుటను జారగనీక పదమైత్రి అర్థసంపదల పొదల' అన్న పింగళి సూరన గారి (ప్రభావతీ ప్రద్యుమ్నము) కి నమస్కరించి 'పలుక నేర్చుట బహుతపః ఫలముగాదె' అని జగ్గయ్య గారిని ఆరాధించిన వారిలో నేనొకడను. 'ఫొనెటిక్స్'ను తెలుగు పదాలకు ఎంతగా ఆయన పాటించేవారో చెబితే ఒక గ్రంథమవుతుంది.

ఉదాహరణకు 'కృషి' అనే మాటను సాధారణంగా 'క్రుషి' అనిఉచ్చరించడం మనం వింటూనే వుంటాం. కానీ క్రుషికి, క్రిషికి మధ్యలో వట్రువసుడి (కృషి)యిస్తే అది ఎలా ధ్వనిస్తుందో తెలిసిన వారు జగ్గయ్యగారు. ఆయన ఆకాశవాణిగా పలుకుతూ ప్రారంభించిన ఈ శబ్దసంస్కార యోగం అశరీరవాణిగా మిగిలే దాకా పాటించారు. భాషలో, వేషంలో మూర్తీ భవించిన తెలుగుతనం ఆయనది....కొన్ని ప్రత్యేక సందర్భాలు మినహాయిస్తే.....



తెరకు గ్లామరు, తెలుగు గ్రామరునిలిపి తెలుగుతనానికి నిలువుటద్దమై నిలిచారు ఆయన. అరకొరపాండిత్యాలు, అరకప్పు కాఫీలు, అరువు తెచ్చుకున్న పరువులూ చెలామణీ అవుతున్న ఈ కాలంలో కూలంకష ఆంధ్ర సాహితీ (భాషా వ్యాకరణ) పాండిత్యం గల జగ్గయ్య గారిని తలుచుకుంటే ఆనంద బాష్పాలు పొంగుతాయి.

మల్లాది వారితో ఒక సాయంత్రం క్వార్థకం,వర్ణవ్యత్యయం వంటి వ్యాకరణ విశేషాలను గురించి క్షుణ్ణంగా రెండు గంటలపాటు ఆయన చర్చించడం నేనొక విద్యార్థిగా విని 'ఎంత నేర్చుకోవాలో ' తెలిసి ముకుళించుకుపోవడం మరువలేను.

'అర్థాంగి' చిత్రంలో జగ్గయ్యగారి నటన, 'వద్దురా కన్నయ్యా' అనే ఆత్రేయ పాట శాస్త్రి గారు ఆనాడు ప్రశంసించారు. ఓ హెన్రీ మొపాసాల కథలను గురించిన చర్చ కూడా కొంత జరిగింది. 'ఆఫ్ హ్యూమన్ బాండేజ్' అనే సోమర్సెట్ మామ్ నవలలో ఫిలిప్ వేషం తెలుగీకరించి తీస్తే వెయ్యాలని జగ్గయ్య చాలా సార్లు అనుకున్నారు. అడవి బాపిరాజుగారి 'నారాయణరావు' కూడా ఆయనకు ప్రాణసమానం. అయితే అభినయించే అవకాశం ఆయనకు రాకపోవడం మన దురదృష్టం.

కొడాలి సుబ్బారావు 'హంపీక్షేత్రం', శిష్ట్లా ఉమామహేశ్వరరావు 'నవమిచిలుక', అలాగే గుంటూరు ఎ.సి. కాలేజీ తెలుగు ఉపన్యాసకులు, నవ్యసాహితీ పరిషత్పురుషులు శ్రీతెలికిచెర్ల వెంకటరత్నం సంపాదకత్వంలో వెలువడిన 'ప్రతిభ' సంచికలు, శ్రీ కోలవెన్ను రామకోటీశ్వరరావుగారి 'త్రివేణి' ఆంగ్ల సాహితీ పత్రికలు జగ్గయ్యగారు ఆరాధించిన సరస్వతీ పీఠికలు. స్వయంగా కవి, భావుకుడు,జర్నలిస్టు అయిన జగ్గయ్యగారు నటనారంగంలో ఉన్నత ప్రమాణాలు తనకు కలిగిన అవకాశాలలో అందుకోగలిగారు. ఆయన 'అల్లూరి సీతారామరాజు' చిత్రంలో వేసిన 'రూథర్ ఫర్డ్' పాత్ర రంగస్థలం ఆయనకెంత నేర్పిందో వెల్లడించే పాత్ర. చారిత్రకమైన కథలు, నాటకాలు అలాగే సాంఘిక స్పృహ కలిగించే కథలు, నవలలు, నాటకాలు వెండితెరకు రావాలనే తపన ఆయనలో ఎంతగానో ఉండేది. 'గోన గన్నారెడ్డి',' ప్రతాపరుద్రీయం' వంటి నవలలు, నాటకాలు సినిమాలుగా రావాలనే ఆకాంక్ష నేటికీ తీరకపోవడం విచారకరం.

పాటల రచనలో, కొన్ని చిత్రాలకు మాటలు రాయవలసిన కీలక సన్నివేశాలలో దర్శక నిర్మాతలు జగ్గయ్యగారిని ఆశ్రయించిన సందర్భాలనేకం. అయితే ఆయా సందర్భాలలో ఆయన 'నేపథ్యం' లోనే ఉండి పోవాలనుకున్నారు. ఆ 'క్రెడిట్' కొట్టేయ్యాలనే తపనకు అతీతుడై నిలిచిన సినీమానిసి ఆయన. 'ముందడుగు' కృష్ణారావు దర్శకత్వంలో వచ్చిన ఒకటి రెండు సినిమాలలో జగ్గయ్యగారి శృంగార భావకవితా విహంగం శరన్మేఘంలాగా ఎగిసి వచ్చి రస హృదయాలను దోచుకుంది. తెల్లచీర, మల్లెపూలు ధరించిన అభిసారికలా దేవిక నటించిన ఒక చిత్రంలో జగ్గయ్యగారి కవిత కర్పూర శిల్పంలా కళ్లలో కరుగుమా వీనులకు విందు చేస్తూ దృశ్యశ్రవ్యకళకు అద్దం పట్టింది. అదొక మధురానుభూతిగా హృదయంలోకి జారిపోయింది.

జేగంటలు, మేఘసందేశం, సప్తపది చిత్రాలలోని నా పాటలను ఆయన ప్రత్యేకంగా ఫోనుచేసి మెచ్చుకున్నారు. అన్నిటిలోకి 'నిన్నటిదాకా శిలనైనా' అనే పాట ఆయన ప్రశంసకు, అభిమానానికి పాత్రమైంది. 'ఏ కులమూ నీదంటే గోకులము నవ్వింది'(సప్తపది),'వెన్నెలలో వేచివేచి వెచ్చనైన నా సామికి' (జేగంటలు) అలాగే 'చూడాలనివుంది' చిత్రంలోని 'యమహానగరి కలకత్తాపురి' గీతాలు ఆయనకు ఎంతో ఇష్టం. అధి వాస్తవికత సినీగీతాలలో వినిపిస్తే ఆయన మురిసిపోయేవారు. 'ఎడారిలో కోయిలా' (పంతులమ్మ) 'మేఘమాదేహమా మెరవకే ఈక్షణం' (మంచు పల్లకి) వంటి పాటలను, అలాగే 'గీతాంజలి' చిత్రంలో 'ఆమనీ పాడవే' - ఇవన్నీ ఒక సంకలనంగా వేయవలసిన అవసరం నాకు నొక్కి చెప్పేవారు.

జగ్గయ్యగారు ఎంతటి అభ్యుదయవాది అయినా ప్రాచీనమైన శాస్త్ర

సంప్రదాయాల మీద విశేష గౌరవం కలవారు. ఆ విషయంలో నార్లగారి భావాలను ఆయన వ్యతిరేకించారు. 'నాస్తికమ్ము వోలె ఆస్తికమ్ము కూడ చీకటింటిలోన చిందులాట' అన్న నార్లగారి పద్యం 'కరెక్టుకాదు' అని ఒక ఇంటర్వ్యూలో ఆయన ఆస్తికత్వమంటే చీకటిల్లు కాదని, ఆస్తికుడు దేవుడనే తన నమ్మకాన్ని దీపంలా వెలిగించుకునే చిందులు వేస్తాడనీ బల్లగుద్ది చెప్పడం జరిగింది.

శాస్త్రాన్ని, సంప్రదాయాన్నీ కాదంటే తాతతండ్రులని, భారత భాగవతాలనీ, హరప్పామొహంజోదారోలని , శిల్పాన్నీ, సంగీతాన్ని, అన్నిటినీ కాదన్నట్టే అని ఆయన నిశ్చితాభిప్రాయం. వాస్తు, జ్యోతిష్ శాస్త్రాలను ఆయన ఎంతగానో అధ్యయనం చేశారు. నాడీ గ్రంథాల గొప్పదనం వైజ్ఞానికంగా, సాంకేతికంగా నిరూపించిన ప్రతిభాశాలి జగ్గయ్య. కొత్తగా ఇల్లుకొనుక్కున్నా, కట్టుకున్నా ఒకసారి జగ్గయ్యగారికి చూపించండి అనడం తెలుగువాళ్లకు అలవాటు అయిపోయింది. అంతచక్కని వాస్తుశాస్త్రవేత్త ఆయన.

సినీరంగంలో రచయిత ప్రాముఖ్యాన్ని జగ్గయ్యగారంతగా గుర్తించిన నటులు లేరు. స్వయంగా తానొక రచయిత కావడమే అందుకు కారణం కావచ్చు, సినీకవులలో ఆయన ఎక్కువగా అభిమానించే కవులు ఆత్రేయ, ఆరుద్ర. 'మనస్వినీ'ట్రస్టు ఏర్పాటులోనూ, ఆత్రేయ సాహితీ సంపుటీకరణ,ముద్రణ, ఆవిష్కరణ ఉద్యమంలోను ఆయన పాత్ర అద్వితీయమైనది. అలాగే సినీరచయితలకు సంఘటిత శక్తి కావాలని ఒక యూనియన్ ఏర్పాటు చేయడానికి మొట్ట మొదటిసారి నేను మద్రాసు యం.యం. థియేటర్‌లో ఏర్పాటు చేసిన ప్రారంభసభకు వచ్చి తమ అమూల్యమైన సలహాలను యివ్వడమేగాక, రచయితల యూనియన్‌ల చరిత్రను సమగ్రంగా వివరించిన గొప్ప జర్నలిస్టు ఆయన. ఆనాటి సభకు ఆయనతో పాటు ఆరుద్ర కూడా వచ్చి సుదీర్ఘమైన ప్రసంగం చేశారు. సూచనలెన్నో అందజేశారు.

జగ్గయ్యగారి అభిమాన నాయకుడు భారత సామ్యవాద ప్రవక్త జవహర్‌లాల్ నెహ్రూ. నెహ్రూ ఆర్ద్ర హృదయం, ఆవేశపరత్వం, ఛాందస వ్యతిరేక ఉద్యమోత్సాహం, కళా ప్రియత్వం తలుచుకుంటూ, తన భావాలు నాతో పంచుకుంటూ ఆయన రెండుమూడు సందర్భాలలో మురిసిపోయారు. నెహ్రూ తనువుచాలించిన రోజున 'ఇంత చీకటి ఇంతకుముందు చూడలేదు....సూర్యోదయం కాలేదా..కాదా! అని ఆక్రోశించిన హృదయం ఆయనది.

ఎక్కడెక్కడి పత్రికలో తెప్పించి అవి ముందు వేసుకుని చూడడంతోనే రోజులు గడిపారు జగ్గయ్యగారు. నాటి భారత జాతీయ కాంగ్రెస్‌కు ఆయన అంకితమైపోయారు.అమెరికన్ మాగజైన్లు లైఫ్, సాటర్ డే ఈవినింగ్ పోస్టు, అలాగే రష్యన్ పత్రికలు తెప్పించుకుని నెహ్రూ నిర్యాణానికి ఆ పత్రికలలో వచ్చిన ప్రత్యేక వ్యాసాలు నాకు చూపించి ఆశువుగా అశ్రువులతో రాసిన తన కవిత వినిపించారు

**'అమ్మాభారతి అమ్మాభారతి**
**ఆరిపోయె నీ ఆశలహారతి'**

అని సాగిన ఆశు కవిత అది. అది అటు తర్వాత ఆంధ్ర పత్రిక లో కాబోలు ప్రచురితమైంది.

జీవితపు దశవిదశలకు సంబంధించిన ఆయా రసాలను అనుభవించడంలో ఆస్వాదించడంలో, పరిపోషించడంలో జగ్గయ్య కృతకృత్యులైనారు.

జగ్గయ్యగారి నిర్యాణంతో తెలుగు తెర ఒక కంటివెలుగును పోగొట్టుకుంది. తెలుగు నేల ఒక ఇంటి దీపాన్ని కోల్పోయింది. తెలుగు భాష తన మాట నిలబెట్టే దిక్కునే చేజార్చుకుంది.

కవి, పండితుడు, పాత్రికేయుడు, నటుడు 'కళావాచస్పతి' శ్రీ కొంగర జగ్గయ్య- ఒకనాటి ఆకాశవాణి ఆయనది, అదే ఈనాడు అశరీరవాణి.

**- వేటూరి సుందరరామమూర్తి**

# బాణీ ముత్యాలు

**సేకరణ : పి.గిరి,హైదరాబాద్**
**ఎం.మస్తాన్‌రెడ్డి, విశాఖపట్నం**


శ్రీశ్రీ

"అబద్ధానికి నోరు పెద్దది - అరుస్తూ ఉంటుంది
సత్యానికి గుండె గట్టిది - చావదెన్నటికీ
నిప్పు గొప్పకి పోయి నీళ్లనే కాస్తుంది
ఆ నీరే పొంగి పొంగి నిప్పు నార్పేస్తుంది"

**చిత్రం :** సత్యానికి సంకెళ్ళు
**పాట పల్లవి :** ఈ లోకంలో మనిషికి మనిషే తోడు


ఆరుద్ర

పెరుగుచున్న సూర్యుణ్ణి మబ్బు మూయును
మనిషి తెలివియనే సూర్యుణ్ణి కోపం మూయును
గాలి వీచి మబ్బుతెరలు కదిలిపోవులే - మాట
కలుపుకున్న కోపమే చెలిమియగునులే

**చిత్రం :** లేత మనసులు
**పాట పల్లవి :** పిల్లలూ దేవుడూ చల్లని వారే


ఆత్రేయ

అందమైన జీవితమూ అద్దాల సౌధమూ
చిన్న రాయి విసిరినా చెదిరిపోవునూ
ఒక్క తప్పు చేసినా ముక్కలే మిగులును

**చిత్రం :** విచిత్రబంధం
**పాట పల్లవి :** అందమైన జీవితమూ అద్దాల సౌధమూ


జాలాది

అందరూ నడిచొచ్చే తోవ ఒక్కటే
సీవు నెత్తురులు పారే తూము ఒక్కటే
మేడ మిద్దెలో వున్నా
సెట్టునీడ తొంగున్నా
నిదర ముదర పడినాక
పాడె ఒక్కటే వల్లకాడు ఒక్కటే
కూత నేర్చినోళ్ల కులం కోకిలంటరా
ఆకలేసి అరిసినోళ్ళు కాకులంటరా

**చిత్రం :** ప్రాణం ఖరీదు
**పాట పల్లవి :** యాతమేసి తోడినా ఏరు ఎండదు


సిరివెన్నెల

నడిరాత్రిలో పడి ఉండడు ఎద రగిలే సూరీడు
పడగెత్తిన గ్రహణానికి శిరసొంచడు ఏనాడు
మనలో అజ్ఞానం తప్పుచేసినా
తెలిసి చిచ్చులో మండాలిరా
ఆ మంటే జ్యోతి చూపగా
మనిషి భయపడాలి తప్పు పనులకి
భయము భయపడాలి మనిషి మంచికి

**చిత్రం :** పవిత్రప్రేమ
**పాట పల్లవి :** చినుకులే ఒక్కటై వరదగా మారితే

# ఎలుక వచ్చె ఇల్లు భద్రం

ఇలపావులూరి మురళీమోహనరావు



**27**

**హెచ్చరిక**

విరగబడి నవ్వితే గుండె చిక్కబట్టి ఊపిరాడక అవస్థపడేవారు కామెడీ యాక్ట్ 2003 ప్రకారం ఈ సీరియల్‌చదవడం నిషేధం.

ఒకవేళ మీ పొట్టచెక్కలైతే పత్రిక నుంచి ఎలాంటి పరిహారం రాదు. ఈ హెచ్చరిక ఈ సీరియల్ పూర్తయ్యేంత వరకు అమలులో ఉంటుంది.



**జరిగిన కథ**

వెంకట్రావు, సుందరిల ఇంట్లో ఓ ఎలుక చేరి నానా రభసా చేస్తూంటుంది. దాన్ని చంపడానికి పెట్టిన మందును వాళ్ల పాప రుచిచూడడంతో ఉత్తుత్తి పరీక్షల పేరిట డాక్టర్లు వేలాది రూపాయలు ఖర్చుపెట్టిస్తారు. మేనేజరు ఇంటినుండి పిల్లిని తెస్తారు. మర్నాడు చీలికలు పేలికలై కనిపించింది ఎలుక. అప్పటినుండి పిల్లీ కనబడడం మానేస్తుంది. కంగారుపడుతూండగానే కొన్నాళ్లకు ఆరుకూనలతో సహా అటకమీద ప్రత్యక్షమవుతుంది. పాలెక్కువై పిల్లి కూనలలో ఒకటి చనిపోవటంతో ప్రాయశ్చిత్తం కోసం శాస్త్రిని కలిసిన వెంకట్రావుకు నరకబాధల బూచిచూపి ఇరవై వేల రూపాయల ఖర్చుతో శాంతి చేయించాలంటూ తూతూ మంత్రాలతో పూజలు చేయించి దోచుకుంటాడు. జరిగిన తతంగమంతా తన కొలీగ్ నారాయణకు చెప్తాడు వెంకట్రావు. ఇదంతా మీ ఇంటి వాస్తు బాగా లేకపోవటం వల్లే జరిగిందని, వాస్తుభూషణరావుని కలిస్తే ఫలితం ఉంటుందన్న నారాయణ సలహా మేరకు వాస్తు భూషణరావు ఇంటికి వచ్చి లైనులో నిలబడిన వెంకట్రావుకు తెల్లవారుజాము మూడున్నరకు అయనను కలిసే అవకాశం దొరుకుతుంది. తన సమస్యను విన్నవించటంతో స్వయంగా వచ్చి ఇంటి వాస్తు పరిశీలిస్తానని చెప్పి వెంకట్రావు ఇంటికి వచ్చిన వాస్తుభూషణరావు వెంకట్రావు ఇంటికి చేయాల్సి మార్పులు గూర్చి చెబుతుంటాడు. అంతలో అక్కడకు వచ్చిన వావి.చా, వాస్తుభూషణం చెప్పేదంతా అబద్దమని, అతనిని నమ్మవద్దని చెబుతుంటాడు.

(ఇక చదవండి)

"వెంకట్రావు గారూ... వాడికేం తెలియదు. అర్భకుడు. ఆ లెట్రిన్ని పునాదులతో సహా నిర్మూలించకపోతే మీకు అగ్ని ప్రమాదం తప్పదు. ఇండియా ఏ దేశం మీదైనా అణ్వాయుధాలు ప్రయోగిస్తే అవి గురి తప్పి నేరుగా మీ ఇంటి మీదే పడి ఇంటి ఆనవాలు కూడా మిగలక పోవచ్చు." అన్నాడు వాస్తుభూషణం.

ఆ దృశ్యాన్ని గాలిలో చూస్తూ ఊహించుకున్న వెంకట్రావు ముఖం ఏదో డ్రాక్యులా తన కోర పళ్ళతో తన ముఖంలోని రక్తమంతా పీల్చుకున్నట్లు పాలిపోయింది.

"సుందరిగారూ.. నైరుతిలో కిటికీ తప్పని సరిగా ఉండాలి. లేకపోతే మీకు కుష్టువ్యాధి సంక్రమించే అవకాశాలున్నాయి. మీ చేతులు ఎలుకలు కొరికిన దొండ కాయల్లా కుంచించుకుపోతాయి. అప్పుడు మీ చేతులతో అన్నం కలుపుకోలేరు. స్పూన్ ముట్టుకోలేరు"చెప్పాడు వా.వి.చా.

వణికిపోయింది సుందరి. తన వేళ్ళన్నీ చిన్నచిన్న దొండకాయల్లా మారి వేళ్ళు ముడవలేక అల్లాడుతుంటే స్కూలుకెళ్ళే పిల్లలు తనను చూసి భయపడి రాళ్ళు వేస్తున్నట్లు, ఆకలో రామచంద్రా అని ఏడుస్తూ బస్టాండు వద్ద తినడానికేమైనా దొరుకుతాయో మోనని చెత్తకుండీల్లో వెదుకుతుంటే, ఎవరో తిని పారేసిన అరటిపండు తొక్క కోసం తాను ఆత్రంగా వెతుక్కుంటున్నట్లు భయంకరమైన దృశ్యం గోచరించి పరమ భయకరంగా కేకపెట్టింది.

"వెంకట్రావుగారూ వాడిమాట వినద్దు. ఆ కిటికీ ఉంటే మీకు క్షయవ్యాధి సోకి దేవదాసులా దగ్గుకుంటూ ఊరకుక్కను వెంటేసుకుని ఊరంతా తిరుగుతూ ఉంటే, మీ దగ్గు భరించ లేక జనమంతా మీ మక్కెలు విరగ్గొడతారు. ఇది నిజం.'' వళ్ళు నూరుతూ చెప్పాడు వాస్తుభూషణం.




''సుందరిగారూ.. మీ మంచి కోరి చెబుతున్నాను. పిట్టగోడ ఎంత మందంగానైనా ఉండచ్చు. వాడి మాటలు నమ్మి దాన్ని పడగొట్టద్దు. ఒకవేళ అలా పడగొడితే వాస్తుపురుషుడికి కోపం వచ్చి మీకు కేశసంబంధ వ్యాధులు రావచ్చు. నీలాల మీ కురులకు పేను బంక, ఆకుపచ్చ పురుగు చేరి జొన్నకంకులను నమిలినట్లు మీ తలను కొరికి వేస్తాయి. విగ్గు పెట్టుకోవడానికి కూడా తలషేపు పనికి రాకుండా పోతుంది." హెచ్చరించాడు వా.వి.చా.

సుందరి అరికాళ్ళ క్రింది నేల కదిలింది. తన తలంతా పురుగులు చేరి పొడవాటి గోళ్ళతో బరబర గోక్కుంటున్నట్లు, ఒక్కసారి దువ్వెనతో దువ్వగానే లక్షల పురుగులు జలజల రాలి నేలమీద పడ్డట్లు, అవి మళ్ళీ గబగబ తన శరీరం మీదుగా పాకుతూ తలలో దూరుతున్నట్లు, పళ్ళదువ్వెనతో దువ్వగానే తుట్టెలు తుట్టెలుగా తలంతా జుట్టూడిపోతూ నాలుగైదు రోజుల్లోన్లే తలంతా బోడి గుండైనట్లు దిక్కుమాలిన కలకని గజగజ వణికింది.

"వద్దు వద్దు... ఆ పిట్టగోడ పడగొట్టం. నాతల.. నాతల" అని తలంతా తడుముకుని వెంట్రుక వెంట్రుక పట్టిచూసింది.

వాస్తుభూషణం గుడ్లురుముతూ అందుకున్నాడు.

"వెంకట్రావుగారూ.. మీ హితం కోరి చెబుతున్నాను. మెట్లను మీరు తక్షణం పడగొట్టించండి. ఎనిమిది మెట్లు తరువాత ప్లాట్ ఫ్లామ్ మీకు ఊహించని వ్యాధులు కలిగిస్తుంది. పక్షవాతం వచ్చే అవకాశాలు మెండుగా ఉన్నాయి. కుడి చెయ్యి, కుడికాలు పడిపోతాయి. అపుడు మీరు అన్నం తినడానికి కూడా ఆ చెయ్యే... యాక్కిరే... ఉపయోగించాల్సివస్తుంది. బాత్‌రూమ్‌కు వెళ్ళాలన్న ఒంటికాలితో శరీరాన్నంతా మోసుకుంటూ కప్పలాగా ఎగురుకుంటూ వెళ్ళాలి. ఆ దృశ్యాన్ని ఒక్కసారి ఊహించుకోండి." చెప్పాడు వాస్తు భూషణం.

వెంకట్రావు చేతులు కాళ్ళు వణికాయి. హఠాత్తుగా తన కుడి చెయ్యి, కుడికాలు నీలుక్కు పోయినట్లు, ఒంటికాలుతో ఎగురుతూ బాత్‌రూమ్‌కు వెళ్తూ తలుపు తెరవమని సుందరిని కోరగా నిరాకరించినట్లు ఓ దరిద్రపు దృశ్యం సాక్షాత్కరించి చెవులకు అరిచేతులు అడ్డం పెట్టుకుని 'నో' అని అరిచాడు.

వా.వి.చా. అందుకున్నాడు.

"సుందరిగారూ.... ఆడవాళ్ళనే ఆపేక్షతో చెబుతున్నాను. కాంపౌండ్‌లోని చెట్లు పడగొట్టించ వద్దు. వృక్షాలను మనం రక్షిస్తే అవి మనలను రక్షిస్తాయి. ఆ చెట్లే మీ ఆరోగ్యాన్ని భద్రంగా కాపాడుతాయి. వాటిని పడగొడితే నలభై ఏళ్ళు కూడా రాకుండానే దానిమ్మగింజల్లాంటి మీ పళ్ళు టపటప రాలిపోతాయి. అపుడు మీరు నోరారా నవ్వలేరు. అన్నాన్ని సంకటిలా వండుకుని నేరుగా మింగవలసి వస్తుంది. వక్కపొడిని కూడా కల్వంలో దంచుకుని పౌడర్‌లా చేసి చప్పరించవలసి వస్తుంది." హెచ్చరించాడు.

ఒకరోజు ఉదయం బ్రష్ చేసుకుంటుంటే తన పళ్ళన్నీ రాలిపోయినట్లు, దవడలు రెండూ సొట్టలు పోయి ముడుచుకు పోయినట్లు. ముద్దను చిన్న చిన్న ఉండలుగా చేసి నేరుగా గొంతులో వేసుకుంటున్నట్లు, చిన్న కల్వంలో తమల పాకులు, వక్కలు, సున్నం కలిపి సూరి దవడల మధ్య దోపి చప్పరిస్తున్నట్లు ముదనష్టపు ఊహ మెదిలింది సుందరికి.

"వద్దండీ వద్దు.. ఆ చెట్లు చచ్చినా పడగొట్టం. నేను పోయిందాకా నా పళ్ళు నాతోనే ఉండాలి." అని గబగబ అరమరలోనున్న ఒక్కపొడి డబ్బా



తెరిచి గుప్పెడు వక్కపొడి నోట్లో పోసుకుని నమిలేసింది.

వాస్తుభూషణానికి కంగారెక్కువైంది. తన క్లయింట్ తన చెయ్యి జారి పోతున్నాడన్న భావన కలిగింది. కోపం వచ్చింది. చెప్పసాగాడు.

"వెంకట్రావుగారూ..మీ శ్రేయోభిలాషిని. ఈ మోసగాడిని నమ్మద్దు. పిట్టగోడను ఎట్టి పరిస్థితుల్లోనూ మీరు పడగొట్టించి తీరాలి. లేకపోతే వాటిలోని ఇనుప సాకులు మీ పాలిటి చాకులై కాకుల్లా,బాకుల్లా మీకళ్ళను పొడుచుకు తింటాయి. అపుడు కన్ను పొడుచుకున్నా ఏమీ కనిపించదు. అపుడు మీ ఆవిడ కంచంలో ఎండిపోయిన వేపాకులను వేసినా పూతరేకులనుకుని నోట్లో పెట్టుకుంటారు. గ్లాసులో కషాయం పోసిచ్చి పరమాన్నం అని చెబితే నమ్మి తాగుతారు. ఎదురింటి బర్రె బామ్మగారిని చూపించి తానే అంటే వెళ్ళి గబగబ వాటేసుకుని చెప్పుదెబ్బలు తింటారు." హెచ్చరించాడు.

వెంకట్రావు గుండే ఝల్లుమన్నది.

తాను రెండు కళ్ళూ పోగొట్టుకుని గుడ్లు పైకెత్తి రెప్పల్ని టపటపకొడుతూ వంగిపోయిన చేపాటి కర్రను పట్టుకుని నడుస్తున్నట్లు, భోజనానికి పిలిచినపుడు అరమరలు కిటికీలు పట్టుకుని తడుముకుంటూ వెళ్ళి కంచం ముందు కూర్చోగానే సుందరి కంచంలో వేపాకుల్ని వేసి పాలకూర ఇగురు అని చెబితే వెంటనే తాను తింటున్నట్లు ఒక పీడ దృశ్యం ఎదురుగా మెరిసి చావుకేక పెట్టాడు.

"వద్దు భూషణంగారూ.. ఆ ఊహ నేను భరించలేను. నా కళ్ళు కావాలి. కళ్ళులేకపోతే కలియుగం లేదు." పిచ్చిగా పిల్లాడిలా అరిచాడు.

వా.వి.చా. కోపం ఎక్కువైంది.

"సుందరిగారూ.. పోగాలము దాపురించిన వారు మంచి మాటలు వినరంటారు. నామాట వినండి బెడ్‌రూమ్‌లోని బాత్రూమును కదిలించొద్దు. అది పెద్ద వాస్తు దోషమవుతుంది. ఒకవేళ బాత్రూమ్‌ను కదిలిస్తే ఇక ఈ జన్మలో మీకు పిల్లలు పుట్టరు. ఉన్న ఒక్కపిల్లా దక్కదు. అపుడు అందరూ వెంకట్రావు గారిని 'ఆకో' అని ఎగతాళి చేస్తుంటారు. చుట్టు పక్కల ఆడవాళ్ళంతా మిమ్మల్ని గొడ్రాలు అని




ఆడిపోసుకుంటారు. మీ గర్భసంచి పగిలి ఆపరేషన్ చేసి తొలగించవచ్చు. ఇక మీకు పిల్లలు పుట్టరని వంక పెట్టి మీ అత్తగారు మిమ్మల్ని ఇంట్లోంచి వెళ్ళగొడతారు." వివరంగా చెప్పాడు.

సుందరి నిలువెల్లా వణికింది.

ఒకరోజు ఆవకాయ ఎర్రగా కలుపుకుని తింటుండగా కడుపులో మంటలు రగిలి నొప్పి భరించలేక డాక్టర్ దగ్గరకు వెళ్లగానే ఎక్సురే తీసి గర్భసంచికి చిల్లు పడిందని ఆపరేషన్ చేసి తొలగించాలని డాక్టర్ చెప్పినట్లు, అత్తగారు కాళికా దేవిలా ఉగ్రరూపం ధరించి పిల్లలు లేని పిశాచి అని తనను తిడుతూ దుడ్డు కర్రతో చావగొట్టి ఇంట్లోంచి బయటకు నెడుతున్నా వెంకట్రావు పట్టించుకోకుండా చూస్తున్నట్లు పీడా కారపు సీను కనిపించి గొంతు పగిలేలా అరిచింది.

వాస్తుభూషణనికి మండిపోయింది. కాకి కష్టపడి తెచ్చుకున్న మాంసం ముక్కను గద్దతన్నుకుపోతున్నట్లు ఫీలై పళ్ళు పటపట కొరికాడు.

"వెంకట్రావుగారూ... పాతికేళ్ళ అనుభవంతో నేను చెబుతున్న మాటలు వినండి. గొర్రె కసాయి వాడిని నమ్మినట్లు వాడిని నమ్మి ప్రాణం మీదికి తెచ్చుకోవద్దు. ఆ బాత్రూమ్‌ను నిర్మూలించకపోతే ముప్పై అయిదు కూడా దాటకుండానే మీరు "చూడు పిన్నమ్మా పాడు పిల్లడూ" అని చెమ్మచెక్కలాడుతూ తలలో పూలు పెట్టుకున్న నలుగురిని వెంటేసుకుని బజార్ల వెంట తిరుగుతుంటారు. తస్మాత్ జాగ్రత్త!" త్రీవ స్వరంతో అన్నాడు.

వెంకట్రావు పక్షవాతం వచ్చిన వాడిలా విల విల లాడాడు.

వంటినిండా చీరకప్పుకుని, జాకెట్ వేసుకుని, కొప్పునిండా పూలు పెట్టుకుని, నుదుట రూపాయి కాసంత బొట్టు పెట్టుకుని కళ్ళనిండా కాటుక పులుముకుని, మరో పదిమంది అలాంటి వారిని వెంట బెట్టుకుని చప్పట్లు కొట్టుకుంటూ "ఓ బాయ్యో.. ఓ అక్కాయో.." అని అందరినీ పిలుస్తూ వయ్యారంగా నడుస్తున్న దృశ్యం కనిపించి శరీరమంతా చెమటలు పట్టాయి.

"వద్దు.. వద్దు..." భోరుమన్నాడు.

వా.వి.చా.. ఆగ్రహోదగ్రుడయ్యాడు.

"సుందరిగారూ.. అతను మిమ్మల్ని మోసం చేస్తున్నాడు. మీరు ఎట్టి పరిస్థితులలోనూ సిలెండర్ దిశను మార్చద్దు. దాన్ని అలాగే ఉంచండి. ఒకవేళ దాన్ని కదిలించినట్లయితే సిలెండర్ పేలిపోయి మీ సుకుమార శరీరం తునాతునకలై పోతుంది. కాలువెళ్ళి కాశ్మీర్లో, చెయ్యివెళ్ళి చెన్నైలో, ముక్కు వెళ్ళి ముంబాయిలో, నడుము నాగాలాండ్లో, పళ్ళు పాట్నాలో, చెవులు చండీఘర్లో, పుర్రె పూనాలో, చెంపలు వెళ్ళి పాతాళగంగలో పడతాయి. ఆ పార్టులన్నీ వెతికి పెట్టడానికి ఆర్మీ అంతా రంగంలోకి దిగినా సాధ్యం కాదు." అన్నాడు.

ఆ భీభత్స దృశ్యాన్ని ఊహించుకోగానే పేగులు తెగి పోయి పొట్టలోంచి బయటకు వచ్చినట్లయింది సుందరికి.

-(ఇంకావుంది)

# సరిగపదమని

కూర్పు : తెలికిచెర్ల రామకృష్ణ, విజయనగరం **16**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ● | 1 | ● | ● | ● | 2 | ● | 3 | 4 |
| 5 | | | | 6 | | | ● | |
| | ● | ● | | | ● | ● | 7 | |
| | ● | 8 | ● | 9 | 10 | | ● | ● |
| | ● | 11 | 12 | ● | | ● | 13 | 14 |
| ● | 15 | | | ● | ● | 16 | ● | |
| 17 | | ● | ● | 18 | ● | 19 | 20 | |
| ● | ● | 21 | | ● | 22 | ● | | ● |
| 23 | | | ● | 24 | | | ● | 25 |

పంపినవారి పేరు :..............................................

వయసు :........... వృత్తి :..............................................

చిరునామా :..............................................

..............................................

..............................................ఫోన్ :..............................

## నిబంధనలు:

ఎ) పోటీలో పాల్గొనగోరేవారు పైన ప్రచురించిన కూపన్‌తో పజిల్‌ను నింపి కవరులో పంపాలి. మరే విధంగా పంపినా ఆ ఎంట్రీ స్వీకరించబడదు.

బి) కవరుపై 'సరిగపదమని' అంటూ నంబర్‌తోసహా పేర్కొనటం మరచిపోకూడదు.

సి) ఏ బహుమతి కైనా ఒకరు కన్నా ఎక్కువగా విజేతలుంటే డ్రా తీయటం జరుగుతుంది.

విజేతల ఎంపిక ప్రతిసారి ఓ సినీ ప్రముఖునిచే...

This feature is sponsored by :

SOHAN MUSIC

**అడ్డం:-**

3. "జయం" సినిమాలో హీరోయిన్ (2)
5. మీరు నింపుతున్న శీర్షిక (7)
7. "సీతారామయ్య ....... మనవరాలు" (2)
9. అన్నమయ్య మరదళ్ళతో చివరగా పాడిన పాట ప్రారంభము (3)
11. "మనుషులు మారాలి"లో ".......యి నవ్వాలి పండగే రావాలి" (2)
13. "మనసంతా నువ్వే"లో హీరోయిన్ పేరులో మొదటి రెండక్షరాలు (2)
15. "అంతస్తులు"లో "తెల్లచీర కట్టుకున్న "పాటలో .....కం ఎరుగని మనసు కోసము" (3)
17. నా ...పూర్ణ .....శుద్ధ హృదయంతో నిను కొల్చు భాగ్యం ఇంకెప్పుడు ప్రభూ..' కీరవాణి రచించినది (2)
18. "విప్రనారాయణ"లో " ......విరహే తవదీనా" (1)
19. "దాగుడు మూతలు"లో "........... చిరునవ్వులు వద్దన్నాయి అబ్బా వుండన్నాయి" (3)
21. "ఏ దివిలో విరిసిన .....జాతమో" ఎస్.పి.బాలసుబ్రమణ్యం పాడిన పాట(2)
23. "సంతోషం"లో ఉష పాడిన "నే తొలి....... కలగన్నది" (3)
24. "యమహా నగరి కలకత్తాపురి" ప్రాట పారంభంలోని తొలి మూడక్షరాలు
25. '......కోసమే ఈ అన్వేషణ ......రాకకై ఈ ఆరాధన ' 'నువ్వునేను' చిత్రంలోనిది (1)

**నిలువు:-**

1. మిస్సమ్మలో " ..... శుద్ధ అశ్మ మహిమ వరపుత్ర గంటివమ్మా" (2)
2. "నీ లీల పాడెద దేవా" పాట చరణంలో "అను...... వరదాన శీల" (2)
4. దర్శకరత్న ఇంటి పేరు (3)
5. "భక్తతుకారాం" లో కాంచన అభినయించిన "...... పగలు తెలిసెరగదసలి" (4)
6. "బంగారు బొమ్మలు" లో బాలు, సుశీల ఆలపించిన "నేనీ....... నువ్వాదరిని కష్టమ్ము కలిపింది" (3)
8. "సంసారం" ఎన్.టి.ఆర్, జమున అభినయించిన ..".... పుట్టినరోజు మరపు రాని పండుగ రోజు" (3)
10. "దాన వీర శూర కర్ణ"లో ధుర్యోధనుని ఆయుధం (2)
12. ".........జాత సుమదాళాల పానుపు" "వీరాభిమన్యు"లో (2)
14 "బెంగాలి కోకిల బాల తెలుగింటి కోడలు పిల్ల ........సరోజిని" (3)
15. ఏసుదాసు పాడిన "........ చూపిన దేవత నాచేయి ఎన్నడు వీడక" (2)
16. "ఎర్రమల్లెలు", "మహాప్రస్థానం" చిత్రాల హీరో రంగారావు ఇంటి పేరులో మొదటి రెండక్షరాలు (2)
20. "ఏమి ఎరు..... గోపాలునికి ప్రేమలేవో నేరపినావు"(2)
21. "ముందడుగు" లో ఆత్రేయ గారు వ్రాసిన పాట "కోటలోన..... వేసావా చల్ పువ్వుల రంగా" (2)
22. "కంచుకోట"లో " .......లేరు నీకెవ్వరు" (2)

పజిల్, కూపన్ 15-04-2004 లోగా చేరాలి

**పంపవలసిన అడ్రసు**

'హాసం- హాస్య సంగీత పత్రిక'
502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాద్-500 018.

మొదటి బహుమతి (ఆల్ కరెక్ట్)




రెండవ బహుమతి (ఒక తప్పుతో)




మూడవ బహుమతి (రెండు తప్పులతో)




కన్సొలేషన్ బహుమతి (మూడు తప్పులతో)





ప్రముఖ గాయకుడు, స్వరకర్త
లలిత సంగీత విద్వాంసుడు,
వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-27402993

# లలిత సంగీతం

| | |
|---|---|
| రచన | : బసవరాజు అప్పారావు |
| గానం | : కె.బి.కె. మోహన్‌రాజు |
| సంగీతం | : కొచ్చెర్ల కోట సూర్యప్రకాశరావు |
| రాగం | : సింధు భైరవి - రాగ్ భైరవి (హిందుస్తాని సం॥) |
| తాళం | : చతురశ్రగతి (కర్ణాటక సం॥) కహరువా(హిందుస్తాని సం॥) |
| ఆరోహణ | : స రి గ మ ప ద ని స |
| అవరోహణ | : స ని ద ప మ గ రి స |

షడ్జము, శుద్ధరిషభం, సాధారణ గాంధారం, శుద్ధ మధ్యమం, పంచమం, శుద్ధదైవతం, కైశికి నిషాదం యీరాగంలోనిస్వరాలు. ఇవేకాక చతుశ్శృతి రిషభం, ప్రతిమధ్యమం,చతుశ్శృతి దైవతం కూడా యీరాగంలో వినియోగ మవుతాయి.

"హంసం" పత్రిక వెనుకటి సంచికలలో సింధుభైరవి రాగం గురించి విపులంగా ప్రస్తావించాను. సాలూరు రాజేశ్వరరావుగారు స్వరరచన గావించిన "ఆనందమే లేదా లోకమున" అన్న బసవరాజు అప్పారావుగారి గీతానికి ఆయన సింధుభైరవి రాగంలోని స,రి,గ,ప,ద అన్న స్వరాలకు ప్రాముఖ్యతనిచ్చి (అనగా అది భూపాల్ తోడి అనే హిందుస్తాని రాగమవుతుంది) బాణీని రూపొందించారు. అలాగే "ఓహో యాత్రికుడా" అన్న మల్లవరపు విశ్వేశ్వరరావు గారి రచనకు రాజేశ్వరరావుగారే మరొక విధంగా సింధుభైరవిని వాడుకున్నారు. ఇందులో స,రి,మ,ప,ద అనే స్వరాలకు ప్రాముఖ్యతనిచ్చి బాణీని కూర్చారు. ఈ రెండు గీతాలలో రాగం రెండు వినూత్న రూపాలను సంతరించుకుంది. ఇప్పుడు ప్రస్తావించబడుతున్న "ఈ మావిపైనుండి యీవు కూకూ యంచు" అనే గీతానికి కూర్చబడిన బాణీకి మరొక ప్రత్యేకత వున్నది. కర్ణాటక శాస్త్రీయ సంగీతంలో "గ్రహభేదం" అనే ప్రయోగం వున్నది. అంటే ఒక

**ఈ మావి పైనుండి యీవు కూ కూ యంచు**

ప॥ ఈ మావి పైనుండి యీవు కూ కూ యంచు
ఆ మావి పై నుండి ఆపె కూ కూ యంచు
ఏమి బాసల చేతురే కోకిలా ఏమి బాసల చేతురే

చ॥ ప్రకృతి జన్యంబులై పరమ రమ్యంబులౌ
భావముల, నొండొరుల ప్రణయ మొల్కెడునట్లు
పల్కరించుచు నుంటిరే కోకిలా పల్కరించుచు నుంటిరే

చ॥ మనుజులకగమ్యమై మహిత శక్తిం గల్గి
పరమామృతము ఒల్కు ప్రణయ వాక్కుల మీరు
బాసలాడుచు నుంటిరే కోకిలా బాసలాడుచు నుంటిరే

చ॥ చెంత గూర్చుని మోము చెలువుగుల్కగ వలపు
తెలుపుచుం బలుకంగ చెలి చెంత లేని నా
చింతలెన్నడు తీరునే కోకిలా చింతలెన్నడు తీరునే

చ॥ పాడవే కోయిలా పాడవే యింపుగా
ప్రాణముల్ హాయిచే పరవశమ్మొందగా
పాటపాడవె తీయగా కోకిలా పాట పాడవె తీయగా

రాగంలో ఆరోహణలో వుండే స్వరాలలో ఏదైనా ఒక స్వరాన్ని షడ్జముగా భావించి రాగం పాడితే వేరే రాగం వలె ధ్వనిస్తుంది. సింధుభైరవి లోని స రి గ మ ప ద ని అనే యీ స్వరాలలో రి -శుద్ధ రిషభాన్ని షడ్జముగా గ్రహిస్తే అక్కడనుంచి రి గ మ ప ద ని స రి - స్వరాలను రినిస అని, గనిరి అని యీవిధంగా అన్ని స్వరాలను పాడుకున్నట్లయితే అది కళ్యాణి రాగంగా ధ్వనిస్తుంది. ఈ పాటకు యిచ్చిన నొటేషన్‌ను పరిశీలిస్తే యీ విషయం అర్థమవుతుంది. ఈ ప్రయోగాన్ని స్వరకర్త ప్రకాశ రావుగారు యీ పాటకు కూర్చిన బాణీలో చాలా హృద్యంగా ఉపయోగించారు. పాడే గాయకులకు కాస్త క్లిష్టంగా వుండే అంశం యిది.

ఇలాంటి ప్రయోగం కేవలం ఒక ఫీట్ గా కాక అర్థవంతంగాను మనోహరంగాను చేశారు స్వరకర్త. సింధుభైరవి రాగంలో నేను రెండుపాటలకు గ్రహభేదం చేసి బాణీలు కూర్చాను. "ఇది చల్లని తల్లిరా" అనే పాటకు శుద్ధ దైవతాన్ని గ్రహం చేసి బాణీ కూర్చాను. అలాగే "కోయిల నీవైతే " అనే పాటకు శుద్ధరిషభం గ్రహం చేయడము, వివిధమైన కార్డ్ నోట్స్‌తో చరణాలకు బాణీ రూపొందించడమూ చేశాను. అవి బాగా పాప్యులర్ అయినాయి.

సింధభైరవి రాగంలో గ్రహభేద ప్రయోగం హిందీ చిత్ర గీతాల్లో నౌషాద్, శంకర్ జైకిషన్, సలిల్ చౌదరి,మదన్ మోహన్, సి.రామచంద్ర మొదలగు సుప్రసిద్ధ స్వరకర్తలు చేసినవి చాలావున్నాయి. తెలుగు,తమిళ చిత్రాలలో యీ రాగంలో యిటువంటి ప్రయోగం చాలా అరుదనే చెప్పాలి.

'ఈ మావిపై నుండి యీవు కూ కూ యంచు' అన్న యీగీతానికి యీ గ్రహభేద ప్రయోగం వినూత్న అందాన్ని చేకూర్చింది.

## కొచ్చెర్ల కోట సూర్యప్రకాశరావు

పశ్చిమ గోదావరిజిల్లాలోని నిడదవోలుకు సమీపానవున్న ఊనగట్ల అనే గ్రామంలో సుప్రసిద్ధ కర్ణాటక సంగీత విద్వాంసులు, స్వరకర్త అయిన కొచ్చెర్లకోట సూర్య ప్రకాశరావుగారు 1921 మే 11 నాడు జన్మించారు. విద్యనభ్యసించడానికి ఆ చిన్న గ్రామంలో అవకాశం లేనందున ఆయన కాకినాడలోని ఆంధ్ర సేవాసంఘం వారి సహాయంతో 3,4 సంవత్సరాలు చదువుకున్నారు. 1935వ సంవత్సరంలో ప్రఖ్యాత సినీ దర్శకులు సి.పుల్లయ్యగారు కిడ్డీ ప్రొడక్షన్స్ పేరిట 'సతీఅనసూయ' చిత్రాన్ని డైరెక్టు చేశారు. ఆ చిత్రంలో ప్రకాశరావుగారు అత్రిమహర్షి గా నటించారు. 1940లో యస్.యస్.యల్.సి. పూర్తి చేసి ప్రసిద్ధ సంగీత విద్వాంసులు శ్రీ క్రోవి సత్యనారాయణ శాస్త్రి గారి వద్ద కర్ణాటక సంగీతం



అభ్యసించారు. ఆ తరువాత 1954లో ఆకాశవాణి మద్రాసు కేంద్రంలో స్వరకర్తగాను, నొటేషన్ రైటర్‌గాను నియమింపబడ్డారు. 1981 వరకూ ఆ





కేంద్రంలో ఎన్నో సంగీతరూపకాలకు, చాలా లలిత గీతాలకు సంగీతాన్ని కూర్చారు.

0సుప్రసిద్ధ సినీ నేపథ్య గాయనీ గాయకులు పి.సుశీల, పి.బి.శ్రీనివాస్, ఎ.యం.రాజా, జిక్కీ మొదలగు వారే కాక ప్రఖ్యాత కర్ణాటక సంగీత విద్వాంసుడు స్వరకర్త అయిన జి.యస్.మణి కూడా ప్రకాశరావు గారి స్వర రచనలను గానం చేశారు. 1981లో పదవీవిరమణ అనంతరం హైదరాబాదులో స్థిర నివాస మేర్పరచుకున్నారు. అప్పుడు నాకు వారితో పరిచయమేర్పడింది. ఆ సంవత్సరమే వారు హైదరాబాదు కేంద్రంలో లలిత సంగీత కార్యక్రమానికి సంగీత దర్శకత్వం వహించారు. గాయకుడు కె.బి.కె. మోహన్‌రాజు చేత మూడు పాటలు పాడించారు. వాటిలోదే "ఈ మావి పై నుండి యావు కూ కూ యంచు" అనే బసవరాజుగారి రచన. ఆ కార్యక్రమాన్ని నేనే రికార్డు చేశాను. ఆ తరువాత ఎన్నెన్నో కార్యక్రమాలలో ఆయన పాల్గొన్నారు. దూరదర్శన్ కేంద్రంలో అనేక కార్యక్రమాలకు ఆయన సంగీతం కూర్చారు. ఆయన సారథ్యంలో మోహన్‌రాజు, విజయలక్ష్మీశర్మ మొ॥వారు పాడిన పాటలు బహుళ జనాదరణ పొందాయి.

విజయవాడ రేడియో కేంద్రంలో ఆకాశవాణి వార్షిక అవార్డు కోసం రూపొందించిన "కృష్ణవేణి" సంగీత రూపకానికి ప్రకాశరావుగారు సంగీతం కూర్చగా ఆ ఏడాది ఆ రూపకానికి మొదటి బహుమతి లభించింది.

1988 నుంచి పద్మశ్రీ శ్రీమతి శోభానాయుడు నిర్వహించే కూచిపూడి ఆర్ట్ అకాడమికి ఎన్నో బాలేలకు సంగీత దర్శకత్వం వహించారు. అపారమైన వారి పాండిత్యమూ ప్రతిభా ప్రతి కార్యక్రమంలోనూ విదితమై రసికజనుల ప్రశంసలకు పాత్రమైనాయి. వారు కూర్చిన బాణీలు కర్ణాటక సంగీత రాగాలే కాక హిందుస్తానీ సంగీతం లోని అనేక రాగాలతో కూడా రూపొందినవి చాలా వున్నాయి. సునిశితమైన స్వరాల నిర్మాణం తో కష్టమైన క్లిష్టమైన బాణీలను చాలా హాయిగా మనసుకు హత్తుకునేలా మలచగల ఘనత ఆయనది. బాణీలెంత విశిష్టతతో వుంటాయో వాటికి తగినట్లుగా ఆర్కెస్ట్రాను రూపొందించే గొప్ప సామర్థ్యం కూడా వారిలో చూశాను.

1999లో ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక శాఖవారు నిర్వహించిన బాలేకి ప్రకాశరావుగారు సంగీతం సమకూర్చిన తరువాత ప్రస్తుత కాలంలో 83 సంవత్సరాల వయోభారం చేత విశ్రాంతిని తీసుకుంటున్నారు. వెనుకటి తరం వారిలో లలిత సంగీతంలో నిష్ణాతులైన కొద్దిమంది స్వరకర్తలలో ఒకరైన ప్రకాశరావుగారు అతి నిరాడంబరులు. సంప్రదాయంతో పాటు నవ్యతను కూడా ఆదరిస్తూ మిళితం చేసి అద్భుతమైన బాణీలు కూర్చిన మేధావి వారు. వారు కూర్చిన సంగీతం నుండి విద్యార్థుల నేర్చుకోదగినవి చాలా విశేషాలున్నాయి. వారితో నాకు కలిగిన సాన్నిహిత్యానికి నేనెంతో గర్వపడుతూంటాను.

**సింధుభైరవి రాగం ఆధారంగా కొన్ని చిత్రగీతాలు 1-15 మే, 2002 'హాసం' సంచికలో పేర్కొనబడి నాయి.**

**ఈ రాగంలో గ్రహభేదంతో కూర్చబడిన కొన్న హింది చిత్రగీతాలు**

| పాట | చిత్రం | గానం | స్వరకర్త |
|---|---|---|---|
| 1.ఆజా అబ్ తొ ఆజా | అనార్కలి | లత | సి. రామచంద్ర |
| 2.రులాకర్‌చల్‌దియే | బాద్‌షా | హేమంత్‌కుమార్ | శంకర్‌జైకిషన్ |



జంతువులు మనగురించి మాట్లాడేది తెలిసిపోతే ఎంత తమాషాగా ఉంటుందో వివరించే...

పిల్లల కోసం ప్రత్యేకం...



బాల్యపు లేతదనం మళ్లీ కోరుకునే పెద్దలకు మరీ మరీ ప్రత్యేకం

# డాక్టర్ డూలిటిల్



నవలీకరణ
ఎమ్బీయస్ ప్రసాద్

చిత్ర పరిచయం 2

సమన్వయం
మంజీర

### జరిగిన కథ

జాన్ డూలిటిల్ అనే అబ్బాయికి చిన్నప్పుడు జంతువుల భాష అర్థమయ్యేది. పెంపుడుకుక్కతో కబుర్లాడడం అదీ జంతువులను చూసి తండ్రికి చిరాకేసి కుక్కను పంపించి వేశాడు. క్రమంగా జాన్ పశువుల భాష మర్చిపోయాడు. పెరిగి పెద్దయి డాక్టరయ్యాడు. అతనికి భార్య, ఇద్దరు కూతుళ్లు. ఓ శుక్రవారం సాయంత్రం వారిని ఫామ్‌హౌస్‌కు పంపించి, రాత్రి ఓ కేసు అటెండయి వస్తూంటే ఓ కుక్క కారు కడ్డం పడింది. బ్రేకు వేసి యాక్సిడెంటు తప్పించి వెళ్లిపోతూంటే కుక్క తిట్టిన తిట్టు అతనికి అర్థమయ్యింది. ఇక చదవండి.

జాన్‌కి ఆ క్షణంలో తెలియలేదు కానీ పశుపక్ష్యాదుల భాష అర్థం చేసుకునే శక్తి దానంతట అదే అతనికి తిరిగివచ్చింది. అందుకే చావు తప్పి కన్ను లొట్టబోయిన కుక్క పెట్టిన శాపనార్థాలు అతనికి అర్థమయ్యాయి. అసలే నిద్రమత్తులో, చిరాకులో ఉన్నాడు కాబట్టి దాని గురించి ఎక్కువ ఆలోచించే ఓపిక లేకపోయిందతనికి.

మర్నాడే పెద్ద హాస్పిటల్ వాళ్లతో మీటింగ్. గార్డెన్ రెస్టారెంట్‌లో కూచున్నారు, జాన్ డూ లిటిల్, అతని ఇద్దరు భాగస్తులు, వారితో బాటు వీళ్ల హాస్పిటల్ టేకోవర్ చేసుకోవడానికి వచ్చిన పెద్దమనుష్యులు. మాటలు సాగుతూండగానే **'నీకు కాస్త బ్రెడ్ కావాలా?'** అన్న మాటలు వినబడ్డాయి జాన్‌కి.

ఆ మాటలన్నది నిజానికి అతని నెత్తి మీద ఎగురుతున్న పావురం. తనతో బాటు ఎగురుతున్న గర్ల్‌ఫ్రెండ్‌ను ముద్దు చేయడానికి అడిగింది. కానీ జాన్ మాత్రం తనమీద ప్రేమతో కొలీగ్ అన్నాడేమోననుకుని 'వద్దులే' అన్నాడు అతి ఉదారంగా. 'ఏమిటి వద్దు?' అన్నాడు కొలీగ్ తెల్లబోతూ. 'అదే బ్రెడ్ అడిగావుగా, వద్దంటున్నా' అని చెప్పాడు జాన్ వాడికింత మతిమరుపేమిట్రా అని ఆశ్చర్యపడుతూ.

ఈ టేకోవర్ వ్యవహారం కాదు కానీ వీడికి మతిపోయినట్టుంది అని జాలిపడ్డాడు కొలీగ్. ఎందుకంటే హాస్పిటల్ టేకోవర్ అయితే ఉద్యోగాలకు ముప్పువస్తుందని హడిలి ఛస్తున్నారు వాళ్లు.

ఈ లోగా గాలిలో షికారు ఆపి జాన్ పక్కన గట్టుమీద వాలిన పావురాల జంటలో మగపావురం బెట్టు చేస్తున్న తన ఫ్రెండ్‌ని మళ్లీ బతిమాలింది - **'జామ్ వేసుకుని బ్రెడ్ తిని చూడు'** అని. ఈ సారి కూడా జానే జవాబిచ్చాడు. 'జామ్, గీమ్ ఏమీ వద్దు' అని. కొలీగ్ ఏదో అడగబోయి జాలిపడి ఓ నిట్టూర్పుతో సరిపెట్టాడు.

అతని వరస చూసిన జాన్‌కి అనుమానం వచ్చింది. తన వెనక్కాల వున్నవాడిని ఎవడినైనా చూసి జాలిపడుతున్నాడా అని. తిరిగిచూస్తే పావురాల జంట రొమాన్సు కంటబడింది. ఆ పావురాల భాష తనకర్థమయిపోతోందానన్న అనుమానం వచ్చేసింది. పరిస్థితి అయోమయంగా ఉంది. ఓ పక్క వచ్చిన వాళ్లు స్టాఫ్ గురించి, డబ్బు గురించి తెగ మాట్లాడేస్తున్నారు. ఇంకోపక్క పావురాలు తెగ ఊహు ఊసులాడుకుంటున్నాయి. టేబులు కింద ఉడతలు గింజల విషయంలో తగాదాపడుతున్నాయి. రేడియోలో మూడు, నాలుగు స్టేషన్లు కలగాపులగమయిపోయి ప్రసారమయినట్టనిపించి చెవులు మూసుకోబోయాడు.



అంతలో **"ఇదిగో నేను ఎగురుతున్నాను. నువ్వూ జాగ్రత్తగా చూసుకుని రా."** అని మగపావురం అనగా వినబడింది. 'అబ్బే, ఇదంతా భ్రమ' అని జాన్ తనకు తాను నచ్చచెప్పుకుంటూండగానే పావురం ఎగరడం, దాని వెనుకనే ఆడపావురం ఎగరడం కనబడింది. జాన్ ఉలిక్కిపడ్డాడు. అంటే ఇది భ్రమ కాదేమో! అనిపించింది. తల తిరిగినట్టనిపించింది. లేచాడు. 'ఒంట్లో బాగాలేదు. వస్తా' అన్నాడు.

అతని కొలీగ్స్, వచ్చినవాళ్లు తెల్లబోయారు. ఎన్నో



ముఖ్యమైన విషయాలు మాట్లాడవలసివుంది, వెళ్లిపోతానంటాడేమిటాని. కానీ అప్పటికే అతని అయోమయం రుచిచూసివున్న కొలీగ్స్ ఇతను అవకతవకగా మాట్లాడకుండా పంపించివేస్తే మంచిదనుకుని 'సరే, వెళ్లిరా' అనేశారు.

గందరగోళం నుండి భూగోళానికి దిగి అలా అలా నడుచుకుంటూ వచ్చి కారెక్కబోయాడు జాన్. అంతలో 'త్వరగా బండి తీయి బాబూ' అని వినబడింది. పక్కకు చూస్తే గుర్రం!

'బాబోయ్, నిన్న కుక్క చేత మాటలు పడ్డాను, ఇవాళ గుర్రం చేత కూడానా!?' అని ఉలిక్కిపడ్డాడు జాన్.



'పోవోయ్ పుల్లాయ్, నా ఇష్టం' అని గుర్రానికి చెప్పేద్దామని తల బయటకు పెట్టేనరికి ఆ గుర్రాన్ని అధిరోహించిన ట్రాఫిక్ పోలీసు కనబడ్డాడు. 'కారు ఇక్కడ పార్కింగ్ చేయకూడదని తెలియదా?' అని తిట్టాడు. ఇందాకా బండితీయమని అదలించిన గొంతు అదే!

జాన్‌కు కోపం రాలేదు. నవ్వు వచ్చింది. తనూ తన పగటికలలూ! ఇందాకా పావురం మాట్లాడిందనుకున్నాడు. నిన్నరాత్రి ఏ తాగుబోతువాడో తిడితే కుక్క తిట్టిందనుకున్నాడు. ఇప్పుడు గుర్రం అనుకున్నాడు. ఏడిసినట్టుంది. ఎవడికైనా చెబితే నవ్విపోతారు. జంతువులు మాట్లాడడం, తను వినడం! పైగా సమాధానం చెప్పడం!

పోలీసువాడికి సారీ చెప్పేసి జాన్ రయ్యిన ఇంటికి వచ్చేశాడు. తన కుటుంబం పిక్నిక్‌కువెళ్లిన ఫామ్‌హౌస్‌కు ప్రయాణం కట్టాడు. రాత్రి పట్టుకుని జాగ్రత్తగా బోనులో పెట్టిన గినీదా పిగ్ (సీమఎలుక) పిల్లను కారులో పక్కసీటులో పెట్టుకుని కారు నడపసాగేడు. కారు శివారువైపు మళ్లాక ఎవరో అన్నారు -

**"హమ్మయ్య, కాస్త చల్లగాలి తగిలిందిరా బాబూ"**



"అదే మరి, సిటీలైఫంటే! అక్కడ ఉక్కిరిబిక్కిరవుతున్నా తెలిసి చావదు. ఇలా బయటకు వచ్చినప్పుడే.." అంటూండగానే జాన్‌కి తట్టింది, కార్లో తను తప్ప వేరే మనిషి లేడని. ఆ మాటకొస్తే తన పక్క ఎలుకపిల్ల తప్ప వేరేప్రాణిలేదని. దానికేసే ఆశ్చర్యంగా చూశాడు.

ఆశ్చర్యపోయింది జాన్ మాత్రమే కాదు, ఎలుకపిల్ల రోనీ (జాన్ కూతురు పెట్టిన పేరు) కూడా అతని ఆశ్చర్యంలో పాలు పంచుకుంది. తను చేసిన కామెంటును సీరియస్‌గా తీసుకుని ఏకీభవించిన నరమానవుడు వీడెవడ్రా అని ముఖం పెట్టింది. దాని ముఖం చూడగానే జాన్‌కి తెలిసిపోయింది. తను ముచ్చట్లాడుతున్నది ఓ ఎలుకపిల్లతోనని. ఆ నిజాన్ని హరాయించుకోలేక మతిపోయి సడన్‌గా బ్రేక్ వేశాడు. కారు ఒక్క కుదుపుతో ఆగింది.



**"చచ్చాంరా దేవుడా, నీ హడావుడి కాదు కానీ నా నడ్డి విరక్కొట్టేసావు కదరా నాయనా"** అని తిట్టింది రోనీ.

జాన్‌కి ఇంకా నమ్మబుద్ధి కావటం లేదు. "ఇదంతా కల, మిథ్య, నేను కారు నడపడం మిథ్య, ఈ ఎలుక పీనుగతో మాట్లాడ్డం అంతకన్న మిథ్య." అని తనకు తాను నచ్చచెప్పుకుంటున్నాడు.

ఎలుకపిల్ల రోనీ కూడా ఇంచుమించు అదే మానసికస్థితిలో ఉంది. వేదాంతం అదీ తెలియదు కాబట్టి మిథ్యలాటి భ్రమల్లో పడలేదు. చదువురాదు కాబట్టి నిజానిజాల్ని నిజాయితీగా చూడగలిగింది. **"ఆగాగు, నువ్వు మాట్లాడుతున్నావు. నాకు అర్థమవుతోంది. నేను మాట్లాడుతున్నాను. నీకు అర్థమవుతోంది. ఎందుకిలా జరుగుతోంది చెప్మా"**అని ఆశ్చర్యపడింది.'ప్రకాశముగా'

కాస్సేపటికి జాన్‌కి సర్వమూ అర్థమయిపోయింది. తను చిన్నప్పటిలాగానే జంతువులతో సంభాషించగలుగుతున్నాడని తెలుసుకున్నాడు. చిన్నప్పుడు వాళ్ల నాన్న ఓ సైకియాట్రిస్టు దగ్గరకు తీసుకెళ్లి జంతువులభాష మర్చిపోయేట్లు చేశాడు. ట్రీట్‌మెంటు పూర్తవగానే "ఇక ఇప్పటినుండీ నువ్వు నార్మల్ అయిపోయావ్. నీ భావి జీవితానికి ఇది అడ్డురాదు." అని హామీ ఇచ్చాడు డాక్టరు. ఆ మాట తలచుకునే ఏడ్చాడు జాన్ -



"అప్పుడాయన అన్న మాట వట్టిదయిపోయింది. పదిహేనేళ్లు పోయినతర్వాత మళ్లీ,, ఇలా.. నా కర్మ.. ఇలా ఎంతకాలమో" అని.

చెట్టంత మనిషి అలా కన్నీళ్లు పెట్టుకోవడం రోనీను కదిలించింది. **"కూల్ డౌన్, కూల్‌డౌన్. అలా ఏడవచ్చా..చ్చొ, చ్చొ"** అని ఊరడించబోయింది.

మొగుడు కొట్టినందుకు కాదు తోటికోడలు దెప్పినందుకు అన్నట్టు జాన్‌కి ఈ ఎలుకపిల్ల సానుభూతి మరింత ఒళ్లు మండించింది. కారులోంచి కిందకు దిగి 'నువ్వు ముందు దయచేయి' అంటూ ఆ బోనుతో సహా దాన్ని బయటకు లాగేడు. 'నీ దారి నువ్వు చూసుకో' అంటూ ఆ బోను కిందపెట్టబోయాడు.

పాపం జాన్‌కి తెలియదు, ఎవడైనా మనిషి తన కిష్టం లేని ఎలుకపిల్లను వదుల్చుకొని వెళ్లి పోదామంటే అంత సులభం కాదని. లోకంలో జనాలకు అక్కర్లేని విషయం లేదు. ఇక్కడెవరో బోను పట్టుకుని తిరుగుతూంటే మాకేమని వెళ్లిపోరు.



దారిలో పోతున్న ఓ దానయ్య, దానమ్మలు "సాయమేమైనా కావాలా?" అని వాకబు చేయబోయారు.

ఎలుకతో ప్రాణ సంకటం వచ్చినవాడిలా మొహం పెట్టి జాన్, "అబ్బే, డ్రైవ్ చేసి, చేసి కాళ్లు పట్టేస్తేనూ..." అని సంజాయిషీ ఇచ్చుకున్నాడు. ఇంతలో దానమ్మ చేతిలో కూరలబుట్ట చూడగానే రోనీకి నోరూరింది. **"ఇదిగో, ఆవిడ దగ్గర ఆకుకూరలేమైనా ఉన్నాయేమో కనుక్కో'.** అని జాన్‌కి పురమాయించింది.

జాన్‌కి ఒళ్లుమండిపోయింది. "నోర్మూసుకో. నీ ఎలకమొహానికి ఆకుకూరలూ గాడిద గుడ్డూనూ..అసలా నోరు చూడు బొచ్చేసుకుని అసహ్యంగా..దానికితోడు వాగడం ఒకటీ.." అంటూ తిట్టిపోశాడు.

దానయ్య అండు కో లకు ఇటుచూస్తే ఓ ఎలుకపిల్ల బోనులోంచి కిచకిచలాడుతోంది. అటు చూస్తే ఓ పెద్దమనిషి - పిచ్చీగిచ్చీ ఏమీ ఉన్నట్టు కనబడని మనిషి - దానిమీద అరుస్తున్నాడు. ఇతరుల విషయాలలో ఆసక్తి కనబరచడంలో ఆడవారే అగ్రస్థానంలో నిలుస్తారు కాబట్టి దానమ్మ ముందంజ వేసి -



''మీరు బాగానే ఉన్నారు కదా" అని అడిగి చూసింది.

"అఫ్‌కోర్స్, అఫ్‌కోర్స్, ఐ యామ్ ఫైన్'' అని చెప్పుకోవలసి వచ్చింది జాన్‌కు.

"పోన్లెండి, గాలీధూళీ సోకకుండా ఉంటే మంచిదే!" జాలి కనబరచింది ఆవిడ.

గాలి సోకకుండా ఇలా గాలితో మాట్లాడేవాళ్లను ఏమంటారో జాన్‌కు తెలియనిది కాదు. తనకా లక్షణాలు లేవని తెలియబరచడానికి విశాలంగా నవ్వాడు. అంతకన్నా విశాలంగా చెయ్యూపాడు. "నా పట్ల మీకున్న శ్రద్ధకు మీకివే జోహార్లు" అన్న భావం తోచేట్లు "థాంక్యూ, థాంక్యూ సోమచ్" అని చెప్పి 'ఇక కదలండి, వెళ్లి మీ పని చూసుకోండి.' అని స్ఫురించేట్లు, 'గుడ్‌బై' అని కూడా అన్నాడు.

వాళ్ల అదోలాచూసి 'ఎవరి కర్మ వారనుభవింపక తప్పదరన్నా' **'ఎవరు చేసిన కర్మ వారనుభవించకాఎవరికైనను తప్పదన్న'**అన్న స్టయిల్లో భుజాలెగరేసి వెళ్లిపోయారు.

**"మరి మన సంగతేమిటంటావ్ గురూ"** అంది రోనీ కొంటెగా!

ఆ వెటకారానికి, తన చేతకానితనానికి జాన్‌కి కోపం వచ్చింది. విసురుగా బోను నేలమీద పెట్టేసి రయ్యిన కారు ఎక్కేశాడు.

ఎలుకపిల్ల నాలుక కరుచుకుంది. **"హే, హే, వెళ్లిపోతున్నావా ఏమిటి? ఎక్కడో వెర్రాడిలా ఉన్నావే! ఆగాగు."** అని అరిచింది.

జాన్ కారు స్టార్టు చేశాడు. రోనీ బతిమాలుకుంది. **"ఇక్కడ వదిలేకయ్యా బాబూ, బాగా వేడిగా ఉంది. వడదెబ్బ కొడుతుందేమో"** అని.

కానీ జాన్ ఎవరిమాటా వినే మూడ్‌లో లేడు. కారును ముందుకు ఉరికించాడు. ఇక రోనీ బ్రహ్మాస్త్రం ప్రయోగించింది. వైద్యవృత్తి చేపట్టబోయేముందు డాక్టర్లు చేసే ప్రతిజ్ఞ గుర్తుకు తెచ్చుకుని, **"ఇదిగో డాక్టర్, నేనొక నిస్సహాయ జంతువును. పైగా ఒంటరిదాన్ని. డాక్టరయ్యుండి ఒక లోన్లీ ఏనిమల్‌ని ఇలా విడిచిపెట్టి వెళ్లడం నీకు ధర్మమేనా?"** అని అరిచింది.

డాక్టర్ జాన్ డూలిటిల్ (డూలిటిల్ అతని ఇంటిపేరు, డాక్టరు అతని వృత్తి) చెవిన ఈ మాటలు



పడగానే కాలు ఆటోమెటిక్‌గా బ్రేక్ మీద పడింది. జీవకారుణ్యమే స్వభావంగా ఉండవలసిన డాక్టరయివుండి తను ఇలా చేయ వచ్చునా అనిపించిందతనికి. కారు ఆపేడు.

కారాగగానే తన ట్రిక్కు పారినట్టు ఎలుకపిల్లకు తెలిసిపోయింది. ఇక అతని మానవత్వంమీద హిప్నటైజ్ చేయసాగింది. **"రా, ఆగావెందుకు, వచ్చి రక్షించు. నేను నీ ఫ్రెండుని, ఐ యామ్ యువర్ బడ్డీ, కమాన్. జాగ్రత్తగా రివర్స్ చేసుకు రా."**

అప్పటికే జాన్ రివర్స్ చేస్తున్నాడు. రోనీ సిగ్నల్స్ ఇచ్చేయసాగింది.

**"కాస్త వెనక్కి, పక్కకు కొయ్యి, చూసుకో, చూసుకో నా మీదకు వచ్చేసేటట్టున్నావ్..బోను విరిగిపోయిందంటే నీకే నష్టం..."**

జాన్ కారుదిగి బోను దగ్గరకి వచ్చాడు.రోనీ అతన్ని చివాట్లేసింది - "భలేవాడివయ్యా, హడలగొట్టేశావు కదా" అని.

జాన్‌కి అంతా గందరగోళంగా, తికమకగా ఉంది. పైగా ఈ ఎలుకపిల్ల వాగుడు అతనికి ఏమీ తోచనీయకుండా పిచ్చి ఎక్కించేస్తోంది. బోను పైకెత్తి పట్టుకుని వార్నింగిచ్చాడు - "షటప్..చుప్.., నోరెత్తితే తంతాను జాగ్రత్త. ఇంకో మాట పెగిలావా, ఇక్కడే ఈ నడిరోడ్డులో వదిలేసి పోతాను. వెధవ సంతా నువ్వూనూ.."

జాన్ మూడ్ బాగాలేదని, తిక్కరేగితే అన్నంతపనీ చేస్తాడనీ గ్రహించిన రోనీ**"సరే, సరే, నోరెత్తితే ఒట్టు"** అని ప్రామిస్ చేసింది.

కానీ ఈ వాగుడుకాయ ఎలుకను జాన్ నమ్మదలచుకోలేదు. తన పక్క సీట్లో కూచో బెట్టుకుంటే వాగి, వాగి హింసపెట్టేస్తుందని భయం వేసి కారుకి పైన తాడేసి కట్టేశాడు. కారు పోనిచ్చాడు.



హాయిగా లోపల కూచోవలసిన తను ఇలా ఎండకు మాడడం రోనీకు రుచించలేదు. ఊరికే సణగడం మొదలెట్టింది. **''అబ్బ అంత స్పీడేమిటయ్యా బాబూ,"** **''చూసుకో, ఎదరగా వస్తున్న బళ్లు చూసుకుని నడుపు'' ''కాస్త స్లోగా వెళితే నీ సొమ్మేం పోయింది"** ..ఇలా ఏదో ఒకటి వదరుతూనే ఉంది.

ఇదంతా జాన్‌కు భరించశక్యం కావటంలేదు. "నీ వెధవ వాగుడు కట్టిపెడతావా లేదా" అని హుంకరించాడు.

**"ఓ డాక్టర్, నాకిక్కడ ఎంత కష్టంగా ఉందో నీకు తెలియదా"** అని డాక్టరు సెంటిమెంటుకు దెబ్బకొట్టింది మూషికమూర్తి.

"నీ వెధవ కబుర్లాపు. ఇంకో మాట మాట్లాడావో కట్లిప్పేసి, బోను తెరిచేసి ప్రపంచంలోకి వదిలేస్తాను. మా అమ్మాయి గదిలో నీడపట్టున వెచ్చగా కూచుని వేళకు తిండి పెడితే మప్పితంగా తిన్నట్టు కాదు, అసలైన జంతువులతో పోట్లాడితే, జీవనపోరాటం అంటారు చూడు అదేమిటో తెలుస్తుంది నీకు. ఉడతలు కూడా వచ్చి నిన్ను తన్ని నీ తిండి లాక్కుంటాయి. ఎలకగా పుట్టి కుక్కచావు ఛస్తావు. అప్పుడు చెబుదువుగాని కబుర్లు. హు.."అంటూ లెక్చరిచ్చాడు జాన్.

మూతి విరుచుకుంది ఎలుకపిల్ల. కష్టపడి బుంగమూతి పెట్టి **"సర్లే నీకంత కష్టంగా ఉంటే మాటలాడనులే, పాటలు పాడుకుంటాను."** అంది. అని అన్నంతపనీ చేసింది. పెద్దగొంతేసుకుని పాటలు మొదలెట్టింది.



**"గాలి నడగనా నా**
**ప్రశ్నకు బదులేదని**
**గినీ పిగ్ అన్న పేరు**
**ఈ ఎలక కేలనని**
**ఇటాలియన్నూ కానే,**
**టెక్సన్ని కానే**
**అయినా పలుగాకుల**

ఈ లోకం
కోడై కూస్తుందే - గినీ..గినీ.."

జాన్‌కి తిక్కరేగింది. ఈ మూషికగానానికి విరుగుడుగా తన కారులో స్టీరియో ఆన్ చేశాడు. దానిలో వచ్చేపాటతో గొంతు కలిపి గట్టిగా టాపు లేచిపోయేట్లు పాడడం మొదలెట్టాడు. అతని ప్రయత్నమే అతనిది కానీ టాపు లేచిపోలేదు. దానికి పైనా కిందా సంగీతతరంగాలే కావడంతో నిలబడింది.

* * *



ఇక్కడ పిక్నిక్‌లో జాన్ పెద్దకూతురు పెప్సీకా పాట పెట్టుకుని డాన్స్ చేస్తోంది. చిన్న కూతురు మాయా జగ్‌లో నీళ్లు పట్టుకుని తిరిగేస్తోంది. జాన్ భార్య మావగారికి ఏదో వండిపెడుతోంది. ఇంతలో మాయాకు ఓ సందేహం వచ్చి తాతగారి దగ్గరకి పరిగెత్తుకుని వచ్చింది.

"నాన్నకు అథార్టీ చేయడం బాగా అలవాటు కదా, ఆ పోలిక నీ దగ్గర్నుంచి వచ్చిందా, నాయనమ్మ నుండి వచ్చిందా?" అని అడిగింది.

"నాయనమ్మ చచ్చి ఏ లోకాన వుందో, ఆవిణ్ణి అనుకోవడం ఎందుకు? ఏమైనా అనదలచుకుంటే నన్నే అను." అన్నాడు ముసలాయన నిట్టూర్చి.

"తాతగారితో అలా మాట్లాడచ్చా?" అని తల్లి మందలిస్తూండగానే జాన్ కారు దూసుకువచ్చింది. లోపల చెవులుబద్దలయ్యేటంత సౌండుతో స్టీరియో మోగుతోంది. అందరూ తెల్లబోయి చూస్తూండగానే జాన్ కారు దిగి 'హే ఐ యామ్ హియర్' అని అరుస్తూ పరిగెట్టుకుని వచ్చాడు.

తండ్రిపై కంటె పెంపుడు ఎలకపైనే ధ్యాస ఎక్కువ కాబట్టి "రోనీ నేమిటి ఎండలో పెట్టావ్?" అని విసుక్కుంటూ మాయా కారు వద్దకు ఉరికింది.



"గాలి బాగా తగులు తుందని పెట్టానమ్మా" అని కూతురికి సంజాయిషీ ఇచ్చుకుంటూ జాన్ భార్యను దగ్గరకు తీసుకుంటూ తండ్రిని 'హలో డాడీ' అని పలకరించాడు.

**'గాలా, గాడిదగుడ్డా? కావాలని నన్నిక్కడ పడేసి...వట్టి క్రేజీ ఫెలో, సైకోలా వున్నాడు...'** అని పెద్దగొంతుకేసుకుని రోనీ అరిచేస్తోంది. ఆ గోల తక్కినవాళ్లకు అర్థం కాదు కానీ జాన్‌కు తెలుస్తోంది. ఎలుక వాయిస్ వినబడకుండానూ, మాట మార్చడానికీ గట్టిగా అరవసాగేడు - "నాన్నా చిన్నప్పుడు మనింట్లో బీగీ గన్స్‌తో ఆడుకునేవాళ్లం కదూ..మరేమో..అవే కాకుండా..."

కొడుకు వాలకం చూసి తండ్రి నిట్టూర్చాడు. పనిలో అలసటవల్ల పిచ్చిపిచ్చిగా మాట్లాడుతున్నాడని జాలిపడ్డాడు. "జాన్, నీకు వెకేషన్ చాలా అవసరం..."అని ఏదో చెప్పబోయాడు.

"...అందుకేగా పిక్నిక్‌కి వచ్చింది.."అంటూ జాన్ తన పెద్దకూతురు డాన్స్ చేస్తున్నచోటుకి పరిగెట్టి తనూ డాన్స్ చేయడం మొదలెట్టాడు.

* * *

రాత్రి నిద్రపోవడానికి ముందు మౌత్‌వాష్ పెట్టి నోరు కడుక్కుంటున్నాడు జాన్. భార్య పక్క వేస్తోంది.



"మాయా పెంచే ఆ ఎలక పిల్లను వదిలించుకుంటే మంచిది" అన్నాడు జాన్.

"అబ్బ, బోల్డుసార్లు చెప్పాను. అది ఎలక కాదు, ఎలకజాతికి చెందినదే కానీ.. సౌత్ అమెరికా వెరయిటీ. గినీ పిగ్ అంటారు, దాని గురించి మీకెందుకింత తపన?"

"తపన కాదు నా మొహం..ఒళ్లుమంట" అని అనబోయాడు కానీ నోట్లో వున్న మౌత్‌వాష్ అతన్ని మాట్లాడనివ్వలేదు. బ్లక్, బ్లక్ అని రెండుసార్లు అన్నాక ఇకలాభం లేదని బాత్‌రూమ్ కెళ్లి నోరు కడుక్కునివచ్చి తను అనదలచుకుని అనేశాడు.

'ఏదో ఒకటి, ఏదైతేనేం..ఉండండి, వస్తాను" అంటూ ఆమె బయటకు వెళ్లింది.

భార్య త్వరగా వస్తే పక్క మీదకు చేరవచ్చని చూస్తున్న జాన్‌కి బాల్కనీ నుండి ఓ కేక వినబడింది, "ఏమండోయ్, ఇదిగో ..ఏమండోయ్, మాట " అని.



జాన్ బాల్కనీలోకి వచ్చి చూస్తే ఓ గుడ్లగూబ కనబడింది. చెట్టుకొమ్మ మీద వాలివుంది. **"అమ్మయ్య, వచ్చారా"** అంది జాన్‌ను చూడగానే.

జాన్‌కి మతిపోయింది. "హరి దేవుడా!" అనుకున్నాడు.

జాన్ ఆశ్చర్యాన్ని వట్టించుకోకుండా గుడ్లగూబ ఎగిరివచ్చి అతనికి దగ్గర్లో ఉన్న కుర్చీమీద వాలింది. **"మా భాష అర్థమయ్యే పెద్దమనిషి మీరే కదూ"** అంటూ పలకరించింది.

'ఇదెక్కడి గోలరా' అనుకుంటూ "నువ్వేం మాట్లాడుతున్నావో ఒక్కముక్క అర్థం కావటం లేదు" అన్నాడు జాన్ చికాగ్గా. కానీ గుడ్లగూబ నమ్మలేదు.

**"అడివంతా మీ గురించే చెప్పు కుంటు న్నారు, తెలుసా"** అంది.

జాన్‌కు ఏమీ పాలుపోక ఫామ్‌హౌస్ చుట్టూ ఉన్న దట్టమైన అడివికేసి చూపు సారించాడు.



**ఇదిగో ఓ సాయం చేసిపెట్టు బాబూ, ఈ పుల్లముక్క తీసిపెడుదురూ, బాబ్బాబు."** అంది గుడ్లగూబ ప్రాధేయపడుతూ.తన రెక్క విప్పి చూపించింది. ఓ పుల్లముక్క దాని రెక్కలో గుచ్చుకుని వుంది.

అది చూసి జాలి వేసినా దగ్గరకు రావడానికి జాన్ సంకోచిస్తుంటే "భయపడకు, నేనేమీ పొడవనులే" అని హామీ ఇచ్చింది.

ధైర్యం తెచ్చుకుని జాన్ ఆ పుల్లను పీకి పారేశాడు. **"హమ్మయ్య, ఇప్పుడు హాయిగా వుంది. థాంక్యూ"** అంది గుడ్లగూబ. ఎగిరివెళ్లి మళ్లీ కొమ్మ మీద వాలింది.

**(సశేషం)**

## కొంటెకొశ్శెన్లు - తుంటరి జవాబులు




**ఎస్. శివనారాయణ , కొత్తపేట.**

ప్ర. బాగా పొద్దుపోయిన తర్వాత వచ్చిన వాళ్ళనేమనుకోవాలి?

జ. పొద్దుపోక వచ్చారనుకోవాలి.

**రమణ శాస్త్రి, సంగారెడ్డి.**

ప్ర. హాస్పిటల్ ఆదాయం ఎప్పుడు బాగుంటుంది - మంచి సెంటర్లో ఉన్నప్పుడా? మంచి డాక్టర్లున్నప్పుడా?

జ. రెండూ కాదు! మంచి నర్సులున్నప్పడు.

ప్ర. ఆడవాళ్ళు తమ అందం మీద ఎప్పుడు శ్రద్ధ వహించాలి?

జ. సిటీ బస్‌లో తన ప్రక్క సీటు ఖాళీగా ఉన్నా, ఏ మగాడూ కూర్చోడానికి ముందుకు రానప్పడు.

ప్ర. మొండి బాకీలు వసూలు అవ్వాలంటే అప్పిచ్చినవాళ్ళు ఏం చెయ్యాలి?

జ. వసూళ్ళ పనిని అంటువ్యాధి రోగులకప్పచెప్తే సరి.

## చిలిపి కవిత



1. ముళ్ళపూడి రమణ ముడుపుల కేసులో
చిక్కెనన్న వార్త చిచ్చురగిలె!
బాపుగారు కూడ భాగస్వామియేనని
తెలుగు దేశమంత తెలిసి పోయె!

2. స్కీము చేసినతను రామోజీరావని
పల్లెపల్లెలోన పాకిపోయె!
అంతియే కాదు ! బాలు, ఆరుద్ర, వేటూరి,
కొంత కొంత పంచుకొనిరి మనిరి !

3. ముళ్ళ పూడివారి ముడుపులు ఏమని ,
వివరములు తెలుసుకొని విస్తుపోతి!
భాగవతములోని భాగాల చిత్రించి
ముడుపులందినారు మునులవలన!

**-కూచి బొట్ల జయచంద్ర, హైదరాబాద్.**

## ఈ రూటే వేరు



| | |
|---|---|
| కారడవి | - కారు వెళ్ళలేని అడవి. |
| సిల 'బస్సు' | - రాతి బస్సు |
| సైకిల్ | - చంపడానికి రెడీ |
| ఎక్స్‌ప్రెస్ | - ఒకప్పటి ముద్రణాలయము |

**-బి.చంద్రశేఖరయ్య, రామసముద్రం.**



## పేరు - రిపేరు




1. మా అన్నయ్య - మంచివాడు - బుద్ధిమంతుడు - అమాయకుడు

2. సీతారత్నంగారి అబ్బాయి - ఒకటో నెంబరు కుర్రాడు - సీతారామయ్యగారి మనవరాలు - గడుసు అమ్మాయి.

3. చండీరాణి - రౌడీ రాణి - రివాల్వర్ రాణి - కొరడారాణి - ఝాన్సీ రాణి -వింధ్యరాణి- ఆరుగురు పతివ్రతలు.

**-ఎస్. శివనారాయణ, కొత్తపేట.**

## చిలిపి లిపి




A 1,00,000 న్లు
O టర్లు
ప్రచా RUM
హా ME లు

**-తెలికి చర్ల రామకృష్ణ, విజయనగరం.**

One height Thousand = ఒక ఎత్తు వెయ్యి

**-టి.వి. రావు, నల్గొండ.**

## డబుల్ రోల్




**నాంచారమ్మా**, మీవారు అసలు సంగతి చెప్పక బాగా **నాన్చారమ్మా**
**పేరు**న్న కొబ్బరినూనే అయినా అలా **పేరు** కుందేం?
మండి**పోయే** ధరలు ఈ **డిపో** వే
మనకు **మీ, నా** అనే భేదాల్లేవు **మీనా**

**-టి. లక్ష్మి, పుణె.**

## షార్ట్‌కట్స్




అట్లూరి ఆదిలక్ష్మి - అ ఆ
ఇల్లెందుల ఈశ్వరి - ఇ ఈ
ఉడిగారపు ఊర్మిళ - ఉ ఊ
ఎలిమినేటి ఏకాంబరం - ఎ ఏ
ఒక్కపోగు ఓబులేసు - ఒ ఓ

**-బి. చంద్రశేఖరయ్య, టీచర్, రామసముద్రం.**

## పేరడీ పెరేడ్



ప॥ తగువులాడివి నీవే
పొగరుబోతును నేనే
ఈడు ముదిరెను
జోడు కుదిరెను
గోడ దిగి రావే... ॥తగువులాడివి॥
చ॥ గిల్లికజ్జా నీ నైజం
జెల్ల కొట్టుట నా తత్వం
గిల్లికజ్జా నీ నైజమ్...మ్...మ్
జెల్ల కొట్టుట నా తత్వమ్
రెండు కలిసిన కీచులాటల
బ్రతుకు మనకిష్టం..... ॥తగువులాడివి॥
చ॥ మూతి విరుపుల చినదాన
కోతి చేష్టల నెరజాణ
మూతి విరుపుల చినదానా...ఆ...ఆ
కోతి చేష్టల నెరజాణా
గంతులెందుకు పంతమెందుకు
నీకు సరిపోనా ॥తగువులాడివి॥
చ॥ కోపమొస్తే కొడతానె
తిక్కరేగితె తిడతానె
కోపమొస్తే కొడతానే...ఏ...ఏ..
తిక్కరేగితె తిడతానే
వరుడిగా నను ఒప్పుకుంటే
మనువు జరుగునులే ॥తగువులాడివి॥

'బందిపోటు' చిత్రంలో 'వగలరాణివే నీవే' పాటకు పేరడీగా.

**-తాళాభక్తుల లక్ష్మీప్రసాద్, విశాఖపట్నం**

**ఈ సంచికలోని పేరడీ పెరేడ్‌ని రాసిన తాళాభక్తుల లక్ష్మీప్రసాద్, విశాఖపట్నం గారికి సోహన్ మ్యూజిక్ వారు 'జై' సినిమా పాటల ఆడియో సి.డి.ని బహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో పోస్ట్‌ద్వారా పంపించడం జరుగుతుంది.**

SOHAN MUSIC



ఏప్రిల్ 5 సంగీత దర్శకుడు యస్.పి.కోదండపాణి వర్ధంతి సందర్భంగా....



## కొంగొత్త బాణీలకు బోణీ

# కోదండపాణి

వందల,వేల పాటల మధ్యన ఆయన పాట ఒక్కటి ఉన్నా చాలు 'ఆయన మార్కు'పాట అని గుర్తుపట్టి చెప్పెయ్యడానికి. ఆయన ఎప్పుడూ ఏ ఒకరిలాగానో ట్యూన్ చెయ్యలేదు. ఆయనలాగ తర్వాత ఏ ఒక్కరూ ట్యూన్ చెయ్యలేదు. ఆయనదంతా ఓ ప్రత్యేకమైన బాణీ. తెలుగు సినీ సంగీత రచనలో అటువంటి బాణీలకు ఆయనదే తొలిబోణీ. ఆయనే స్వర్గీయ యస్.పి. కోదండపాణి.

తెలుగు సినిమా పాటల్ని స్పీడు వైపు నడిపించిన వారిలో కోదండపాణి ఒకరు. అలాగని మెలోడీకి దూరం కాలేదాయన. హుషారు గీతాలు, శృంగారగీతాలు, విషాదగీతాలు, భక్తి గీతాలు ఇలా అన్నిటి స్వర రచనలోనూ ఎంతో వైవిధ్యాన్ని చూపించినా ప్రేక్షకుల్లో మాత్రం కోదండపాణి అంటే హుషారు గీతాల సంగీత దర్శకుడనే ముద్రే ఎక్కువగా ఉండేది.

సంగీత దర్శకునిగా తొలిచిత్రం 'కన్నకొడుకు'(1961) అయినా 1963లో విడుదలయిన 'గురువుని మించిన శిష్యుడు' చిత్రం ఆయన్ని తెలుగు ప్రేక్షకులకు అత్యంత సన్నిహితుణ్ని చేసింది. ఏడేడు జన్మల నుండీ పడివుందీ బ్రహ్మముడి, బలెబలెబలెబలె హిరణ్యకశిపుడరా, వెన్నెల్లో కనుగీటే తారకా - పాటల్ని విపరీతంగా ఆదరించారు ప్రజలు.

అది మొదలు జానపద చిత్రాలకు - విఠలాచార్యలాగ తనకంటూ ఓ సుస్థిరస్థానాన్ని సంపాదించుకున్నారు కోదండపాణి. బంగారు తిమ్మరాజు, తోటలోపిల్ల - కోటలో రాణి, ఆకాశరామన్న, జ్వాలాద్వీప రహస్యం, భూలోకంలో యమలోకం, శ్రీశ్రీశ్రీ మర్యాదరామన్న కథ, ఇద్దరు మొనగాళ్లు, గోపాలుడు -భూపాలుడు, మహాబలుడు...ఇలా ఎన్నో చిత్రాలు ఆయన స్వరబలంతో కలెక్షనులు పుంజుకున్నాయి.

సాంఘిక చిత్రాల్లోకూడా కోదండపాణి చూపిన వైవిధ్యం తక్కువదేమీ కాదు. వాటిలో మొట్టమొదట చెప్పుకోవలసింది 'దేవత'. ఆ తరువాత సుఖ దుఃఖాలు, ఇంటిగౌరవం, మంచికుటుంబం, మా మంచి అక్కయ్య, మంచి మిత్రులు, కీలుబొమ్మలు, ఆస్తులు -అంతస్తులు, ఒకే కుటుంబం, శాంతినిలయం, పండంటి కాపురం మొదలయినవి.

సంగీతపరంగా చూసుకుంటే ఫ్లూటు, వయొలిన్, రిథమ్స్‌లో కోదండపాణి చేసిన ప్రయోగాలు, వాటిని పరుగెత్తించిన తీరు ఒకసారి వింటే ఈ జన్మకిక అవి మరుపురావు. ఒకసారి కలలోకిరావయ్యా (గోపాలుడు భూపాలుడు), వేళ చూస్తే సందెవేళ (జగత్ కిలాడీలు)ఎవరూ లేనిచోట (మంచి కుటుంబం) పాటలలో ఫ్లూటు; మనసా కవ్వించకే నన్నిలా (పండంటి కాపురం) పాటలో వయొలిన్, రిథమ్‌లను నడిపించిన పద్ధతి గురించి మాటలలో వర్ణించబూనటం దుస్సాహసమే అవుతుంది.

విషాద గీతాలకుతప్ప శృంగార గీతాలకు ఉపయోగించని శివరంజని రాగచ్ఛాయలలో చాలదా ఈ చోటు (నేనంటే నేనే), ఒకటైపోదామా ఊహలవాహినిలో(ఆస్తులు -అంతస్తులు) పాటలను; సినీ సంగీతంలో అతితక్కువగా వాడబడే సరస్వతి రాగంలో సర్వకళా సారము (శ్రీరామ కథ) పాటకు, కళ్యాణ వసంతరాగంలో మాధవా మాధవా (శ్రీరామకథ) పాటకు, కామవర్ధిని రాగంలో నా హృది పయనించు శృంగార రథమా (ఏమి ఈ వింతమోహం - మర్యాద రామన్న) పాటకు వినియోగించడం, దొరవో ఎవరివో (కథానాయిక మొల్ల) పాటలో అత్యంత ఆశ్చర్యకరంగా కళ్యాణి, భాగేశ్రీ రాగాల్ని కలగలపటం వంటివి కోదండపాణి చేసిన ప్రయోగాలలో కొన్ని.

ఒక స్వరకర్తగా కోదండపాణి చేసిన మరిన్ని మహత్తరమైన ప్రయోగాలు - జేసుదాసు చేత తెలుగులో మొదటిసారిగా 'బంగారుతిమ్మరాజు' చిత్రంలో 'నిండు చందమామా' పాటను పాడించటం; యస్పీ బాలసుబ్రహ్మణ్యంచేత 'మర్యాద రామన్న' చిత్రంలో ఒక చరణాన్ని, ఓ విప్లవాద పద్యాన్ని పాడించి పరిశ్రమకు పరిచయం చెయ్యటం; నటుడైన పద్మనాభం చేత 'దేవత' లో 'నా పేరు రాందాసు' పాటను పాడించటం, తనకు తాను పాడుకునే అలవాటు తప్పిపోయిన రేలంగి చేత 'శ్రీరామకథ'లో'చారూ చారూ' పాటను తిరిగి పాడించడం, ఈలపాట రఘురామయ్య చేత మొదటిసారి మరొక నటునికి (హీరో కృష్ణకి) 'మర్యాద రామన్న' లో ఓ చరణం పాడించటం, ఎల్లారీశ్వరి చేత 'కథానాయిక మొల్ల'లో అయిదు భాషల పాటను పాడించటం వగైరా వగైరా...!

కోదండపాణి స్వరపరిచిన గీతాలలో కొన్ని - అవి పాడిన గాయనీ గాయకుల హిట్స్‌గా నిలిచిపోవటం గమనార్హం. అలా... నాగమల్లి కోనలోనా (బంగారు తిమ్మరాజు) పాట జమునారాణికి, నిండుచందమామా (బంగారు తిమ్మరాజు)పాట జేసుదాసుకి, ఇది మల్లెల వేళయనీ (సుఖదుఃఖాలు), మనసా కవ్వించకే నన్నిలా (పండంటికాపురం) పాటలు సుశీలకి; రిసనిద పమగరి లోకం నవ్విన నవ్వనీ (ఆకాశరామన్న) పాట జానకికీ; దేవీ క్షేమమా (శాంతి నిలయం)పాట వసంతకీ, ఆలయాన వెలసిన ఆ దేవుని రీతి, బొమ్మను చేసి ప్రాణం పోసి (దేవత), మనిషి

తలుచుకుంటే (భలేమొనగాడు) పాటలు ఘంటసాలకీ, రామకథ,శ్రీరామకథ (శ్రీరామకథ) మేడంటే మేడకాదు (సుఖదుఃఖాలు), గుంతలకిడి గుమ్మ (నేనంటే నేనే); దయ చూడవే గాడిదా (మిడతంబొట్లు)పాటలు బాలసుబ్రహ్మణ్యంకి; రేగిపళ్ళు (ఆస్తులు-అంతస్తులు), అంబవా శక్తివా (నేనంటే నేనే) పాటలు ఎల్లారీశ్వరికీ ఉండగా -తొలివలపే పదే పదే (దేవత), దొరవా ఎవరివా (మొల్ల), ఎంతటి సరసుడవో ప్రియా (మల్లమ్మ కథ) పాటలు ఘంటసాల, సుశీల కాంబినేషన్‌కీ; సర్వ కళాసారము (శ్రీరామకథ) సుశీల, జానకి కాంబినేషన్‌కీ; ఎన్నాళ్లో వేచిన ఉదయం (మంచి మిత్రులు) ఘంటసాల, బాలుల కలయికకు తీపి గుర్తులుగా మిగిలిపోయాయి.

ఒక్క అక్కినేని నాగేశ్వరరావు నటించిన చిత్రాలకు తప్ప అప్పటికి ఉన్న తక్కిన అందరు హీరోలు నటించిన చిత్రాలకూ సంగీత దర్శకత్వం వహించారు కోదండపాణి. అయితే 'మంచి కుటుంబం' చిత్రం ఒక్కటే కేవలం ఉదాహరణకు ఉన్నా ఆ చిత్రంలో అక్కినేనికి పాటల్లేవు.

సంగీత దర్శకత్వం చేపట్టాక కోదండపాణి పాడిన పాట- 'ఇదిగో దేవుడు చేసిన బొమ్మ' (పండంటి కాపురం) సూపర్‌హిట్! తన పాటకు తనే పేరడీ చేసుకుంటూ మిత్రబృందం మధ్యన సరదాగా ఆయన పాడుకునే 'ఇదిగో దేవుడు చేసిన మందు, ఇది నిలిచేదేమో మూడు గంటలు ఇంట్లో తిట్లు పదివేలు' పాట కూడా ఇండస్ట్రీలో హిట్!

పి.లీల సంగీత దర్శకత్వం వహించిన 'చిన్నారి పాపలు' చిత్రానికి సంగీత పర్యవేక్షకుడిగా కోదండపాణి వ్యవహరించారు. ఆచిత్రంలో 'ఓయబ్బో ఏంది సొగసు' అనే పాట ఒకటుంది. ఆ పాట మెదలవుతూ ఉండగానే జనంలో వచ్చిన రియాక్షన్‌ని కోదండపాణి బాణి ప్రజలలో ఎంతగా చొచ్చుకుపోయిందో చెప్పటానికి ఉదహరిస్తుంటారు కొందరు సినీపండితులు.

ఏది ఏమైనా కోదండపాణి తెలుగు సినీ సంగీతానికి చేసిన సేవ మరువలేనిది ....ఆయన లేనిలోటు ఎవరూ పూడ్చలేనిది.

# యస్.పి.కోదండపాణి హిట్స్

## చిత్రం : బంగారు తిమ్మరాజు

రచన: ఆరుద్ర గానం: జేసుదాసు

ఓ నిండు చందమామ నిగనిగలా భామా
ఒంటరిగా సాగలేవు కలసిమెలసి పోదామా
నిదురరాని తీయని రేయి
నినుపిలిచెను వలపులహాయి
మధురమైన కలహాలన్నీ
మనసుపడే ముచ్చటలాయె
మేలుకొన్న స్వప్నములోన
ఏల యింత బిడియపడేవు
ఏలుకొనే ప్రియుడనుకానా
లాలించగ సరసకురానా ॥నిండు॥
దోరవయసు వూహలు నీలో
దోబూచులు ఆడసాగె
కోరుకున్న మురిపాలన్నీ కొసరి కొసరి చెలరేగె
నీదుమనసు నీలో లేదు
నాలోన లీనమాయె
నేటినుంచి మేనులు రెండు
నెరజాణా ఒకటాయె ॥నిండు॥

## చిత్రం : మంచి మిత్రులు

రచన: సి.నారాయణరెడ్డి గానం: ఘంటసాల, యస్.పి.బాలసుబ్రహ్మణ్యం

ఎన్నాళ్లో వేచిన ఉదయం ఈనాడే ఎదురవుతూంటే
ఇన్నినాళ్లు దాచిన హృదయం ఎగసిఎగసిపోతూంటే
ఇంకా తెలవారదేమి ఈ చీకటి విడిపోదేమి
మంచిని పెంచిన మనిషిని ఏ వంచన ఏమీ చేయదనీ
నీతికి నిలబడువానికి ఏనాటికీ ఓటమిలేదనీ
నే చదివిన జీవిత పాఠం నీకే చెప్పాలని వస్తే
ఇంకా తెలవారదేమి ఈ చీకటి వీడిపోదేమి
నాగులు తిరిగే కోనలో
ఏ న్యాయం పనికి రాదని
కత్తిని విసిరే వానిని ఆ కత్తితోనే గెలవాలని
నేనెరిగిన చేదు నిజం నీతో చెప్పాలని వస్తే
ఇంకా తెలవారదేమి ఈ చీకటి విడిపోదేమి
ఎన్నాళ్లో వేచిన ఉదయం ఈనాడే ఎదురవుతూంటే
ఇన్నినాళ్లు దాచిన హృదయం ఎగసిఎగసిపోతూంటే
ఇంకా తెలవారదేమి ఈ చీకటి విడిపోదేమి

## చిత్రం : కథానాయిక మొల్ల

రచన: సి.నారాయణరెడ్డి గానం: పి.సుశీల

సాకీ: రఘుకుల తిలకా! నీ ఆనతి
రచియించితి రామాయణ సత్కృతి -ఆ
కృతి వరియించిన పతివి నీవే
అతులిత కైవల్యగతివి నీవే!
ప: జగమే రామమయం -మనసే
అగణిత తారక నామమయం
జగమే రామమయం
చ: నీలజలదరమణీయం రూపం
నిగమాంచల మందిర మణిదీపం
సుందర జానకీవందిత చరణం
సురమునిశరణం! భవతాపహరణం
జగమే రామమయం -మనసే
అగణిత తారక నామమయం
జగమే రామమయం
చ: ఆ చిరునవ్వే - అమృతపు జల్లు
అఖిలజగములేలు - ఆ చేతి విల్లు
అతని గానమున -అలరారు కావ్యం
అన్ని యుగాలకు - నవ్యాతి నవ్యం
జగమే రామమయం -మనసే
అగణిత తారక నామమయం
జగమే రామమయం
ఎవని కమలకమనీయపదము - చూ
పించె అహల్యకు ముక్తిపదము
ఎవని చంద్రికామృదులకరము - అం
దించెను శబరికి దివ్యవరము
ఎవనిలేలుబడి-ఇంటికొక్క గుడి నిలిపెనో
ఎవని రాజ్యమే - రామరాజ్యమై వెలసెనో
ఆ రాముడు నా అంతరంగమున నిండగా
అహము మరచి ఈ - యిహము మరచి
జన్మాంతరబంధములెల్ల విడిచి
ఆ మహజ్జ్యోతిలో లీనముకానా
ఆ మహాప్రభునిలో లీనముకానా
ఓ రామా! రఘురామా! కైవల్యరామ!

# నీళ్ళకు నీళ్ళొదిలితే...

- కండ్లకుంట శరత్‌చంద్ర

సికింద్రాబాద్ రైల్వేస్టేషన్ నుండి నెమ్మదిగా ఇవతలికొచ్చాను నేను.

"ఆటో సార్..ఆటో(", "సార్ ..ఆటో...!" అరుస్తూనే నా పైకి ఎగబడుతున్నారు ఆటోవాళ్ళు.

"సార్ ..ఎక్కడికి? ఖైరతాబాద్‌కా..రండిసార్!" అంటూ ఓ ఆటోవాలా వచ్చి నా చేతిలోని బ్రీఫ్‌కేసును లాక్కోబోయాడు.

"నీ మొహం..! సార్ ఫేస్ చూస్తూంటే ... హీరోలా లేడూ ..! రామోజీఫిలిమ్ సిటీకయ్యుంటుంది." అంటూ మరో ఆటో డ్రైవర్ ఆ బ్రీఫ్‌కేసును లాగాడు.

"నువ్వూరుకోవోయ్ ! సార్ హుందాతనం చూస్తూంటే ...బిజినెస్ మాన్‌లా లేడూ..! వైస్రాయ్ హోటల్‌కయ్యుంటుంది. నా ఆటోలో రండిసార్!" మరో ఆటో చోదకుడు..బ్రీఫ్‌కేసును తనచేతిలోనికి లాక్కున్నాడు.

"అబ్బ ...! ఊరుకోండయ్యా! నేను వెళ్ళాల్సిన ఇల్లు ఇక్కడే..ప్రక్కనున్న గాంధీ హాస్పిటల్ దగ్గరుంది. ఆటో అక్కరలేదు," అనేసి వాళ్ళ చేతుల్లోనుండి నాబ్రీఫ్‌కేస్‌ను లాక్కుని గబగబా అవతలకి పరుగెత్తి రోడ్డెక్కాను.

"సార్ సార్..ఈ పెన్నులు కొనండ్సార్! రూపాయి కి రెండు. ఈ పెన్నులతో రాస్తే.... ఫస్ట్‌ర్యాంక్ వస్తుంది సార్. వేటూరిగారు.. పాటలను ఈ పెన్నుతోనే రాస్తారు! దినపత్రికల ఎడిటర్లందరూ ఈ పెన్నులతోనే సంపాదకీయాలు వ్రాస్తారు సార్! తీస్కోండి సార్..!" ఓ కుర్రాడు ఎగబడ్డాడు.

నేను అతడ్ని తప్పించుకుని ముందుకు నడిచాను.

"సార్ ..సార్ ! ఈ బనీన్‌లు కొనండిసార్! వీటిని వేసుకుంటే...కాలేజీ అమ్మాయిలందరూ మీ వెనకే తిరుగుతారు సార్!"

నేను మరింత ముందుకు నడిచాను.

"సార్..సార్..! ఈ బెల్టుకొనండి సార్!! చిరంజీవిగారి తోడల్లుడి మేనమామ యొక్క అక్కకొడుకుగారబ్బాయి ..ఈ బెల్టే వాడతారు సార్" నేను ఇంకా ముందుకు సాగాను.

అప్రయత్నంగా నా చూపు, షాపుల మీద పడింది. వాటి ముందున్న బోర్డులను చదువుతూ నడవ సాగాను.

**"ఇచ్చట నీళ్ళు అమ్మబడును.**
**ఒకగ్లాసు రూ॥15/- మాత్రమే!"**



"ఇచ్చట చాలా చౌకగా నీళ్ళు అమ్మబడును.

బిందె ఒక్కింటికి రూ॥270/- మాత్రమే!"

"ఇచ్చట పదిగ్లాసుల నీళ్ళు కొంటే..ఒక స్పూనెడు నీళ్ళు ఉచితం. ఈ అవకాశం స్టాకున్నంత వరకే ! ఊఁ..! త్వరపడండి".

నేను ఆశ్చర్యపోతునే మా అక్కయ్య ఇంటికి వచ్చాను.

ఎప్పటిలాగే అక్కయ్య, బావ నన్నుచూసి సంతోషపడతారనుకున్నాను. అలాంటిదేమి జరగలేదు.

"ఏరా ...!ఇలా వచ్చేవేం?" అంది అక్కయ్య.

"ఫోన్ చెయ్యకుండా దిగబడ్డావేం?!" అన్నాడు బావ, ముక్కు ఎగజీదుతూ.

"రేపు ఓ మందుల కంపెనీలో ఇంటర్వ్యూ వుంది బావా! అందుకే వచ్చాను. అవునూ......మీ ఇద్దరి మొహాలేంటీ....అలా జిడ్డుగా తయారయ్యాయి?" అన్నాను.

"ఆఁ.....అదంతా ఓ పెద్ద కథలే! వెళ్ళి కాళ్ళు కడుక్కో ! భోజనం వడ్డిస్తాను." అంది అక్కయ్య.

నేను బాత్రుంలోనికి నడిచాను.

"నీళ్ళు పొదుపుగా వాడవలెను !" అని తాటికాయంత అక్షరాలతో వ్రాసిన బోర్డు అమర్చబడి వుందక్కడ.

"ఇదిగోరా! కాళ్ళు చేతులూ కడుక్కునేందుకు నీళ్ళు." అంటూ






సగందాకా నీళ్ళున్న ఓ ప్లాస్టిక్ చెంబును తీసుకొచ్చి ఇచ్చింది అక్కయ్య.

నేను విస్తుబోయి,"ఏంటక్కయ్యా! ఈ సగం నీళ్ళతో కాళ్ళూ మొహం కడుక్కోవాలా ! మిలటరీ కన్నా ఘోరంగా వుందే! " అన్నాను.

"సిటీలో..నీళ్ళ సమస్య చాలా వుంది. అతి తక్కువ నీళ్ళతో కాలం గడుపుకోవాలి, తెల్సిందా!" అనేసి అవతలికి వెళ్ళిపోయింది.

నేను, ఆ నీళ్ళతో కాళ్ళూ చేతూలూ తుడుచుకుని వంటింట్లోనికి వచ్చాను.

అక్కయ్య ఓ కంచంలో మరమరాలు, అప్పడాలు, బెండకాయవేపుడు వుంచి, నా ముందుపెట్టింది.

"ఇదేం తిండి? " అన్నాను నోరెళ్ళ బెట్టి.

"చెప్పానుగా..నీళ్ళు దొరకడం కష్టమని ! అన్నం, కూరలు, చారు వండాలంటే నీళ్ళు కావాలిగా! అందుకే ..నీళ్ళు లేకుండా వండే వంటలే వండుతున్నాను తిను!" అంది.

నేను కంచంలోని మరమరాలను నోట్లో వేసుకున్నాను. వాటిలో ఉప్పూ, కారం లేవు.

రెండు బెండకాయ ముక్కలు రుచిచూసాను. వాటిలోనూ ఉప్పులేదు. "ఇదేంటక్కయ్యా! కనీసం ఉప్పుకూడా వేయలేదేం?"

"ఉప్పువేసిన పదార్థాలు తింటే దాహం వేస్తుంది. అందుకే ఇలా చప్పిడి తిండి తింటున్నాం" చెప్పింది.

భోజనం ముగించాననిపించి, చేతిని అక్కయ్య ఇచ్చిన కాగితానికి తుడిచి అవతల విసిరేసాను.

హాల్లోనికి రాగానే, బావగారు నీటి సమస్యను గురించి మరింత అద్భుతంగా విడమరిచి చెప్పారు.

'హైదరాబాద్‌లో ..చాలా కాలనీలలో ప్రజలు....వారానికోసారి స్నానం చేస్తున్నారుట!!'

'కొద్దో గొప్పో డబ్బు కలిగినవాళ్ళు నీటిని కొనుక్కుంటారుట!!'

'హైదరాబాద్‌లో ఎవ్వరూ పెళ్ళిళ్ళు చెయ్యటం లేదుట!!.'

'ఒకవేళ పెళ్ళి చేయాల్సొస్తే..మీరు అడిగినంత కట్నం ఇస్తాంగానీ....నీటి ఖర్చు మాత్రం మీరే పెట్టుకోవాలి..... అని ఆడపిల్లల తండ్రులు కండిషన్ పెడుతున్నారుట!!'

'దాంతో ....ఈ సమ్మర్‌లో అసలు పెళ్ళిళ్ళే కావడంలేదుట!!'

'ఇంట్లో బోరింగ్ వుండి, నీళ్ళు పుష్కలంగా వున్నవారు..పెట్రోల్ బంకులలాగా....'వాటర్ బంక్'లు పెట్టారంటా!!.'

'ఏ సినిమా స్టూడియోల్లోనూ..ఇప్పుడు వాన పాటలు షూట్ చెయ్యడంలేదు'ట!!

'కొన్ని ఏరియాలలో..ప్రతీ ఉదయం పాల ప్యాకెట్లతో పాటూ..నీటి ప్యాకెట్లు కూడా వస్తాయ'ట!!

ఇదంతా వినేసరికి నాకు గొంతులో తడారిపో సాగింది. 'నీళ్ళ'డిగితే ఇవ్వరనే భయంతో ....ఎందుకైనా మంచిదని 'చింతకాయ' ను మదిలో తలుచుకుని నోట్లో లాలాజలాన్ని సృష్టించుకుని అలాగే వుంచేసుకున్నాను.

* * *

సమయం సాయంత్రం ఆరయ్యింది.

"ట్రింగ్ ట్రింగ్..!" ఫోన్ మోగింది.

బావ రిసీవర్ ఎత్తి మాట్లాడి,"ఫోన్ నీకే! మందుల కంపెనీ నుండి!" అన్నాడు. 'అప్లికేషన్ ఫామ్ నింపేటప్పుడు ..'లోకల్ అడ్రస్' అని వున్నచోట మా అక్కయ్య అడ్రస్,ఫోన్ నెంబరు ఇవ్వడం మంచిదయ్యింది,' అనుకుంటూ వెళ్ళి, రిసీవర్ అందుకుని మాట్లాడాను.

అవతలిమనిషి చెప్పేది వినేసరికి, నా మొహం తెల్లగా పాలిపోయింది.

"ఏమైందిరా...? ఏమైంది? అలా అయ్యావేం?" అన్నారు బావగారు.

"ఇంటర్‌వ్యూను ఎల్లుండికి వాయిదా వేసారట!" చెప్పాను.

అ మాటవినగానే ఆయన కూడా తెగబాధ పడిపోయాడు.

బాధ పడకుమరి! అసలే...నీటి సమస్య...! ఇంటికి మరోమనిషి వచ్చాడంటే..ఎవరు మాత్రం బాధపడరు!?

ఓ గంట తర్వాత, నేను రోడ్డుమీదికి వచ్చాను.

ప్యారడైజ్ దగ్గర నా స్నేహితుని ఇల్లుంది. వాడ్ని కల్సిసొద్దామని భావించి.. ఆటోను పిలిచాను.

"ప్యారడైజ్!" చెప్పాను.

"రెండు బిందెల నీళ్ళు!" అన్నాడు.

అతడు చెప్పింది నాకు అర్థంకాలేదు.

''ఏంటీ? '' అన్నాను మొహం చిట్లిస్తూ.

"తెలుగులోనే చెప్పాను కద్సార్? అర్థం కాలేదా? మీ ఫేస్..సిటీకి కొత్తలా వుందే! ఇప్పుడు ఆటోవాళ్ళెవరూ డబ్బులీస్కోరు సార్? ఆటో ఛార్జీగా నీళ్ళను వసూలు చేస్తున్నాం. ఇక్కడ్నుంచి ప్యారడైజ్‌కు వెళ్ళాలంటే ఛార్జికింద్ర రెండు బిందెల నీళ్ళివ్వాలి.'' విడమరిచి చెప్పాడు ఆటోవాలా.

"నీళ్ళులేవుగానీ.. యాభై రూపాయ లిస్తాను..... తీసుకెళ్ళు" అన్నాను.

అతడు, నన్నో అజ్ఞానిలా చూసి, "వెయ్యి రూపాయలిచ్చినా.. తీసుకుపోను. రెండు బిందెల నీళ్ళివ్వండి, చాలు" అన్నాడు.

"నీళ్ళులేవు" అంటూ 'నీళ్ళు' నమిలాను.

అతడు వెళ్ళిపోయాడు.

మరో రెండు ఆటోలను పిలిచి, వారిని అడిగాను. వాళ్ళుకూడా నీళ్ళిస్తేనే.... తీసుకెళ్తామని చెప్పారు.

అప్పటిదాకా నా వాలకం గమనిస్తున్న ఓ పెద్దమనిషి నా దగ్గరకొచ్చాడు.



"నీళ్ళివ్వకుండా...ఇప్పుడు ఆటోలలో వెళ్ళడం కష్టం సార్! గాంధీగారి మార్గాన్ని అనుసరించండి" అన్నాడు.

"గాంధీగారి మార్గమా? అంటే..?" అన్నాను.

"ఏముంది..కాలినడకనే వెళ్ళండి. ప్యారడైజ్‌కు వెళ్ళేందుకు ఓ షాట్ కట్ రూట్ చెప్తాను. అలా వెళ్ళండి!" అన్నాడు.

"చెప్పండి" అన్నాన్నేను.

"ఇదిగో..ఇలా..చక్కగా..వెళ్ళి..వీధి సందు చివర... ఎడమవైపు తిరగండి. అక్కడ్నించి ఓ పావు కిలోమీటర్..గతుకుల రోడ్డుమీద నడిచాక, ఓ పాన్ డబ్బా వస్తుంది. దాని ప్రక్కనున్న సందులో నుండి అరగంట నడిచి... ఎడమవైపుకు తిరగండి. అక్కడ ఓ పెద్ద డ్రైనేజ్ వస్తుంది. ముక్కు మూసుకుని దాన్ని దాటేసి ..కాస్త ముందుకెళ్ళి కుడివైపుకు తిరిగి.. పావుగంట నడిచి...అక్కడ్నించి ఎడమవైపుకు తిరిగితే...ఓ వేపచెట్టు కనిపిస్తుంది. ఆ వేప చెట్టుక్రింద ఓ బిచ్చగాడుంటాడు. వాడికి ఓ పది రూపాయలు దానం చేసారంటే ..వాడు మీకు అక్కడ్నించి ఎలా వెళ్ళాలో షార్ట్‌కట్ చెప్తాడు.

"??!!!!??"

"అలా క్వశ్చన్‌మార్కులూ.... ఆశ్చర్యార్ధకాల ఫేసులూ పెట్టకండి. అడ్రస్ మరోసారి చెప్పమంటారా?'' అడిగాడతను.

నేను తేరుకుని, వర్తమానంలోనికి వచ్చి, "హబ్బే..వద్దులేండి. అల్లసాని వారి అల్లిక జిగిబిగి అన్నట్లు..మీరు చెప్పిన షార్ట్‌కట్ చాలాబావుంది. వెళ్ళొస్తాను.'' అనేసి,మళ్ళీ ఏం చెప్తాడోననే ఉద్దేశ్యంతో కాలికి బుద్ధి చెప్పాను.

మొత్తం మీద తంటాలుపడి ఎలాగో ఒకలాగ స్నేహితుడి ఇంటికి వెళ్ళాను. వాడు నన్నుచూసి, జీవంలేని ఓ నవ్వు నవ్వి.

"హ్హిహ్హిహ్హి...ఎలా వున్నావ్?" అన్నాడు.

''బాగానే ఉన్నానుగానీ తాగడానికి కాస్త నీళ్ళివ్వు''అన్నాను. వాడు, నా మాటను విననట్టుగా మొహం పెట్టి, మండుటెండలు మండిపోతున్నాయి కదూ!" అన్నాడు.

"మండిపోతున్నాయి కాబట్టే...వాటిని మండు టెండలు అన్నారు కానీ..కాస్త నీళ్ళు తెప్పించు" అన్నాను.

వాడు, నేనన్న చివరి మూడు పదాలను విననట్లుగా మొహంపెట్టి.

"హాసంలో జోకులు బాగున్నాయి కదూ! చదివావా! "అన్నాడు.

"హాసంలో జోకులెప్పుడూ బాగుంటాయి గానీ...ముందు కాస్త నీళ్ళివ్వు?" అన్నాను.

అంతలోనే వాడి నానమ్మ, ఓ ట్రేలో రెండు గ్లాసుల నిండా ఏదో ఎర్రటి ద్రవాన్ని తీసుకువచ్చింది.

"ఏంటిది?" అన్నాను.

"టమాటా జ్యూస్ !" అన్నాడు వాడు.

"ముందు కాస్త నీళ్ళు.."

వాడు నరసింహస్వామిలా లేచి నిలబడి, ''వచ్చినప్పట్నుంచీ చూస్తున్నాను. నీళ్ళో నీళ్ళో..అంటావు. సిటీలోని నీటి సమస్యను గురించి..నీకింకా తెలీదనుకుంటాను. ఇప్పుడు ఎవరింటికి వెళ్ళినా...నీళ్ళివ్వరు. టమాటా రసం,



క్యారెట్ రసం, దోసకాయ రసం, మామిడిరసం, చెఱుకు రసం...ఇలా ఏదో ఒక జ్యూస్ ఇస్తారు. అర్ధమైందా!" అన్నాడు.

నేను మారుమాట్లాడకుండా, నీటి మాట ఎత్త కుండా..టమాటా జ్యూస్ తాగి, కాసేపు ఆ మాటా ఈ మాటా మాట్లాడి ఇంటికి వచ్చేసాను.

* * *




రాత్రి పన్నెండు గంటలకు ఎవరిదో ఏడుపు వినిపించి అందరం లేచి వీధి లోనికి వచ్చాం. పక్క ఇంట్లో నుండి వస్తుందా ఏడుపు. ఆ ఏడుపు విని వీధిలో చాలామంది పోగయ్యారు. ఇంతలో ఓ పోలీస్ వ్యాన్ అక్కడికి దూసుకొచ్చింది.

నేను, అక్కబావలతో పాటు పక్కింటికి వెళ్ళాను.

ఓ ముసలాడ కూర్చుని శోకాలు పెడుతోంది. ఎవరో దొంగవచ్చి వెళ్ళాడట, పాపం....ఏమేం ఎత్తుకు పోయారో...!!!!

ఇన్స్పెక్టర్ ఆమె దగ్గరికి వెళ్ళాడు.

"మామ్మగారూ..కూల్‌డౌన్..కూల్‌డౌన్...!" అన్నాడు ఆమెను అనునయిస్తూ.

"కూల్‌డౌనూ లేదూ...గోడౌనూ లేదు. దొంగలొచ్చి వెళ్ళారని నేనేడుస్తుంటే మధ్యలో నీ గోలేంటి?" అంది ముసలమ్మ ఏడుస్తూనే.

"మేము వచ్చింది అందుకే బామ్మగారూ! చెప్పండి..దొంగ ఎలా వున్నాడు? నల్లని వొత్తైన మీసాలు....రింగుల జట్టు..నల్లబనీను... గళ్ళలుంగీ ..మొహానికి నల్లరంగు ..బొడ్లో కత్తి... ఇవన్నీ వున్నాయి కదూ?" అన్నాడు ఇన్స్పెక్టర్.

"నీ మొహమండ!నువ్వు చెప్పే లక్షణాలు సినిమా దొంగలకుంటాయి. నిజం దొంగలు అలా వుండరు. ఎన్నడైనా దొంగల్ని పట్టుకున్న మొహమేనా నీది! అసలు..నువ్వు నిజం పోలీసువా...లేక...సినిమా పోలీసువా?" అంది ముసలమ్మ ముక్కుచీదుతూ.

ఇన్స్పెక్టర్ కాస్త తమాయించుకుని, "మామ్మగారూ....!ఇంతకూ దొంగ ఏం దోచుకెళ్ళాడు?, డబ్బా?"

"కాదు"

"మరి..బంగారు నగలా?"

"కాదు! అవి తీసుకువెళ్తే నేను బాధపడేదాన్ని కాదు"

"మరి ..టీ.వి ...ఎత్తుకెళ్ళారా?"

"ఊహూ....!"

"మరి..మీ ఇంట్లో వున్న చిన్నపిల్లలెవరినైనా ఎత్తుకెళ్ళారా?"

"కాదు"

"మరి..ఏమెత్తుకుపోయాడు. కాస్త చెబుతారా?" అన్నాడు ఇన్స్పెక్టర్ అసహనంగా.

"వారంరోజుల క్రితం నేనెంతో కష్టపడి తెచ్చుకున్న...ఒక బిందెడు నీళ్ళు ఎత్తుకుపోయాడు!" అని చెప్పి "వా(...." అంటూ మళ్ళీ ఏడవసాగింది.

"వ్వాట్ ..! మంచీనీళ్ళా...! యూ మీన్... వాటర్...?! మై..గాడ్! ఈ మధ్య ఇది వన్నెండువందలా నలభైరెండో కేసు, నీటిదొంగలు ఎక్కువైపోయారు. మామ్మగారూ ...మీరేం బాధపడకండి. ఎంత కష్టపడైనాసరే.. వాడ్ని పట్టుకుంటాం."అన్నాడు ఇన్స్పెక్టర్.

"నీ తలకాయ పట్టుకుంటావు. నీ మాటలు..ఆ వీధి చివరనుండే.. తిక్క శంకరయ్యకు చెప్పు..నమ్ముతాడు...వాడు ఈ పాటికి ..ఆ నీళ్ళను మొత్తం తాగేసుంటాడు. బంగారంలాంటి నీళ్ళు..వా(..."అంటూ ఏడవసాగింది మామ్మ.

అందరూ ఆమెను ఓదార్చసాగారు.

* * *

అక్కయ్య, నన్ను ఉదయం నాలుగు గంటలకే నిద్రలేపింది.

"ఒరేయ్ ! ఈ రోజు నీళ్ళ ట్యాంకర్ వస్తుంది. ఎప్పుడూ మీ బావగారే వెళ్ళి నీళ్ళుతెస్తారు. ఈ సారి...నువ్వు వెళ్ళి తీసుకురా!" అని ఆర్డరు వేసింది.

నేను, ఇత్తడి బిందె తీసుకుని ఇవతలకి వచ్చాను.

వీధిచివరన నీళ్ళట్యాంకర్...దర్జాగా నిలబడివుంది. వీధిలో జనమంతా దాని చుట్టూ మూగి వున్నారు.

ఈ ప్రపంచంలో ఎన్నిరకాల బిందెలుంటాయో, ఎన్ని రంగుల బిందెలుంటాయో.....ఎన్ని సైజుల బిందెలుంటాయో... అన్నీ అక్కడ కనిపిస్తున్నాయి.

నేను వెళ్ళి బిందెను వరుసలో నిలబెట్టాను.

"ఏయ్! ఏంటే..నీకంత పొగరు. నావెనకొచ్చి, నాకన్న ముందుకు పోజూస్తున్నావా?" అంటూ ఓ వీరనారి, వరుసలలో నుండి ఓ స్టీలు బిందెను కాలితో ఫట్‌మని తన్నింది. బిందె ఎగిరి అల్లంతదూరంలో పడింది.

"నా బిందెను కాలితో తంతావా! నేనేమైనా తక్కువ తిన్నానా! మీ ఆయన టీచరైతే...మా ఆయన హెడ్మాష్టరు!" అంటూ స్టీలు బిందె తాలూకూ నారీరత్నం....ఓ ఇత్తడి బిందెను, బలం



కొద్ది తన్నింది.

ఆ బిందె కాస్తా పైకెగిరి వెళ్ళి.....మూలన నిలబడి చుట్టకాలుస్తున్న ఓ వ్యక్తి మీద పడింది.

ఆవ్యక్తి.. వీర రౌద్రమూర్తిలా ముందుకు వచ్చి...."ఎవరు....ఎవరు..నా మొహం మీదకి బిందెను పంపింది. ఆఁ..అదిగో ఆ గోపాలరావే అయ్యుంటాడు. ఒరేయ్ గోపాలం....! 'చుట్టలు తాగే పోటీ'లో నా చేత చిత్తుగా ఓడిపోయినందుకు ప్రతీకారంగా బిందెను నా మొహాన విసురుతావా!'' అంటూ చుట్ట తాగుతున్న వ్యక్తి, సదరు గోపాలరావు గారి బిందెను తన్నాడు.

"ఏరా ..ఏ పాపమూ ఎరుగని నా బిందెను తంతావా!'' అంటూ గోపాలరావు ముందుకొచ్చి ..'చుట్టవ్యక్తి' బిందెను తన్నాడు.

అదికాస్త ఎగిరి ఓ నారీమణి తలకు తగిలింది.

"హమ్మో...హమ్మో..... ఈ గోపాలరావు ఇంట్లో టీ.వీ. పేలిపోను! ఆయన కంప్యూటర్‌ను కాకులుతిన!''అంటూ బాధతో అరవసాగింది.

''ఏమయ్యా గోపాలం....నాభార్యమీదకి బిందెను తంతావా!'' అంటూ సదరు నారీమణి యొక్క పతిదేవుడు ముందుకొచ్చి గోపాలాన్ని ఒక్కతోపు తోసాడు.

దాంతో గోపాలరావు వెళ్ళి...బిందెల మీద పడ్డాడు.

''హయ్యో...హవ్వో....నా నడుము విరిగిందిరా..దేవుడోయ్!'' అని కెకెట్టాడు.

బిందెలన్నీ చెల్లాచెదురయ్యాయి.

అంతలోనే...నీళ్ళట్యాంకు నుండి నీళ్ళు రాసాగాయి.

అందరూ..'నేను ముందు!"...నేను ముందు!" అంటూ తమ బిందెలతో ప్రక్కవాళ్ళను తోస్తూ ..రక్కుతూ...ముందుకు సాగుతున్నారు.

నేను కూడా వాళ్ళతో పాటే ముందుకు కదిలాను.

ఆడాళ్ళ సిగలు వూడిపోయాయి!!

మగాళ్ళ చొక్కాలు చినిగిపోయాయి!!

బట్టతల వున్నవాళ్ళు... బిందెలను వదిలేసి... తలను చేతుల్తో కప్పుకున్నారు. ఎవరికి వాళ్ళే ముందుకు వెళ్ళాలనే తలంపుతో... ప్రక్కవాళ్ళను క్రిందికి తోయసాగారు.

ఒకరు... నాజుట్టు పీకారు..

ఇంకొకరు... నా చొక్కా చింపేసారు.

మరెవరో....నా ఇత్తడి బిందెను లాక్కున్నారు.

కొందరు... నన్ను బిందెలా పైకెత్తి విసిరారు. దెబ్బకి .... డైరెక్టుగా... మా అక్కయ్య వాళ్లింట్లో పడ్డాను.

* * *

"ఫలానాయనా...!", "ఫలానాయనా...!!", "ఫలానాయనా..!!!" మూడుసార్లు నాపేరు పిల్చాడు అటెండర్.

నేను, నెమ్మదిగా ఇంటర్‌వ్యూ హాల్లోనికి ప్రవేశించి, ఇంటర్‌వ్యూ చేయబోయే వారికి విష్ చేసి కూర్చున్నాను.

"బాబూ...! తలకు... ఆ కట్టేమిటి?" అడిగాడు ఒకాయన.

'నీళ్ళ భాగోతం చెబితే నవ్వుకుంటారు కాబట్టి మరేదైనా చెప్పాలి' అని మనసులో అనుకుని... "పూలకుండీ జారి తలమీద పడింది సార్!" అన్నాను.

"ఐసీ! మొహం మీద...ఆ గాట్లేమిటి? ఎవరో... గోళ్ళతో రక్కినట్టున్నారు?"

"అవునుసార్! మా ఊళ్ళో... నేను ప్రతిరోజూ ఉదయం జాగింగ్‌కు వెళ్తాను. ఊరి చివర ఓ అడవి వుంది. ఆ అడవిలో పులులున్నాయి. నేను, మొన్న జాగింగ్‌కు వెళ్ళినప్పుడు ఓ పెద్దపులి నామీదికి లంఘించింది. నేను దానితో పోరాడి... భయపెట్టి అడవిలోనికి తరిమేసాను. అప్పుడయిన గాయాలివి! పులిగోళ్ళ... గాట్లు!!"

"ఓ ఫెంటాస్టిక్! ప్రాణాలకన్న విలువైనవి ఏవి?"

"మంచినీళ్ళు!"

"గుడ్! ఈ ప్రపంచంలో అత్యంత మేధావి ఎవరు?"

''మంచినీళ్ళను అతి జాగ్రత్తగా వాడ గలిగేవాడు"

"గుడ్... గుడ్!! ఈ జాబు మీకే!"

నాకు తెలుసు ఇంక ఇంతకన్న కొశ్చెన్లు అడగరనీ, అడగలేరనీ...

"థ్యాంక్యూ సర్!" అంటూ లేచాను. పైకి సంతోషంగా అలా అన్నానే గాని గుండెల్లో పెద్ద సైజు రాయేపడింది. ఎందుకంటే ఇప్పుడు నాకున్నవి రెండే రెండు అవకాశాలు.. మొదటిది ఉద్యోగాన్ని అంగీకరించి నీళ్ళ సమరాన్ని నిత్యకృత్యంగా స్వీకరించి బ్రతికినంతకాలం రోజూ చావటం. రెండవది ఉద్యోగానికి నీళ్ళొదులుకుని వేరే ఉద్యోగం దొరికిందాకా అందరిచేతా మాటలు పడుతూ భన్తు బ్రతకటం..ఏం చెయ్యాలో తెలీక కథ మాత్రం రాసేసి నిర్ణయం పాఠకులకు వదిలేస్తున్నా!!! ◆

# తాతా థిత్తై తధిగిణతోం

సీరియల్ 10

- జీడిగుంట రామచంద్రమూర్తి

| పాత్రలు | నటీనటుల సజేషన్ |
|---|---|
| వీరభద్రం | - కోట శ్రీనివాసరావు |
| విష్ణుమూర్తి | - నూతన్‌ప్రసాద్ |
| శ్రీరామ్ | - తరుణ్ |
| అశ్విని | - శ్రియ |
| పార్వతమ్మ | - అన్నపూర్ణ |
| హనుమంతు | - గుండు హనుమంతరావు |
| అనంత్ | - గోపీచంద్ |

పైన ఉదహరించిన నటీనటులను మనసులో ఉంచుకుని ఈ సీరియల్‌ను మీ మనో నేత్రాలతో తిలకించండి.



## జరిగిన కథ

రాజు పాలెం అనే గ్రామంలో రావ్ బహద్దూర్ వంశానికి చెందిన వీరభద్రం అనే స్కూలు మాష్టారు ఉంటారు. ఆయనంటే ఆ ఊరి మొత్తానికి భక్తితో కూడిన భయం. చీటికి మాటికి భార్యపై రుసరుస లాడుతుంటాడాయన. వీరభద్రం పెద్దకొడుకు శ్రీరామ్ పట్నంలో చదువుతూంటే చిన్న కొడుకు లక్ష్మణమూర్తి తండ్రి దగ్గరే ఉండి పదోతరగతి చదువుతూ ఉంటాడు. శ్రీరామ్‌ను అశ్విని ప్రేమిస్తూ ఉంటుంది. తనకు బాకీగా ఉన్న కట్నం బాపతు సొమ్మును రెడీగా ఉంచమని మామ వీరభద్రంకు ఉత్తరం రాస్తాడు రాజేంద్ర . సంక్రాంతి పండుగకు అల్లుడు రాజేంద్ర, కూతురు గీతలు వస్తారు. మావల సంఘం సెక్రటరీ అప్పారావు ఆత్మహత్య చేసుకోటానికి ప్రయత్నించినట్టు వీరభద్రానికి తెలుస్తుంది. అత్తగారి కోరిక మేరకు తనకు రావలిసిన కట్నం బాపతు సొమ్ము రాబట్టు కోవడానికి ఒక సంవత్సరం గడువిస్తాడు రాజేంద్ర. కాలేజీనుండి ఇంటికి బయలుదేరిన శ్రీరామ్‌ను తన ఇంటికి తీసుకెళ్లి తండ్రికి పరిచయం చేస్తుంది అశ్విని. శ్రీరామ్ వివరాలను కనుక్కున్న విష్ణుమూర్తి తన మిత్రులతో కలసి వీరభద్రం ఇంటికి వస్తాడు. -(ఇక చదవండి)

"ధనుంజయగారూ! ఈ సంబంధం కుదిరేది కాదు!'' కర్చీఫ్‌తో ముఖం తుడుచుకుంటూ పక్కనే నిలబడ్డ పెద్ద మనిషితో నెమ్మదిగా అన్నాడు విష్ణుమూర్తి.

అయోమయయంగా చూశాడు సదరు ధనుంజయ పేరుగల పెద్దమనిషి.

"అసలే ఆయన ఛండశాసనుడట!..పైగా మన మాటలన్నీ వినేవుంటాడు. గారాలకూచి, కోడలుగా 'గెటౌన్' కాగలదా? అని!" తన సందేహాన్ని వ్యక్తంచేశాడు విష్ణుమూర్తి వెంటనే.

"అబ్బాయి గుణగణాలు ముఖ్యంకానీ వియ్యంకుడి ముఖంతో మనకు అవసరం వుండదు కదండీ...! రేపు తమ అల్లుడుగారు మనూరొచ్చి తమ ఇంట్లోనే వుండి మీ బిజినెస్ వ్యవహారాలు చూసుకుంటే అప్పుడిక అమ్మాయిగారికి, మామగారి ఫేసుతో 'పేచీ' మాత్రం ఏముంటుందీ?'' ధనుంజయం నచ్చచెప్పాడు.

"అదీ పాయింటే!"

మరికొద్ది క్షణాల్లో వీరభద్రం వీధిలోంచి రానే వచ్చాడు.

"ముందు ఆ సోఫాలోంచి లేవండి!" వస్తూనే స్టూడెంటు మీద మండిపడినట్టు అరిచాడు.

బెంచీ ఎక్కమంటాడేమోనన్నంత భయంగా చూస్తూ నిలబడ్డాడు విష్ణుమూర్తి.

ఓ మూలగా నుంచుని చూస్తున్న నారాయణ ముసిముసిగా నవ్వుకుంటూ అనుకున్నాడు మనసులో

"తాతా తధిగిణతోం.."

'ఎంతవారైనా కాంతాదాసులే' అని హరిదాసు చెప్పినట్టు 'కార్లో వచ్చిన వాళ్లయినా అయ్యగోరి నోరు చూస్తే పరారే' అనుకుంటూ, నీళ్ళ కావిడ భుజాన వేసుకుని వెళ్లిపోయాడు.

"ఉఁ!శలవీయండి! ఈ దరిద్రపు ఫేసు గల ఉగ్రనరశింహునితో తమకేం పని పడినదో త్వరగా శలవీయండి!'' వ్యంగ్య ధోరణిలో అడిగేడు వీరభద్రం.

"మీరు ముందుగా మమ్మల్ని మన్నించాలి!... మీరు, 'మీరే' అని తెలియక...'' నీళ్లు నమిలేడు విష్ణుమూర్తి.

"ఇప్పుడు తెలిసివచ్చినదికదా!...వచ్చిన పని చెప్పి దయచేయుడు!"

"ఆ పాయింటుకే వస్తున్నా మేష్టారూ!... అంటే... అదీ...! మా 'అబ్బాయికి' మీ 'అమ్మాయి'నిచ్చి పెళ్ళి చేయాలనీ...''

"మీ బొంద...మా కుమార్తెకు వివాహమై రెండు సంవత్సరములైనది..! తమరిక వెళ్ళవచ్చు!"

తన 'డైలాగ్ డెలివరి ' లో జరిగిన పొరపాటు తెలుసుకుని, నాలిక కరచుకున్నాడు విష్ణుమూర్తి.

"ఛ! మాట తడబడ్డాను...మన్నించాలి! మీ 'అబ్బాయి' శ్రీరామ్‌కి మా 'అమ్మాయి' అశ్వినినిచ్చి...'' వీరభద్రం ముఖంలోకి చూస్తూ నవ్యంగా మాట్లాడేందుకు ధైర్యాన్ని కూడదీసుకుంటున్నాడు.




"వీల్లేదు! అది జరగని పని!'' మధ్యలోనే అన్నాడు వీరభద్రం.

ఇప్పుడు విష్ణుమూర్తితో వచ్చిన పెద్దలిద్దరూ కల్పించుకున్నారు.

"అయ్యా! తమరలా కోప్పట్టంలో తప్పు లేదు... జరిగిపోయిందేదో జరిగి పోయింది. మీరు పెద్దవారు!.. ఆగ్రహం తగ్గించి శాంతంగా వినండి! అసలు సంగతేమిటంటే వీరు 'విస్సనపేట విష్ణుమూర్తి' గారనీ కృష్ణ పట్నానికి ఏకైక ధనవంతులు!" చెప్పాడు ధనుంజయ.

"అయితే ఏమిటట తమబొంద?... ఏ పాలసముద్రమునకో పోయి, ఆదిశేషుపైన పవళించమనండి...ఆదిలక్ష్మి చేత పాదము లొత్తించుకొమ్మనండి...!"

"ఆహా!...మీ మాటల్లో హాస్యరసం తొణికిసలాడుతోంది'' పొగిడితే తమ దారికి వస్తాడన్న ఆలోచనతో రెండో పెద్దమనిషి అందుకున్నాడు.

"ఇంకానయం..అల్లపురసం కారుతున్న దనలేదు... ఇంతకీ తమరెవరో?"

"చిత్తం!.. నాపేరు సుబ్బరాజు!... అతనిపేరు ధనుంజయ...మేమిద్దరం వీరికి ఆత్మీయులం!"

"అందుకే కాబోలు భట్రాజులై పొగడు తున్నారు..."

"మీరేమనుకున్నా సరే! ఉన్నమాట చెప్పక తప్పదు... మా విష్ణుమూర్తిగారికి మూటలకొద్దీ డబ్బుంది.....కోటలాంటి బంగళావుంది!.. ఆ బంగళాకీ, కోట్లధనానికీ ఏకైక వారసురాలు వారి కుమార్తె!" చెప్పేడు సుబ్బరాజు.

"అంతేకాదు మాస్టారూ! వారమ్మాయికి డిగ్రీఎత్తు చదువుంది. చందమామ ఎత్తు అందముంది.... నయాగారా జలపాతమంత ఉధృతమైన చలాకీతనముంది'' ధనుంజయ తన పాండిత్యాన్ని ప్రదర్శించాడు.

వీరభద్రం ఛివాల్న కుర్చీలోంచి లేచాడు - కానీ మా సుపుత్రునికి ఏనాడో నిశ్చయం చేసుకున్న మేనరికమున్నది... ఆరు నూరైననూ, నూరు ఆరైననూ వేరే సంబంధం మాకు వలదుగాక వలదు! వేరొకరైన మీ ప్రేలాపనలు వీధిలో వినిన వెంటనే మీ కార్లటైర్లు తెగ్గోసి మీనోట నాలికలు కత్తిరించి వచ్చిన దారినే సాగనంపి యుండెడి వారు!'' అన్నాడు.

ఇక లాభం లేదనుకున్నాడు విష్ణుమూర్తి...అటో ఇటో తేల్చేసుకోవాలనుకున్నాడు.

"అదికాదు మేస్టారూ!.. మీ అబ్బాయి,మా అమ్మాయి గాఢంగా ప్రేమించుకున్నారు!"

"ఆవండి మీ అధిక ప్రసంగము!ప్రేమించుటా, కామించుటా మా సంప్రదాయమునకు విరుద్ధము!...అసలు మా రాముడికి 'ప్రేమ' అనే పదానికి అర్ధము కూడా తెలియదు... బహుశా మీ పుత్రికే మా చిరంజీవికి ఏ మందో మాకో ఇచ్చి ముగ్గులోకి లాగి వుండవచ్చు. మీరు అశ్రద్ధ చేసినచో కాలు జారగలదు!..అప్పుడిక మరే తలమాసిన వాడెవడూ మీ కుమార్తెను చేసుకొనుటకు ముందుకు రాడు....అటుపై మీ కోట్ల ఆస్తికానీ..., కోటవంటి బంగళా కానీ... మీ పరువును కాపాడలేవు... జాగ్రత్త!'' ఆ మాటలువిన్న విష్ణుమూర్తికి ఒళ్లుమండి పోయింది.

"ఇక ఆపవయ్యా!...'ఏదో పెద్దవాడివి కదా' అనీ, 'మగపిల్లవాడి తండ్రివి కదా' అనీ ఇంతసేపూ మర్యాదిచ్చిమాట్లాడేను!.. కానీ నువ్వు నోరు పారేసుకుంటున్నావ్.. కారు కూతలు కూస్తున్నావ్.. మా 'అశ్విని' అంటే నాకు ప్రాణం కనకా, అది మీ అబ్బాయంటే ముచ్చట పడింది కనకా నీ ఇంటికి ముష్టికొచ్చాను!.. అంతేతప్ప నా కూతురుకి సంబంధం దొరక్కకాదు. నేను తల్చుకుంటే అరగంటలో అమెరికా అల్లుణ్ణి కొనగలను! ...తెలుసా?'' అన్నాడు నిలువెల్లా ఆవేశంతో ఊగిపోతూ.

"శుభం!...ఆపని చేయండి!...కానీ హెచ్చరిక!...అమెరికాలో అదేదో 'ఎయిడ్స్' రోగము తీవ్రముగా వున్నదట... వివాహమునకు ముందు నీక్కాబోయే అల్లునికి రక్త పరీక్ష చేయించుకో...లేదంటే ఏ 'పులిరాజా' వాతపడునో ఏమో'' పెడసరంగా అన్నాడు వీరభద్రం.

"ఛీ! మీ 'ఫేసే' దరిద్రంగా వుందనుకున్నాను.. మీ 'మాటలు'మరింత దరిద్రంగా వున్నాయి.. మీతో మాట్లాడి, నేను మహా దరిద్రుణ్ణి కాలేను!'' అంటూ విసవిసా వీధిలోకి వచ్చి కారెక్కేశాడు విష్ణుమూర్తి.

అప్పటి దాకా వీళ్ళ సంభాషణంతా వంటింట్లో కూర్చుని వింటున్న పార్వతమ్మ హాల్లోకి వచ్చింది....

"నాది దరిద్రపు ఫేసట! తగిన శాస్తి చేసి పంపించాను!..." ఆమెతో గర్వంగా చెప్పాడు వీరభద్రం.

* * *

ఆ రోజుతో పరీక్షలైపోయాయి.

ఆఖరి పరీక్ష కూడా బాగా రాసిన ఆనందంతోనూ, వెంటనే తన ఊరికి ప్రయాణమవ్వాలన్న ఉత్సాహంతోనూ, వేగంగా, 'హాస్టల్' వైపు నడుస్తున్నాడు శ్రీరామ్.

అంతలో, హఠాత్తుగా అతని పాదాల ముందు ఓ మనీపర్సు వచ్చిపడింది. ఎక్కణ్ణించి వచ్చిందో అర్థంకాక, అటూ ఇటూ చూశాడు... చుట్టు పక్కల ఎవ్వరూ కనిపించలేదు. మెరిసిపోతూ అందంగా కనిపిస్తున్న ఆ పర్సును చేతిలో తీసుకుని అందులో ఏదైనా 'విజిటింగ్ కార్డు' లాంటిది ఏదైనా కనిపిస్తుందేమోనని తెరచిచూశాడు.

యధాలాపంగానే పర్సులోవున్న అరలన్నీ చూశాడు. చినిగిపోయిన రూపాయినోటు తప్ప అందులో మరేంలేదు. ఆ మనీ పర్సును, తిరిగి రోడ్డుమీదనే విసిరేయ బోయాడు... అదేక్షణంలో... రోడ్డుకి అవతలివైపున వున్న కిళ్లీషాపు దగ్గర్నించి ఇద్దరు యువకులు శ్రీరామ్ వైపు వస్తూ పిలిచారు

"ఏయ్ మిస్టర్!"

శ్రీరామ్ ఆగిపోయాడు.

ఇద్దరూ అతనికి దగ్గరగా వచ్చారు. చాలా బలిష్టంగా, ఎత్తుగా వున్నారు. ఒకడు జీన్స్‌ప్యాంటు మీద టీషర్టు వేసుకున్నాడు. రెండోవాడు లాల్చీ పైజామాల్లో వున్నాడు. చూడబోతే రౌడీల్లా కనిపించారు..

"ఆ పర్సునాది!" అన్నాడు టీ షర్టు రౌడీ.

"తీసుకోండి!" మర్యాదగానే, దాన్ని అతని చేతికి అందించాడు శ్రీరామ్.

అతను పర్సు తీసుకుని ఆత్రుతగా తెరచి చూశాడు

"ఇందులో డబ్బేది?"

"డబ్బా?" తెల్లబోయాడు శ్రీరామ్

అవును!డబ్బే! మనీపర్సులో 'డబ్బు' కాక బఠానీలుంటాయా?"

ఏమో!..నాకు తెలీదు నాకాళ్ళ దగ్గరకొచ్చి పడితే 'ఎవరిదో' అనుకుంటూ తీసాను. 'పర్సులో డబ్బేంలేదు!' చెప్పాడు.

ఇప్పుడు 'పైజామా' కుర్రాడు శ్రీరామ్ మీదకు వచ్చాడు.

"ఏయ్ మిస్టర్! నకరాలు.... చేస్తున్నావా?... మాతో పెట్టుకున్నావంటే, మట్టికరిపించేయగలం!.. మర్యాదగా అయిదువేలూ ఇచ్చేయ్!" అన్నాడు.

"అయిదువేలా?...."

"అవును! ఇంతకముందే 'బ్యాంక్' లో 'డ్రా' చేశాను!... అన్నీ 'వెయ్యి' నోట్లు!... నామాట




అబద్ధం అనుకుంటే బ్యాంక్‌కి రా!... చెప్పిస్తాను!" టీ షర్టు కుర్రాడు చెప్పాడు.

"అబద్ధం!...పర్సులో చిరిగిపోయిన రూపాయినోటు తప్ప ఇంకేం లేదు!" మొండిగా అన్నాడు శ్రీరామ్.

"ఓహో! చిరిగిపోయింది కాబట్టి దాన్ని వదిలేసి -'వెయ్యి' నోట్లు అయిదూ నొక్కేశావన్నమాట!.. మర్యాదగా డబ్బివకపోతే షేపులు మారిపోతాయ్" అంటూ అతను శ్రీరామ్ కాలరు పట్టుకున్నాడు.

శ్రీరామ్ బెదిరిపోయాడు... ఎవరైనా చూస్తే తనపరువు పోతుందన్న భయం ఒకవైపు వాళ్ళనుంచి ఎలాతప్పించుకోవాలా అనే ఆందోళన... మరోవైపు...! పరీక్షలు బాగా రాసిన ఆనందం, ఇంటికి తిరిగివెడుతున్న ఉత్సాహం- వుట్టికెగిరిపోయాయి.... పారిపోయేందుకు ధైర్యం లేకపోయింది... ఏడుపొచ్చినంత పనైంది..

అంతలో కీచుమని శబ్దం చేస్తూ-సడెన్ బ్రేకుతో అతనిపక్కగా 'సాంత్రో' వచ్చి ఆగింది....

అందులోంచి అశ్విని క్రిందకు దిగింది.

"ఏయ్..ఎవరు మీరు?... ఎందుకితన్ని బెదిరిస్తున్నారూ?"... శ్రీరామ్‌ని పక్కకి తప్పించి, తను రెండడుగులు ముందుకొచ్చి అడిగింది.

"నువ్వెవరివే? వాడికి పెళ్లానివా?... ప్రియురాలివా?..." - వెటకారంగా అడిగేడు టీషర్టుగాడు.

తనను అలా ఏకవచన ప్రయోగం చేయటంతో శ్రీరామ్‌కి కోపం ముంచుకొచ్చింది..

"మర్యాదగా మాట్లాడు!" అంటూ వాడిమీదకు వెళ్ళబోయాడు....

అతన్ని చేత్తోనే వారించింది అశ్విని.

అంతలో 'పైజామా' గాడు చెప్పాడు -

"మెడలో తాళిబొట్టులేదుగా.... పెళ్లాం కాదు! - బహుశా ప్రియురాలే అయ్యుంటుంది!"

అశ్విని వెంటనే వాడి దగ్గరగావచ్చి - భుజం మీద చేయివేసి అడిగింది -

"అవును! ప్రియురాల్నే!... మీకేమైనా ప్రాబ్లమా?"

వాడు కొంచెం డౌనయ్యాడు-

"అబ్బే....నువ్ చూడబోతే కార్లో వచ్చావ్!... 'కాస్ట్లీ' గా కనిపిస్తున్నావ్!... వీడేమో 'చీప్'గా కాలినడకన పోతున్నాడు.. పైగా 'పిక్ పాకెట్ గాడి'లా కనిపిస్తున్నాడు.. .ఇట్టాంటి వాడిని నువ్ 'లవ్' చేస్తున్నావంటే - నమ్మబుద్ధి కావటంలేదు!"

"షటప్! ఇతనిగురించి మరోమాట మాట్లాడితే - పళ్ళు రాలగొట్టి జేబులో వేస్తాను.."

"మేం గాజులు తొడిగించుకోలేదు... మీనమున్న మగాళ్ళం... రోషమున్న మొనగాళ్లం!.. నీలాంటి వాళ్ళను చాలామందిని చూశాం!... 'కారులో వచ్చిన పిల్లవికదా' అని కనికరించి ఊరుకుంటున్నాం. ... లేకపోతేనా?"

"ఊఁ! లేకపోతే ఏం చేస్తారూ".. - నడుంమీద చేతులేసుకుని వాళ్ళమీదకు వెళ్ళింది అశ్విని..

"సినిమాలు చూడవానువ్వు?.... అందమైన ఆడపిల్ల కనిపిస్తే మాలాంటి రౌడీలు ఏంచేస్తారో అదేచేస్తాం!"

"షటప్!"

"నమ్మకం లేదా?... రా చూపిస్తాం!" - అంటూ అశ్విని రెండు భుజాల్నీ గట్టిగా పట్టి - తన మీదకు లాక్కోబోయాడు వాడు...

శ్రీరాం గాభరాగా చూస్తూనే వున్నాడు....

రెప్పపాటులో, అతన్ని తప్పించుకుని - బలంగా అతని మెడమీద ఓ దెబ్బ వేసిందామె.. ఆ హఠాత్పరిణామానికి తట్టుకోలేక - వాడు వెనక్కి తూలి పడ్డాడు... ఈ లోగా రెండోవాడు ముందుకు దూకి అశ్విని చేయి పట్టుకుని వెనక్కి తిప్పబోయాడు. కానీ చురుగ్గా ఆమె - వెనక్కి తప్పించుకుని - వాడి వీపుమీద బలంగా తన్నింది...

ఇప్పుడు ఇద్దరూ కలసి అశ్వినిపై తిరగబడ్డారు...

చుట్టూ జనం పోగయ్యారు...

'కరాటే' స్టయిల్లో వాళ్ళిద్దర్నీ తిప్పికొట్టి - వాళ్ళ చేత మట్టి కరిపించింది. వాళ్లు కాళ్ళకు బుద్ధి చెప్పారు... శ్రీరాం అలాగే నిలబడిపోయి సినిమా చూస్తున్నట్టుగా - కళ్ళప్పగించి ఆ దృశ్యాన్ని చూస్తున్నాడు.

"అసలేం జరిగింది?" చేతులు దులుపుకుంటూ అతన్ని చేరుకున్న అశ్విని అడిగింది. విషయమంతా ఆమెకు వివరించాడు శ్రీరామ్.

-(ఇంకావుంది)




తెలుగువాడిగా పుట్టి చిన్నతనంలోనే బొంబాయి వెళ్లిపోయి తన 16వ ఏటనే మంచి పాటల్ని కంపోజ్ చేసిన ఒక సంగీత దర్శకుడితో తమ చిత్రానికి మ్యూజిక్ చేయిద్దామనుకున్నారు- అప్పటికే చక్కటి పేరు సంపాదించుకున్న కొందరు నిర్మాతలు. ఆ సంగీత దర్శకుడు 'అలాగే' అన్న తర్వాత ఓ అగ్ర కథానాయకుడితో ఒప్పందం కూడా జరిగింది. ఫలానా గాయకుడే తనకు పాడితీరాలని పట్టుబట్టాడా అగ్ర కథానాయకుడు. ఆ గాయకుడు తనతో పాడడానికి ఓ గాయని పేరును ప్రత్యేకంగా సూచించారు. ఈ అంక్షలు చూసేసరికి ఆ సంగీత దర్శకుడికి చిర్రెత్తుకొచ్చింది. నేను చేయనన్నాడు. నిర్మాతలు చిత్రం పూర్తిచేశారు. మొదట వారనుకున్న ఆ అగ్రకథానాయకుడు లేడు. ఆ నాయకుడు కోరుకున్న గాయకుడు, ఆ గాయకుడు సూచించిన గాయనిలేరు. సంగీత దర్శకుడిని మాత్రం ఒదులుకోలేదు ఆ నిర్మాతలు. ఆ సంగీత దర్శకుడు ఈ సంఘటనను ఓ సవాలుగా తీసుకుని బొంబాయి నుంచి ఓ గాయకుణ్ణి తీసుకువచ్చి తెలుగు పాటలు పాడించి అన్నిటినీ హిట్ చేశాడు.


'మనోరమ' చిత్రంలో కృష్ణకుమారి, బాలయ్య

ఆ సంగీత దర్శకుడు రమేష్‌నాయుడు. ఆ గాయకుడు తలత్ మహమ్మద్. ఆ చిత్రం పేరు

# మనోరమ

ఈ చిత్రం 1959లో విడుదలైంది. ఇందులో తలత్ మహమ్మద్ పాడిన మూడు పాటలతో పాటు సుశీల పాడిన మరో పాట కూడా హిట్ అయ్యింది. సముద్రాల జూనియర్ రాసిన ఆ నాలుగు పాటలు ఇవి:

అందాల సీమా సుధానిలయం
ఈ లోకమే దివ్య ప్రేమమయం ॥అందాల॥
వలపేమో తెలియకా తెలవారు బ్రతుకేలా
తొలినాటి ప్రేమలూ ఫలమైన కలయైనా
మాయని గాయమై మిగిలినా అది నయం
మాయని గాయమై మిగిలినా అది నయం ॥అందాల॥
అందాల వెలుగులా అలరారు ఆనందం
అలరించు సాగసులా ఆనందమున తేలే
తీయని అనుభవం దేవుని పరిచయం
తీయని అనుభవం దేవుని పరిచయం ॥అందాల॥

ఈ పాట తలత్ మహమ్మద్ సోలోసాంగ్. హీరో బాలయ్య మీద చిత్రీకరించారు. తలత్ మహమ్మద్ పాడిన తెలుగు పాట ఏదంటే ఎవరికైనా సరే ఠక్కున స్ఫురించే గీతం ఇదే. ఈ పాట వింటుంటే కొత్త తెలుగు గాయకుడు పాడేడనుకుంటాం గాని ఉత్తరాదికి చెందిన తెలుగురాని, గాయకుడనుకోలేం. అంత బాగా పాడించుకున్నారు రమేష్‌నాయుడు. ఉత్తరాది గాయకులతో పాడించడం ఓ క్రేజ్‌గా ఫీలవుతున్న ప్రతివారూ ఈ పాటని విని తెలుగుభాషకు మనం ఇస్తున్న గౌరవం పట్ల ఓసారి ఆత్మవిమర్శ చేసుకుంటే బావుంటుంది. సంగీతపరంగా ప్రతి మధ్యమ స్వరాలే ఎక్కువగా వినిపిస్తా యీ పాటలో.

అ: మరచిపోయేవేమో మాయని బాసలూ
మనవిదే ఓ సఖీ
ఆ: మరచిపోరాదోయి చేసిన బాసలూ
ఆశలు మూసినా
అ: వెలిగేను నీ కులుకే నా కన్నుదోయి
వెలిగేను నా మదిలో నీ చెలిమి హాయి
వెలుగొందు ఆ తారలాగా
మాయని బాసలూ మనవిదే ఓ సఖీ ॥మరచి॥
ఆ: విరబూసె ఈ పూవూ నీ పూజ కొరకే
విరిసేవు..దూరముగా వసివాడునోయి
నీదాన ఏ నాటికైనా
మాయని బాసలూ మనవిదే ఓ సఖా ॥మరచి॥

ఈ పాటను తలత్ మహమ్మద్, సుశీల పాడారు. బాలయ్య, కృష్ణకుమారి అభినయించారు. లలితగీతం అంటే ఎలా ఉండాలి? అసలు లలిత గీతం యొక్క నిజమైన నిర్వచనం ఏమిటి?ట్యూన్ బాగుంటే చాలుకదా...సాహిత్యానికి జీవం పోస్తూ ట్యూన్ చేయడమంటే ఏమిటి ? లాంటి వితండవాదాలకి ఎదురుగా ఈ పాటను నిలబెడితే చాలు - సమాధానం వేరేగా చెప్పనవసరంలేదు. ముఖ్యంగా 'విసిరేవు దూరముగా' దగ్గర 'నిజంగా వదులుకునేవు సుమా' అన్నట్టుగా ఓ రకమైన పాజ్ ఇస్తూ పాడించిన పద్ధతిని తలచుకుంటే రమేష్‌నాయుడు నిజంగా కీర్తిశేషుడే అనిపిస్తుంది. చక్కని 'కార్డ్ కంపోజిషన్'గా చెప్పుకోదగ్గ ఈ పాట శంకరాభరణం స్వరాలను స్పృశిస్తున్నా హిందుస్తాని రాగం 'అలయ్యా బిలావల్'కి దగ్గరగా ఉందని చెప్పాలి.

గతిలేని వాణ్ణి గుడ్డివాణ్ణి బాబయా
గంజి కొక్క ధర్మ మెయ్యి బాబయా ॥గతి॥
ప్రేమ తోడ లోకమేలు దేవుడూ ॥2॥
మా మొగాన మరణమైన రాయడూ
మా మొగాన మరణమైన రాయడూ
చావలేము బ్రతకలేము బాబయా
గంజి కొక్క ధర్మ మెయ్యి బాబయా ॥గతి॥
ఆకలి చికాకు తోడ వేగుతూ ॥2॥
చీకటి జగాన బ్రతుకు జీవులం
చీకటి జగాన బ్రతుకు జీవులం
చీదరించుకోకు బాబు నీదయా
గంజి కొక్క ధర్మ మెయ్యి బాబయా ॥గతి॥

ఈ పాటను తలత్ మహమ్మద్, సుశీల పాడారు. తన నటనతో ప్రేక్షకుల చేతిరుమాళ్ళను తడిపేసే నటుడు పెరుమాళ్ళు ఈ పాటలో ప్రధాన పాత్రధారి. సింధుభైరవి రాగచ్ఛాయలలో సంచరించే ఈ గీతం అర్థతకు అద్దంపడుతూ, అర్థం చెబుతూ ఒకసారి వింటే వెంటాడే విధంగా నిలిచిపోతుంది. ముఖ్యంగా 'ప్రేమతోడ లోకమేలు దేముడూ, మా మొగాన మరణమైన రాయడు' అనే వ్యాక్యాల ద్వారా మెర్సీ కిల్లింగ్ అనే పదాన్ని కవితారూపంలో చెప్పిన తీరుకి, దానికి రమేష్‌నాయుడు జతచేసిన ట్యూన్‌కి మనసు మారుమూలల నుండి కలుక్కుమంటుంది.

చందమామ రావే జాబిల్లిరావే
కొండెక్కి రావే గోగుపూలు తేవే ॥చంద॥
వెండిగిన్నెలో వేడి బువ్వతేవే
పైడి గిన్నె లో పాల బువ్వతేవే ॥వెండి॥
అందాల పాపకు అందించిపోవే
తెల్లమబ్బుల తేరు మీదరావే ॥తెల్ల॥
పాలవెన్నెల పానకాలు తేవే
అందాల పాపకు అందించిపోవే ॥చంద॥

'చందమామ రావే జాబిల్లి రావే' పాటను సుశీల పాడగా హీరోయిన్ కృష్ణకుమారి అభినయించింది. ఈ సన్నివేశంలో ఆమె ఎత్తుకుని లాలించిన చిన్ని కుర్రాడు -నటుడు ఎం. బాలయ్య కుమారుడు తులసీరాం. తర్వాత రోజుల్లో ఈ తులసీరాం మనకు 'పసుపుతాడు' 'శ్రీమతి ఒక బహుమతి', 'ఇల్లు -ఇల్లాలు పిల్లలు' చిత్రాలలో నటుడిగా కనిపించాడు కూడా. ఆంధ్రదేశంలో ప్రతిమాతృమూర్తీ పాడుకునే 'చందమామ రావే జాబిల్లిరావే' పాటకు మూలం అన్నమయ్య గీతమని చాలామందికి తెలియదు. 15వ శతాబ్దానికి చెందిన పదకవితా పితామహుడు అన్నమాచార్య రాసిన 'చందమామ రావొ జాబిల్లీ రావొ మంచి కుందనపు పైడికోర వెన్నపాలు తేవొ' అనే గీతం ఎన్నో సినీగీతాలకు ప్రేరణగా నిలిచింది. 1941లో వచ్చిన 'దేవత' చిత్రంలో సీనియర్ సముద్రాల రాసిన 'వెండి కంచాలలో పాలబువ్వందోయ్ పసిడి కంచాలలో పాలబువ్వందోయ్ తిందాము రావోయి జాబిల్లీ ఆడుకుందాము రావోయి జాబిల్లీ' అనే పాటలోని 'కొండెక్కి రావోయ్ కురువేరు తేవోయ్ పండువెన్నెల పిండి పానకం తేవోయ్' అనే వాక్యాలు ఈ చందమామ రావే పాటలో మారో రూపంలో చోటు చేసుకోవడం గమనార్హం. కాకపోతే ఆ పాట రాసింది సీనియర్ అయితే ఈ పాట రాసింది జూనియర్. ఇక రాగప్రధానంగా ఆలోచిస్తే అనుకుని చేస్తే తప్ప ఒక రాగానికి కట్టుబడి చేసే స్వభావం కాదు రమేష్ నాయుడిది. ఈ పాట వరకు చూసుకుంటే శుద్ధదైవతం. సాధారణ గాంధారం వంటి అన్యస్వరాలు పడుతున్నా ఎక్కువగా హరికాంభోజి రాగచ్ఛాయలలోనే ఈ పాట సంచరించిందని చెప్పవచ్చు.

తలత్ మహమ్మద్ తెలుగు పాటలు పాడిన చారిత్రక అంశాన్ని దృష్టిలో ఉంచుకుని పై పాటలు దొరికితే భద్రపరిచి మరింత ప్రాచుర్యం కల్పించవలసిన అవసరం ప్రతి సంగీతాభిమానికీ ఉంది. ఆ మధ్య హెచ్.ఎం.వి.వారు విడుదల చేసిన 'తెలుగుపాట-హిందీనోట' అనే క్యాసెట్‌లో పైన పేర్కొన్న మొదటి మూడు పాటలు చోటు చేసుకోవటం ఓ రకంగా అదృష్టమే! ◆

# సరిగపదమని ఫలితాలు

7

## డ్రాలో గెలుపొందిన వారు

| | |
|---|---|
| ఆల్ కరెక్ట్ | : కూచి కార్తీకవర్ధని, హైదరాబాద్ |
| ఒక తప్పుతో | : బి.చంద్రశేఖరయ్య, చిత్తూరు |
| రెండు తప్పులతో | : ఎస్.కె.షబ్నం, నెల్లూరు |
| మూడు తప్పులతో | : ఎన్.తనూజ, కుర్దారోడ్, ఒరిస్సా |

ఈ పోటీ ఫలితాలను డ్రా తీయడానికి - అడగగానే వెంటనే ఒప్పుకొని ఎంతో ఆనందంతో సహకరించిన దర్శక సంగీత దర్శకుడు శ్రీ ఎస్వీ కృష్ణారెడ్డి గారికి, నిర్మాత శ్రీ అచ్చిరెడ్డి గారికి, విజేతలతో పాటు పజిల్ కూపన్లను పంపిన ప్రతి ఒక్కరికీ 'హాసం' కృతజ్ఞతలు.






మీ (మా) హా(స్య)సం సంగీత పత్రిక ప్రతి ఎడిషన్లోనూ నా పేరు చూసుకుంటున్నా - ఒక్కసారైనా, కనీసం ఒక్కసారైనా బహుమతి పొందాలన్న ఆకాంక్షతో పట్టువదలని విక్రమార్కునిలా చేసిన నా ప్రయత్నం ఇన్నాళ్లకు ఫలించింది. నాకు బహుమతి వచ్చిందన్న మీ ఫోన్‌కాల్‌తో నేనెంతో ఆశ్చర్యపోయా! ఆనందించాం ఇంటిల్లిపాదీ!!! కొంకుదురు శ్రీ కృష్ణారెడ్డి గారు లక్కీడ్రాలో నాపేరు తీసినందుకు కృతజ్ఞురాల్ని!!!

**- కూచి కార్తీకవర్ధని, హైదరాబాద్**



మా అభిమాన 'హాస్య సంగీత పత్రిక'లో నాకు బహుమతి వచ్చిందని తెలిసి ఎంతో సంతోషించాను. అదీ నా అభిమాన దర్శక, నిర్మాతలైన శ్రీయుతులు అచ్చిరెడ్డి, ఎస్వీ కృష్ణారెడ్డి గార్లు తమ చేతుల మీదుగా నన్ను ఎంపిక చేయడంతో మది పులకించి పోయింది. 'హాసం' పత్రిక, వార పత్రికగా మారి పాఠకుల మనస్సు రంజింప చేయడంలో ప్రథమస్థానంలో నిలవాలని ఆశిస్తూ...

కృతజ్ఞతలతో...

**- బి.చంద్రశేఖరయ్య, టీచర్, రామసముద్రం**

'హాసం' ఎడిటర్ గారు పంపిన టెలిగ్రామ్ అందినది. దానితో నేను షాక్ అయ్యాను. ఎడిటర్ గారితో స్వయంగా ఫోన్‌లో మాట్లాడాను. 'సరిగపదమని' పోటీలో నేను విజేతగా ఎంపికైనట్లు చెప్పారు. చాలా ఆనందించాను. ఎస్వీ కృష్ణారెడ్డి గారి చేతుల మీదగా తీసిన డ్రాలో నాకు ప్రైజ్ వచ్చినందుకు చాలా ఆనందంగా ఉంది. నేను 'హాసం' 40వ సంచిక నుంచి రెగ్యులర్‌గా చదువుతున్నాను. ఆ పుస్తకాలన్నీ జాగ్రత్తగా పెట్టుకున్నాను. అందులో పాత పాటలు బాగా నచ్చాయి. ఎస్వీ కృష్ణారెడ్డి గారికి, 'హాసం' కుటుంబీకులకు నా కృతజ్ఞతలు.

**- ఎస్.కె.షబ్నం, నాయుడుపేట, నెల్లూరు**



సోదరి హుమేరాతో షబ్నం



'హాసం' పత్రిక నా ప్రియమైన పత్రిక. నవ రసాలలో ఒక రసమైన హాస్యమంటే నాకెంతో ఇష్టం. సంగీతమంటే మరీమరీ ఇష్టం. నాకు పజిల్స్ అంటే చాలా అభిమానం. 'హాసం' పత్రిక సదా బాగా రాణించాలని ఆశిస్తున్నాను. 7వ పజిల్‌లో నాల్గవ విజేతగా నన్ను ఎంపిక చేసినట్లు టెలిగ్రాం అందుకుని చాలా సంతోషించాను. ఈ ఉగాదికి నేను పొందిన మొట్టమొదటి గిఫ్ట్ ఇది. ఎస్వీ కృష్ణారెడ్డి గారి చేతుల మీదుగా తీసిన డ్రాలో నన్ను ఎంపిక చేశారన్న విషయం నా ఆనందానికి హద్దులు లేకుండా కాసేపు ఏం చేస్తున్నానో నాకే తెలియలేదు. నాలాంటి అభిమానులకు 'హాసం' పత్రిక ఒక వరం లాంటిది. ఎస్వీ కృష్ణారెడ్డి గారికి కృతజ్ఞతలు.

**- ఎన్.తనూజ, ట్రాఫిక్ కాలని, కుర్దా రోడ్, ఒరిస్సా**

రచన : దాశరథి　　　　గానం : ఘంటసాల, సుశీల

అతడు : ఓ వన్నెల చిన్నెల కన్నియా
నీ నల్లని జడలో పూలు
నా గుండెలలో బాణాలు-ఓ పిల్లా
నీ నల్లని జడలో పూలు నా గుండెలలో బాణాలు
నీ వెవరికి మన సిచ్చావే నీ వెవరికి మనసిచ్చావే - యహో,
ఆమె : ఈ చల్లని వెన్నెల రేయీ నా మనసును దోచితివోయీ
ఓ రాజా, ఈచల్లని వెన్నెల రేయీ
నా మనసును దోచితివోయీ
నా సొగసులు నీ కొరకేలే నా సొగసులు నీ కొరకేలే - ఆహా
అతడు : ఆ చక్కని చుక్కల రేడూ నీ అందము చూచెను నేడూ
ఆమె : ఆహా(-
ఆ చక్కని చుక్కల రేడూ నా అందము చూచెను నేడూ
అతడు : ఏదో కలతపడి తన మనసు చెడి
ఏదో కలతపడి తన మనసు చెడి
అబ్బాయిలు : తెరలో దాగే నెందుకే ॥నీ నల్లని॥
ఆమె : నీ చక్కని మనసును చూచి తన మచ్చను మదిలో తలచి
నీ చక్కని మనసును చూచి తన మచ్చను మదిలో తలచి
ఏదో కలతపడి తన మనసుచెడి
ఏదో కలతపడి తన మనసుచెడి
అబ్బాయిలు : తెరలో దాగే అందుకే ॥ఈ చల్లని॥
అతడు : నువు వలచిన వాడె నవాబు నువు మరచిన నాడు గరీబు
ఆమె : నువు పిలిచిన నాకు హుషారు నను తలవనిచో బేజారు
అతడు : నే మెచ్చినాను రావే
ఆమె: నువు నచ్చినావు లేవోయీ
అతడు : నే మెచ్చినాను రావే
ఆమె: నువు నచ్చినావు లేవోయీ
అతడు : పదవే పోదాం హాయిగా ॥నీ నల్లని॥

రచన : కొసరాజు　　　　గానం : మాధవపెద్ది, పిఠాపురం,బృందం

రమణయ్య : అయ్యయ్యో, చేతిలో డబ్బులు పోయెనే,
అయయో, జేబులు ఖాళీ ఆయెనే
ఉన్నది కాస్తా ఊడింది సర్వ మంగళం పాడింది
పెళ్లాం మెళ్ళో నగలతో సహా తిరుక్షవరమై పోయింది ॥అయ్యయ్యో॥
సదానందం:ఆ మహా మహా నలమహారాజుకే తప్పలేదు భాయీ
అందరూ : ఓటమి తప్పలేదు భాయీ
రమణయ్య : మరి నువ్ చెప్పలేదు భాయీ
సదా : అది నా తప్పుకాదు భాయీ
తెలివి తక్కువగ చీట్ల పేకలో దెబ్బతింటివోయీ -
బాబూ నిబ్బరించవోయీ ॥అయ్యయ్యో॥
రమణయ్య : నిలువుదోపిడీ దేవుడికిచ్చిన ఫలితం దక్కేది -
ఎంతో పుణ్యం దక్కేది
అందరూ : గోవిందా-గోవిందా రమణ: ॥నిలువు దోపిడీ॥
రామ : చక్కెర పొంగలి చిక్కేది
రమణయ్య : ఎలక్షన్లలో ఖర్చుపెడితే ఎం.ఎల్. ఏ. దక్కేది
సదా మనకూ అంతటి లక్కేది? ॥అయ్యయ్యో॥
గెల్పూ ఓటమి దైవాధీనం చెయ్యి తిరగవచ్చు
సీతారాం : మళ్ళీ ఆడి గెల్వవచ్చు
రమణయ్య : ఇంకా పెట్టుబడెవడిచ్చు?
శెట్టి : ఇల్లూ కుదవబెట్టవచ్చు
అందరూ : ఊ(-
సదా : ఛాన్సు తగిలితే ఈ దెబ్బతో మన కరువు తీరవచ్చు
రమణయ్య : పోతే?
సదా : అనుభవమ్ము వచ్చు
రమణయ్య : చివరకు జోలె కట్టవచ్చు ॥అయ్యయ్యో॥

రచన : శ్రీ శ్రీ　　　　గానం : స్వర్ణలత, సుశీల, ఘంటసాల,

అనసూయ : సఖీ శకుంతలా! రెక్కలు ధరించి
ప్రియుని సన్నిధిని రివ్వున వాలగలేవా
ప్రియంవద : మనసులోని భావములే
విహంగములు కావా
మధురమైన లేఖ వ్రాసి
పంపించ రాదా
శకుంతల : వినుమా ప్రియతమా నా విరహగీతి
కనుమా ప్రియతమా నా హృదయరీతి
ఎరుగక జాలి- మది రగిలించే
ఎరుగక జాలి- మది రగిలించే
మదనుని శరముల వేడీ ॥వినుమా॥
దుష్యంతుడు : ఓలలనా కమలనయనా
ఓలలనా కమలనయనా
నా మనసే... నా మనసె దాచగలనా...
ఓ లలనా... కమలనయనా
తాపము తీరగ - చల్లదనాల
తామర వీవన గాలులతో
వేడుకమీర వీచెద బాలా
వేడుకమీర వీచెద బాలా
నిలిచెద నీ కనునీడలలో
ఓలలనా కమలనయనా

రచన : సి.నారాయణరెడ్డి　　　　గానం :ఘంటసాల, సుశీల

అ : చెలికాడు నిన్నే రమ్మని పిలువ
చేర రావేలా? ఇంకా సిగ్గు నీకేలా?
ఆ : ప్రియురాలి మదిలో ఏముందో తెలుసుకోలేవా
నన్నే తెలుపమంటావా? ॥అ: చెలికాడు॥
అ : నీ నవ్వులో ఏ పువ్వులో పన్నీరు చిలికాయీ ॥2॥
ఆ : కిరణాలలోనేగా సరోజం కిలకిల నవ్వేది ॥2॥
అ : అహహా
ఆ : అహా
అ : ఒహోహో
ఆ : అహహా
అ : ఒహో
ఆ : ఆ ఆ ఆ ॥అ : చెలికాడు॥
అ : నీ అందమే శ్రీగంధమై నా డెందమలరించే
ఆ : నీ రూపె దీపమ్మై ప్రియా నా చూపుల వెలిగించే
నీ రూపె దీపమ్మై ప్రియా నా చూపుల వెలిగించే
అ : అహహా
ఆ : అహా
అ : ఒహోహో
ఆ : అహహా
అ : ఒహో
ఆ : ఆ ఆ ఆ ॥అ : చెలికాడు॥
అ : నీ తోడుగ నడయాడగ
ఇంకేమి కావాలి?
ఆ : మధురాను రాగాలే ఫలించే తరుణం రావాలి
అ : అహహా
ఆ : అహా
అ : ఒహోహో
ఆ : అహహా
అ : ఒహో
ఆ : ఆ ఆ ఆ ॥అ : చెలికాడు॥

రచన : సి.నారాయణరెడ్డి    గానం :ఘంటసాల, సుశీల

ఆ : చిలిపి కనుల తీయని చెలికాడా
నీ నీడను నిలుపుకొందురా ... నిలుపుకొందురా వెల్గులమేడా
అ : నీలికురులవన్నెల జవరాలా
నీ కౌగిట నిలువుకొందునే పూలవుయ్యాల
ఆ : కనులముందు అలలుపొంగెనూ
అ : ఓ ఓ ఓ
ఆ : మనసులోన కలలు పండెనూ
అ : అలలే కలలై కలలే అలలై
గిలిగింతలు సలుపసాగెనూ ॥చిలిపి కనుల॥
అ : కొండలు కోయని పిలిచినవీ
ఆ : ఆ ఆ ఆ
గుండెలు హోయని పలికినవీ ॥కొండలు॥
ఆ : కోరికలన్నీ బారులు తీరి ॥కోరిక॥
గువ్వలుగా ఎగురుతున్నవీ ॥నీలి॥
ఆ : జగము మరచి ఆడుకొందమా
అ : ఆ ఆ ఆ
ఆ : ప్రణయగీతి పాడుకొందమా ॥జగము॥
అ : నింగీ నేలా కలిసినచోటా ॥నింగీ॥
నీవు నేనూ చేరుకొందమా ॥ఆ: చిలిపి॥

రచన : శ్రీ శ్రీ    గానం : మాధవపెద్ది ❶. పి.బి. శ్రీనివాస్ ❷

1. మామా, శత్రు భయంకరనామా
అందానికి చందమామా
మా మామ... ఈ సదానందానికి సాక్షాత్తూ మేనమామ
బలమున గామా-నీవే కద మా ధీమా
గుణధామా విశ్వాభిరామా మామా

2. కారుమబ్బుల బారు సారు నేలెడి తీరు
కోరమీసము పొందు కోరుకుందు
మృగరాజు జాలునే తెగనాడ జాలు... మామా
నీ ఘనమీసము పసందు కనుల విందు
గండు చీమలదండు కదలాడినటులుండు
నీ మీసము తెరంగు నీలిరంగు -హ!!
మెలిబెట్టి నిలబెట్టు మీసాల రోసాలు
గగనమండలముపై కాలుదువ్వు
ఎవరు మోయుచున్నారు ఈ అవని బరువు?
ఆది శేషుడా? కూర్మమా? కాదు కాదు
అష్ట దిగ్గజ కూటమా ? అదియు కాదు
1. ఆఁఐతే మరేదయ్యా
2. మామ మీసాలే భువికి శ్రీరామరక్ష!

రచన : కొసరాజు    గానం :పి.బి. శ్రీనివాస్, జమునారాణి

జోగా : రావే రావే బాలా, హలోమైడియర్ లీలా
రావే రావే బాలా, హలోమైడియర్ లీలా
ఇటురావే, ఇటురావే, ఐలవ్ యూ
లీల : పోవోయ్ పోవోయ్ బావా,
ఎందుకీ పెడత్రోవా ॥పోవోయ్॥
ఈ పల్లెల్లో మనపల్లెల్లో
ఈ పల్లెల్లో మనపల్లెల్లో
సాగవీవేషాలు, చాలునీసరసాలు
ఇక చాల్లే ఇకచాల్లే
జోగా : టిప్పు టాపు దొరసాని
అప్ టు డేటు అలివేణీ ॥టిప్పు॥
ఈ రోజుల్లో మనపోజుల్లో ఈ రోజుల్లో మనపోజుల్లో
ఇది దొరల ఫ్యాషనే రాణీ
లీల : పెద్దవాళ్లు చూస్తారు దేహశుద్ధి చేస్తారు
జోగా : వాట్ ?
లీల : పెద్దవాళ్లు చూస్తారు దేహశుద్ధి చేస్తారు
పచ్చిపచ్చి లవ్ చూపావంటే పిచ్చాస్పత్రిలో వేస్తారు
జోగా : నోనో!
లీల : పచ్చిపచ్చి లవ్ చూపావంటే
పిచ్చాస్పత్రిలో వేస్తారు
ఈ పల్లెల్లో మన పల్లెల్లో ఈ పల్లెల్లో మనపల్లెల్లో
సాగవీ వేషాలు, చాలు నీ సరసాలు
ఇక చాల్లే
జోగా : ఐ లవ్ యూ ॥రావే రావే॥
జోగా : తప్పేమున్నది మేడం
నాతో షికారు రావడం
లీల : ఇక్కడ పుట్టినవాళ్లం
ఎందుకు మనకీమేళం
ఈ పల్లెల్లో మనపల్లెల్లో ఈ పల్లెల్లో మనపల్లెల్లో
సాగవీ వేషాలు
చాలు నీ సరసాలు ఇక చాల్లే
జోగా : ఐ లవ్ యూ ॥రావే రావే॥

రచన : కొసరాజు    గానం : సత్యారావు, స్వర్ణలత బృందం

ఆ : రావయ్యా రావయ్యా
రావయ్యా మా యింటికి
రమ్మంటే రావేల మాయింటికి కృష్ణయ్యా
అ : దొంగచాటుగా దూరి వెన్నతిన్నావంట ॥2॥
ఆ : తలుపుమూసి పట్టబోతే తప్పుకున్నావంట ॥2॥
అ : మల్లెపూలతోటకాడ మాటువేసినా వంట
ఆ : పొన్నమానుమీదనెక్కి కన్ను గీటినావంట ॥రావయ్యా॥
గొల్లవారి వాడలకు కృష్ణమూర్తి
నీ వెందుకయ్యా వచ్చినావు కృష్ణమూర్తి
అ : ఓహోయ్-గుమ్మపాలు తాగిపోను వచ్చినాడు
గోపెమ్మలతో ఆడుకోను వచ్చినాడు
గోపెమ్మలతో పాడుకోను వచ్చినాడు
ఆ : ఎన్ని నేర్చినాడవయా
ఎంత మోసగాడవయా ॥ఎన్ని॥
అమ్మమ్మ,నమ్మరాదు అబద్దాల పుట్టవయా ॥రావయ్యా॥
ఆ : మాయదారి గోపాలబాలుడమ్మా, ముద్దులగుమ్మా
అ : మరువరాని యశోద పుత్రుడమ్మా, ముద్దులగుమ్మా
ఆ : సాటిలేని వయారి జాణడమ్మా, బంగారుబొమ్మా
అ : చక్కనయ్యా చిక్కాడు చూడవమ్మా ॥మాయదారి॥

## పాత్రలు - పాత్రధారులు

| | | | |
|---|---|---|---|
| రవి | : ఎ.నాగేశ్వరరావు | కాంతమ్మ | : జి.వరలక్ష్మి |
| సరోజ | : కృష్ణకుమారి | చలపతి | : మిక్కిలినేని |
| సదానందం | : రేలంగి | నాగయ్య | : మల్లాది |
| జగదాంబ | : సూర్యకాంతం | సీతారాం | : సీతారాం |
| భూషయ్య | : గుమ్మడి | శెట్టి | : బొడ్డపాటి |
| శాంతమ్మ | : నిర్మల | రామకోటి | : రామకోటి |
| రమణయ్య | : రమణారెడ్డి | సాయిబు | : మోహన్ |
| అనసూయ | : సంధ్య | పేరయ్య | : అల్లురామలింగయ్య |
| జోగారావు | : పద్మనాభం | పెండ్లికొడుకు | : బ్రహ్మానందరావు |
| లీల | : గిరిజ | నర్తకులు | : కుమారి శశి, జనార్ధన్ |


ఎ.వి.సుబ్బారావు


ప్రత్యగాత్మ


ఎస్.రాజేశ్వరరావు


కొసరాజు


శ్రీశ్రీ


దాశరథి


సి.నారాయణరెడ్డి


ఘంటసాల


సుశీల


మాధవపెద్ది


పిఠాపురం


పి.బి.శ్రీనివాస్


జమునారాణి


స్వర్ణలత

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| మాటలు | : ఆత్రేయ |
| పాటలు | : కొసరాజు, శ్రీశ్రీ, నారాయణరెడ్డి, దాశరథి |
| సంగీతం | : యస్.రాజేశ్వరరావు |
| ప్లేబాక్ | : ఘంటసాల, సుశీల, పి.బి.శ్రీనివాస్, మాధవపెద్ది, పిఠాపురం, జమునారాణి స్వర్ణలత, సత్యారావు |
| నృత్యం | : హీరాలాల్, పి.ఎస్.గోపాలకృష్ణన్, చిన్ని, సంపత్ |
| ఛాయాగ్రహణం | : ఎ.విన్సెంట్ |
| ఆపరేటివ్ కెమేరా | : సుందరం |
| శబ్ద గ్రహణం | : ఎ.కృష్ణన్, బి.ఎ., |
| రికార్డింగ్ | : హరనాథ్ |
| కళ | : జి.వి.సుబ్బారావు |
| ఎడిటింగ్ | : సంజీవి |
| స్టిల్సు | : సత్యం |
| పబ్లిసిటీ | : టి.వి.యస్.శర్మ |
| మేకప్ | : కె.నాగేశ్వరరావు, చౌదరి |
| మేనేజరు | : కె.రంగారావు |
| ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ | : పి.వి.సుబ్బారావు |
| అసోసియేట్ డైరక్టరు | : తాతినేని రామారావు |
| నిర్మాత | : ఎ.వి.సుబ్బారావు |
| కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం | : కె.ప్రత్యగాత్మ |
| స్టూడియో | : విజయా-వాహిని |

## కథా సంగ్రహం

భూషయ్య గ్రామపెద్ద. మోతుబరి. వంశ గౌరవాలకు సంప్రదాయాలకు ఎక్కువ విలువయిచ్చే స్వభావం గలవాడు. మొదటిభార్య కూతురు జగదాంబ. జగదాంబను మేనల్లుడు సదానందానికిచ్చి పెండ్లి చేసి, ఇంట్లోనే వుంచుకున్నాడు. రవి,లీల రెండవభార్య శాంతమ్మ బిడ్డలు. రవి విశాఖపట్టణంలో ఆనర్స్ చదువుతున్నాడు. రవిని విదేశాలకు పంపి పెద్ద చదువులు చదివించాలనీ, తనవంశ గౌరవం, సాంప్రదాయం నిలబెడతాడనీ అతని మీద ఎన్నో ఆశలు పెట్టుకున్నాడు.

కాంతమ్మ యౌవనంలో వుండగా చలపతి ఆమెకు మాయమాటలు చెప్పి, పెండ్లిచేసుకుని, మోసగించి పారిపోతాడు. లోకం దృష్టిలో పతిత అయిన కాంతమ్మ తన కూతురు సరోజను తీసుకుని, వూరువిడిచి విశాఖపట్నం చేరుతుంది. ఎలాగైనాతన బిడ్డకు సంఘంలో కులస్త్రీలకున్న స్థానం ఏర్పరచాలని, పెండ్లి చేయాలని ఆమె ప్రయత్నం. సరోజ మెడికల్ కాలేజిలో ఫైనల్ ఇయర్ చదువుతుంది.

విశాఖపట్టణంలో అన్ని కాలేజిల విద్యార్థులు వరదబాధితుల సహాయార్థం నృత్య ప్రదర్శనలు ఏర్పాటుచేస్తారు. ఆ సందర్భంలో రవి, సరోజలకు స్నేహం ఏర్పడుతుంది. క్రమంగా అది వారిమధ్య ప్రణయంగా మారుతుంది. ఈ సంగతి తెలుసుకున్న భూషయ్య తన వంశ మర్యాద, సంప్రదాయాలను గురించి హెచ్చరిస్తూ రవికి ఉత్తరం వ్రాస్తాడు. కాంతమ్మ కూడా సరోజను వారి పూర్వ చరిత్రను రవికి చెప్పమని హెచ్చరిస్తుంది. సరోజ ఎన్నోసార్లు చెప్పాలని ప్రయత్నిస్తుంది. కాని వీలుపడలేదు.

కాంతమ్మ పాత చరిత్ర రవి ఇతరులద్వారా వింటాడు. అతని మనస్సు వికలమవుతుంది. ఏకాంతంగా దీర్ఘాలోచనలో వుంటాడు ఇంతలో సరోజ వచ్చి తన తల్లిని, తన తండ్రి ఎలా మోసగించిందీ వివరంగా చెబుతుంది. రవి ఆమెను దగ్గరకు తీసుకుని, తాను తాత్కాలికంగా కలత చెందినా సరోజను వివాహం చేసుకుంటానని మాట ఇస్తాడు.

సరోజను పెండ్లి చేసుకుంటానని రవి, భూషయ్యకు చెబుతాడు. భూషయ్య మండిపడతాడు. కులగోత్రాలు లేని పిల్లను పెండ్లి చేసుకోవడానికి వీలు లేదంటాడు. తన నిర్ణయానికి వ్యతిరేకంగా పెండ్లి చేసుకుంటే యీ ఇంటిలోనే గాక తన హృదయంలో కూడా స్థానం వుండదంటాడు. అయినా రవి, సరోజను పెండ్లి చేసుకోవడానికే నిర్ణయించుకుంటాడు. దైవ సన్నిధిలో రవి, సరోజలకు వివాహం జరిపించి, వారిని దీవించి తీర్థయాత్రలకు వెళ్ళిపోతుంది కాంతమ్మ.

రవిని తన స్వంత వూరులోనే పోలీసు ఇన్‌స్పెక్టరుగా వేస్తారు. రవి, రమణయ్య పొరుగు ఇంటిలో కాపురం పెడతాడు. తన తల్లిని చూడాలని వచ్చిన రవిని భూషయ్య గేటులోనే అవమాన పరుస్తాడు.

రవి ఎవరో కులగోత్రాలు లేని పిల్లను పెండ్లి చేసుకున్నాడనే నెపంతో లీలకు వివాహం నిశ్చయమైన మగపెండ్లివారు విడిదినుంచి వెళ్లిపోతారు. ఇది తెలిసి రవి, సరోజ చాలా బాధపడతారు. పట్టుదలగల భూషయ్య అదే లగ్నానికి లీలను జోగారావుకిచ్చి పెండ్లి చేస్తాడు.

ఈ అవకాశాలన్నిటిని వుపయోగించుకొని ఎలాగైనా ఆస్తి తనపేర వ్రాయించుకోవాలని జగదాంబ సదానందానికి బోధచేస్తుంది. వీరి ప్రయత్నాలను అడుగడుగునా దెబ్బతీస్తుంటాడు జోగారావు. మేడమీద జరిగే గల్లంతు విని శాంతమ్మ హడావుడిగా పైకి వెళ్ళబోతుంది. కాలుజారి మెట్లమీదనుండి పడటంతో ఆమెకు బలమైన గాయాలు తగులుతాయి. ప్రమాద పరిస్థితిలో వున్న శాంతమ్మకు రవిని కడసారిగా చూసుకోవాలనే కోరిక కలుగుతుంది. చిట్ట చివరకు భూషయ్య రవిని పిలవడానికి అంగీకరిస్తాడు. కాని రవి ఆ సమయానికి వూరిలో లేడు. రవిని పిలుచుకురావడానికి వెళ్ళిన సదానందానికి జగదాంబ రవి రానన్నట్టు చెప్పవలసిందిగా చెబుతుంది. రవి రాకకొరకు ఎదురుచూస్తున్న శాంతమ్మ యీ వార్త విని మరణిస్తుంది.

అదే రాత్రి సరోజ మగబిడ్డను ప్రసవిస్తుంది. వూరి నుంచి తిరిగి వచ్చిన రవి యీ సంతోష వార్త తన తల్లికి చెప్పాలని బయలుదేరుతాడు. కానీ దారిలో తల్లి మరణవార్త విని చితివద్దకు వెళ్ళి కుళ్ళి కుళ్ళి దుఃఖిస్తాడు.

శాంతమ్మ చనిపోయిన రోజున రవి వూరిలో లేడని, సదానందం అబద్ధం చెప్పాడని జోగారావు, లీల, భూషయ్యకు చెబుతారు. భూషయ్య బాధపడతాడు. రవి కొడుకు వుయ్యాలకు జోగారావు, లీల వెళతారు. ఇదే సమయమని జగదాంబ, సదానందం ఆస్తి తన పేర వ్రాసి యివ్వమని భూషయ్యను అడుగుతారు. భూషయ్య మండిపడతాడు. రవి యింటినుండి తిరిగి వచ్చిన జోగారావు, లీల మనమణ్ణి గురించి పొగుడుతారు; భూషయ్య మమకారం ఆపుకోలేక మనుమణ్ణి చూడడానికి వెళతాడు. తండ్రి, కొడుకులు కలిసి పోతున్నారని, జగదాంబ, సదానందం దుర్మార్గం ద్వారా సాధించాలని చలపతిని ఉపయోగించుకుని ఆస్తి వ్రాయించుకోవాలని ప్రయత్నం చేస్తారు. సమయానికి రవి వచ్చి అందరి ఆటా కట్టిస్తాడు. కనువిప్పు కలిగిన భూషయ్య, రవిని,సరోజని చేరదీస్తాడు.

శుభం


శ్రీ తుళజా భవాని క్రియేషన్స్
అట్లూరి పూర్ణచంద్రరావు సమర్పించు
శ్రీను. వాసంతి.. లక్ష్మి...
నిర్మాత : ఎన్.యమ్. సురేష్
స్క్రీన్ ప్లే - దర్శకత్వం : ఇ. శ్రీనివాస్
సంగీతం : ఆర్.పి. పట్నాయక్
Krishna DIGITALS

